

# శ్రీ వేదాన్త బాలబోధిని.

ఇది

ఉ. పా. కృష్ణయ్యగారిచే అరవమునుండి
ఆన్ధ్రానువాదము చేయబడినది

శ్రీ వ్యాసాశ్రమ వారివలన ప్రకాశితము

---


చిత్తూరు
శ్రీ వేంకటేశ్వర ముద్రాక్షరశాలయందు ముద్రితము

మొదటి కూర్పు 1000 ప్రతులు.

దీని వెల ] 1946 [ 2—4—0.

వలయువారు:

శ్రీ వ్యాసాశ్రమము, ఏర్పేడుపోష్టు, (చిత్తూరుజిల్లా)
అని వ్రాసిన పడయగలరు.


ఓమ్ తత్ సత్.

# విషయానుక్రమణిక

## మొదటియుపదేశము.

### గ్రంథముయొక్క నాలుగు అనుబంధముల వర్ణనము.



## రెండవయుపదేశము

### సామాన్యప్రశ్నోత్తరముల వర్ణనము

## మూడవయుపదేశము.



## నాల్గవయుపదేశము.

### బ్రహ్మాత్మైక్య సామాన్య నిరూపణము.

## ఐదవ యుపదేశము.

## దేహత్రయ ఆత్మవివేచన వర్ణనము.



## ఆరవ యుపదేశము.

## అవస్థాత్రయ ఆత్మవివేచనము.



## ఏడవ యుపదేశము.

## పంచకోశ ఆత్మవివేచనము

ఎనిమిదవ యుపదేశము.

మహావాక్యార్థ నిరూపణము.



తొమ్మిదవ యుపదేశము.

శిష్యుడు తన అనుభవమును బయలుపఱచుట, ఇంటికిపోవుఁ సన్న్యాసయోగమును చేకొనుట, అనువాని చెప్పుటతో గ్రంథ సమాప్తిపొందుట.

# పీఠిక.

ఈ 'వేదాన్త బాలబోధము'ను గ్రంథము యీ యుపాధి, చిన్నగా నుండినను చిన్నగానున్నదైనను. దీనిలోగల విషయములు గ్రహించియుండిన సిద్ధాంత సారము వృత్తి ప్రభాకరము, అద్వైతసిద్ధి, మొదలగు ఉన్నతగ్రంథములలో గల భావములను పదములను సులభముగా అవగాహనము జేసుకొనవచ్చును. ఇందునకై దీని తమిళ (ద్రావిడ) భాషలో నుండి యాన్ధ్రీకరించిన బాగుండునని తలంపు గలిగియుండెను. అరవములోను తెనుంగులోను పాండిత్యము లేనిచో యిది సాధ్యమగు పనికాదని తలంచియుండగా ఆశ్రమభక్తులు, ద్రవిడాంధ్ర పండితులున్ను వర్తమానమున గుడియాత్తములో హైస్కూలులో తెలుంగు పండితులుగానుండు ఉ. పా. కృష్ణయ్యగారు చాలాభక్తి శ్రద్ధలతో తెనుంగున ననువదించి యిచ్చిరి. ఇది వేదాన్త తత్త్వాభిలాషులకు. మిక్కిలి యుపయోగపడునని తలంచియే అచ్చువేయించడమైనది. వేదాన్తవిషయమై, హిందీలోను, అరవములోను నున్నన్ని గ్రంథములు తెనుంగులో లేవనియే చెప్పవచ్చును. దీనికి కట్టి యాలోచించిన నాంధ్రదేశమున వేదాంత బ్రహ్మనిష్ఠులు పై జెప్పిన దేశములలోనుండునట్లు యుండకపోవుటయే కారణమని తోచుచున్నది. ప్రస్తుతము పర్యాలోచించిన హిందూస్థాని, మహారాష్ట్ర, బెంగాళ తమిళ దేశములలోగల సాధువుల, సన్యాసుల, యోగుల, భక్తుల, మఠములు, ఆశ్రమములును, యీ దేశములో లేవనియే తోచుచున్నవి. అట్టి కొరంత యిప్పుడిప్పుడు శ్రీరామకృష్ణమఠమువారియొక్కయు శ్రీరమణ మహర్షి సంఘమువారియొక్కయు శ్రీ అరవిందయోగివారి భక్తులయొక్కయు శిష్యప్రశిష్యుల యభివృద్ధివలనను స్వాశ్రమములలోను పై జెప్పిన వారలలో సంబంధించిన యనేకులు జిజ్ఞాసువులు, ముముక్షు

లును సాధకసంఘములును నేర్పడుటవలనను పైజెప్పినకొంత
విస్తృతియగుచున్నది ఇదిఎంతో సంతోషకరము. మఱియు
శ్రీ గాంధీగారియొక్కయు, తదనుయాయుల యొక్కయు
నిర్మలమగు మహోపదేశముల వలనను సత్య, శాంతి, దయాదు
లభివృద్ధి పొందుటవలనను. పారిశుద్ధ్యాహార విహార పవిత్రత
వలనను గీతాపారాయణాదుల వలనను. అన్నిటికన్న ముఖ్య
కారణముగు జాతిపిశాచము నుచ్చాటన జేయుటవలనను, సర్వ
జనసోదర భావమభివృద్ధికొనికి వచ్చుటవలనను, ఉన్నతాశ
యముదయ మగుటవలనను, పై జెప్పిన కారణము శమించి
పోవుచున్నదని, సంతసింపదగిన విషయమే. అరుణోదయము
గాగానే చీకటినశించి యున్నవస్తువులును గనపడునటుల యీ
యాంధ్రదేశమునకున్న భాగ్యోదయమగుచున్నది, యనితలం
పుగలిగి మిక్కిలి యానందమావిర్భవించుచున్న సూర్యుడుద
యించునప్పుడు మరల జెప్పవలయునా! అట్టిస్థితియు పుణ్య
కాలమున్ను పరమ మహాత్ముల కరుణచేత త్వరలోగలుగుగాక!
జనులారా! ఆత్మవికాసమున కరుణోదయమైనది. చీకటంతయు
నశించినదని చెప్పవచ్చును. అదిగో జ్ఞానభాస్కరోదయమగు
చున్నది. యిక భయపడనక్కర లేదు. ధీరులుగండు! శూరులు
గండు! మంచిసాధకులు గండు. అంతియేజాలును.

మానవుల హృదయము శుద్ధమై బుద్ధివికసించునప్పుడు జ్ఞానవిజ్ఞానములు
కలిగ వికసించి వచ్చినందుచేత నే జీవరాసులలో కరుణయు, నిమ్నజాతులలో
దయయు నావిర్భవించివచ్చినది. ఈ రెంటింటికిన్ని కారణము శ్రీ గాంధీగారి
యొక్కయు తదను యాయులయొక్కయు పావనధర్మోపదేశమే యగుచున్నవి.
కావుననే శాస్త్రములయందు 'అహింసా పరమోధర్మః' అనియు 'కారుణ్యం
పరమంతపః' అనియు ఉద్ఘోషించుటకు కారణము. 'జిజ్ఞాసురపియోగస్య
శబ్దబ్రహ్మాతివర్తతే' అని శ్రీకృష్ణభగవానులు భగవద్గీతయందు ఉపదేశించిరి.

ఇట్లు మీ చరాచర సుఖాభిలాషియగు: శ్రీ మలయాళస్వామి.

లోకాస్సమస్తా స్సుఖినోభవన్తు. ఓమ్ తత్సత్.

# శ్రీ మలయాళస్వాముల స్తోత్రము.

-: పంచరత్నములు :-

తే॥ గీ॥ పుణ్యనిలయంబు నేర్పేడు పురమునందు
వెలయు వ్యాసాశ్రమాధిపు విమలమతులు
శమదమాదిక షడ్గుణైశ్వర్యయుతులు
శ్రీ మలయాళసద్గురు జేరికొలుతు. 1

తే॥ గీ॥ సిరుల కిరవగునేర్పేడు పురవరమున
నాశ్రితులగావనెంతయు నవతరించి
నట్టిశంకరునానొప్పు యమలమూర్తి
శ్రీ మలయాళస్వాముల చేరికొలుతు. 2

కం॥ వరమగు నేర్పేడ్పురమున
తిరముగ సంసారజలధి దీర్పనుగలమై
వరగు మలయాళస్వాముల
వరపదకమలములకిడుదు వందనశతముల్ 3

తే॥ గీ॥ చెప్పజింతింపఁజాలని శ్రేష్ఠమగుచు
దనరిచిన్మాత్రమయిగుణాతీతమగుచు
వరలుసద్గురు మలయాళస్వామివారి
పదయుగంబుల ప్రార్థించిప్రస్తుతింతు 4

తే॥ గీ॥ ఆశ్రయించెడుజనుల నజ్ఞానములను
దొలగఁజేయుచుసుజ్ఞాన మలవఱచియు
నెల్లరకుకల్పకంబయి నిష్టపూర్తి
వరలు మలయాళస్వామికి వందనములు. 5

శ్రీ గణేశాయనమః.

# శ్రీ వేదాన్త బాలబోధము.

—:0:—

## మొదటి యుపదేశము.

### 1 నాలుగు అనుబంధముల వర్ణనము.

#### మంగళము.

గ్రంథకర్త మందబుద్ధుల హితముకొఱకు శ్రీబాలబోధమను గ్రంథమును జేయ నారంభించువాఁడై మొట్టమొదట అద్వితీయ(2వదిలేని) ఆనందరూపబ్రహ్మము యొక్క యథార్థస్వరూపస్మరణరూప (జ్ఞాపకరూప) *1 మంగళమును జెప్పుచున్నాఁడు.

గీ॥ అద్వితీయమపార మానందమగుచుఁ
నేవిధంబగు దుఃఖంబు లేనియదియు
ఉత్తమాచార్యవరులచే నుడువఁబడుచు
నిశ్చయదృఢానుభవమగు నెఱుకచేత
జ్ఞానవాంఛలు పొందుటకైనదగును.

---

*1. విఘ్నధ్వంసమున కనుకూలమగు వ్యాపారమును మంగళమందురు. విఘ్నమనగా గ్రంథసమాప్తికి ప్రతిబంధకముగానుండు పాపము, దాని ధ్వంసము అనగా నివృత్తి. అందులో ననుకూలమైనవి. ఉపయోగముగల వ్యాపారమనగా మనోవాక్కాయంబులక్రియ. అది మంగళమనఁబడును. ఆ మంగళము గ్రంథకర్త మనస్సు మొదలగువానిచే చేయఁబడినదై గ్రంథసమాప్తి నిర్విఘ్నత్వమునకు హేతువగుచున్నది. అయినను గ్రంథకర్తయందుగల నాస్తికత్వముయొక్క భ్రాంతివిడి జిజ్ఞాసువులు గ్రంథమందు ప్రవర్తించుటకొఱకు గ్రంథప్రథమమునను మధ్యమందును అంత్యమందును మంగళము రచింపవలెనని

అర్థము:- ఏది అద్వితీయమును, అనంతమును, సుఖరూపమును నగుచున్నదో యది, యేవిధము దుఃఖమునులేని స్వభావముగల వస్తువే(బ్రహ్మమే) ఉత్తమోత్తముఁడగు ఆచార్యుఁడు బోధించుసత్యమగు ఉపదేశము చేతను నిశ్చయమగు దృఢానుభవముచేతను జ్ఞానవాంఛగలవారిచేఁ బొందుటకైనదగును.

ఇచట సజాతీయ విజాతీయ స్వగతభేదము లేనిదానిని అద్వితీయమందురు

1. సజాతీయ భేదమన - సమానజాతిలోగలభేదము:- ఎట్లన బ్రాహ్మణునికి వేఱొక బ్రాహ్మణునికి గలభేదము.

2. అన్యజాతులువారితో గల భేదము విజాతీయభేదము. ఎట్లన బ్రాహ్మణునకు శూద్రాదులలో గల భేదము విజాతీయ భేదము.

3. తన అవయవములలోఁగలభేదము స్వగతభేదము:-ఎట్లన బ్రాహ్మణునికి తన అవయవములగు కాళ్లుచేతులు, తల మొదలగు నవయవములందుగలభేదము స్వగతభేదము అనబడును.

1. అన్నిటికితానే తానగు (స్వరూపమగు) పరబ్రహ్మము ఒక్కటియైయుండుటచే దానికి సజాతీయమగు వేరుబ్రహ్మము లేదు. బ్రహ్మ చేతనమునందుగనబడు అంతర్యామి, సూత్రాత్మ, విరాట్‌బ్రహ్మ, విష్ణు, శివ, అను ఆరంభభేదములు ఉపాధి

---

శిష్యుల కుపదేశించుటకో అను శిష్టజనుల ఆచారానుసారము (పెద్దలువర్తించిన రీతి) పొందగలిగిన మంగళము ఏదియోయది గ్రంథమందు వ్రాయఁదగినది యగును. ఆ మంగళము వస్తునిర్దేశరూపము. ఆశీర్వాదరూపము, నమస్కారరూపమును భేదములచే మూఁడువిధములు. వాని అవాంతరభేదములిరువదియైదు వానిలో నిచ్చట నిర్గుణవస్తు నిర్దేశరూపమంగళము వ్రాయఁబడియున్నది.

భేదము చేనయినవి, స్వరూపముచేగాదు. గాన బ్రహ్మమొక్కటియే, దేనిచేనొక్కటియో దానిచేనది సజాతీయ భేదములేనిదగును.

2 బ్రహ్మచేతనమునకు వేరైనజడప్రపంచము బ్రహ్మమునకంటె విజాతీయమై కానబడుచున్నది. అది సత్యమైనచో బ్రహ్మమందు విజాతీయభేదము సంభవించును. బ్రహ్మమునకంటె వేరైన జడప్రపంచమన్ననో సత్యముగానిది. అయినను త్రాటియందు పామువలెను, అద్దమందు నగరప్రతిబింబమువలెను స్వప్నప్రపంచమువలెను, బ్రహ్మమందు కల్పింపబడినదగుటచే, మిథ్యయగును. ఏదిమిథ్యయగువస్తువో యది వాస్తవమగు అధిష్ఠానమునకు వేరుగాదు. కావున బ్రహ్మము విజాతీయభేదము లేనిదగును.

3. బ్రహ్మము నిర్విశేష ( విలక్షణతలేని ) ఏకరసమై యుండుటంబట్టి దానికి అవయవములు లేవు. సత్తు, చిత్తు, ఆనందమనునవి మొదలైనవి బ్రహ్మముయొక్క ధర్మములు. బ్రహ్మముయొక్క అవయవములుగావు. అయిననవి చందనముయొక్క రుచివాసన శీతముఅను గుణములపోలునవి. పుష్పముయొక్క స్పర్శము, రూపము, రసము, గంధము అనుగుణములవంటివి, అగ్నియొక్క దాహము ప్రకాశము అను గుణములపోలునవి బ్రహ్మముయొక్క స్వరూపమగును విచారించిచూడగా పరస్పరము బ్రహ్మమునకంటె వేరుగాదు. కావున నవియు బ్రహ్మముయొక్క స్వరూపమేయగును. దేనిచేనవి బ్రహ్మముయొక్క స్వరూపమో దానిచే బ్రహ్మము నిరవయవము. ఇందుచేతనే వానిచేనైన స్వగతభేదమును బ్రహ్మమునందులేదు. కావున బ్రహ్మము స్వగతభేదమును లేనిదగును.

ఈకారణములచే బ్రహ్మము సజాతీయ విజాతీయ స్వగత భేదములు లేనిదగుచున్నది అందువలన అద్వైతమగును.

బ్రహ్మము దేశకాల వస్తువుల భేదములచేనయిన త్రివిధ-మగు *2 పారము (అంతము) లేనిదియునెదరు. అపారమనెదరు. మూడువిధములగు నంతములేనిది

1. ఏవస్తువు అన్నిచోట్ల వ్యాపింపక యేదేనినొకచోట నుండునదగుచున్నదో దానికి దేశముచే నంతము గల్గుచున్నది.

---

2* పారము అంతము పరిచ్ఛేదము అను నీ మూడును, ఒక్కదానికే పేళ్లగును. వానిలో అత్యంతాభావమునకు (ఏమియులేని దానికి) ప్రతియోగిత యేదియోయది దేశపరిచ్ఛేదమనంబడును. పృథివిమాత్రమందుండు గంధగుణమునకు జలము మొదలగువానియందు అత్యంతాభావమున్నది. దానికి ప్రతియోగి గంధగుణమగును. దానియందు దాని ప్రతియోగితయున్నది. అది దేశపరిచ్ఛేదమగును. కావున గంధగుణము ఏకదేశమందుండునదిగా నుండుటంబట్టి దేశపరిచ్ఛేదముగలదగును.

ప్రాగభావ ప్రధ్వంసాభావముల ప్రతియోగితేదియో యది కాలపరిచ్ఛేదమనంబడును. మన్నుయొక్క కార్యమగు ఘటముయొక్క ఉత్పత్తికి పూర్వము ప్రాగభావమును ఘటముయొక్క నాశమునకు వెనుక ప్రధ్వంసాభావమునునున్నవి. ప్రతియోగి ఘటము. దానియందు. (ఘటమునందు) ప్రాగభావప్రధ్వంసాభావముల ప్రతియోగితయున్నది. అదియే కాలపరిచ్ఛేదమగును. కావున ఘటము ఉత్పత్తినాశముగలదగుటచే కాలపరిచ్ఛేదముగలదగును.

అన్యోన్యాభావముయొక్క ప్రతియోగిత వస్తుపరిచ్ఛేదమనంబడును. ఘటపటముల కొకటికొకటికి గలభేదమగు అన్యోన్యాభావము ఏదియో యద్దానికి ప్రతియోగిఘటమును పటమును నగును. వానిలో దాని ప్రతియోగితయున్నది. అది వస్తుపరిచ్ఛేదమగును. ఆ భేదముగల ఘటపటములు వస్తుపరిచ్ఛేదముగలవియగును.

కుండ, అంతటను వ్యాపింపక యేదో నొకచోట నుండునది గావుననే యది దేశమువలన నంతము గలదగుచున్నది.

బ్రహ్మమేదో నొకచోట నుండునది కాదు అంతట వ్యాపించి యుండునది. అన్నిచోట్లునున్ను, బ్రహ్మమున మాయచే గల్పింపఁబడినవగును. కావుననే బ్రహ్మమున కుపదేశముచే నంతములేదు.

2. ఏవస్తువు పుట్టుటకు ముందును, నాశనమునకు వెనుకయును, లేకయుండునదగునో యది కాలముచే నంతము గలదగును. మొట్టమొదటి వస్తువులు పుట్టుటకు పూర్వమును గిట్టుటకు వెనుకయును లేకయున్నవి. కావుననవి కాలము వలన నంతము గలవగును.

బ్రహ్మముచావు పుట్టుకలు లేనిదిగావున నిత్యమగును. దేనిచే నిత్యమో దానిచే నదికాలము వలన నంతము గలది కానేరదు.

3. ఏవస్తువునకు అన్యవస్తువుతో భేదము గలిగియున్నదో యది వస్తువుచే నంతము గలదగుచున్నది. ఘటమునకు వస్త్రముతోడ భేదముండుటంబట్టి ఘటమునకు వస్త్రమను వస్తువుచే నంతము చెప్పఁబడియున్నది

బ్రహ్మమునందు జడచేతనములగు సర్వవస్తువులును కల్పింపబడినవి. ఏది దేనియందు కల్పింపఁబడినదో అదిదాని స్వరూపమే యగును. మట్టియందుఁ గల్పింపఁబడిన ఘటము మట్టిస్వరూపమును, బంగారుచే కల్పింపఁబడిన కుండలము మొదలగునవి బంగారు స్వరూపములేయగును. దానివలెనే సకలవస్తువులును బ్రహ్మమందు కల్పితములు గావున నవి బ్రహ్మస్వరూపమగును,

ఇట్టుచేతనే బ్రహ్మము సర్వాత్మయగును. బ్రహ్మము సర్వాత్మ గానుండుట వలన బ్రహ్మమునకు ఒక్కవస్తువుతోను భేదము లేదు. ఎందుచే బ్రహ్మమునందు ఒక్కవస్తువుతోను భేదముగలు గదో దానిచే బ్రహ్మమునకు నొకవస్తువుచేతను నంతము లేదు.

వీనిచే బరబ్రహ్మము దేశకాలవస్తువుచేనైన నంతము లేనిదగును. కావుననే అపారము.

ఎక్కువప్రేమకు నేదివిషయమో యది సుఖమనఁబడును. దానినే యానందమందురు. బ్రహ్మము చీమ మొదలు బ్రహ్మ పర్యంతము గల సకలప్రాణులకును నాశించు విషయములుండు టచే ఇచ్ఛమఱపులగు నిమిత్తములచే నేకాగ్రమగు చిత్తము నందు తన ప్రతిబింబమగు విషయానందమును నిచ్చునదిగను, అన్నిటికిని ప్రత్యగాత్మగా నుండునది యగును. కావుననే యది యెక్కువ ప్రేమకు విషయ (చోటు) మగును. ఇందు చేతనే సుఖరూపమగును.

ఇచ్చట మునుపు చెప్పఁబడిన ప్రతిబింబమగు విషయసుఖ మునకన్న దానిసాధనమగు గంధము పుష్పము స్త్రీమున్నగు వానికన్నను ప్రియము కలుగుటచే నవియు ప్రియమునకు విషయములగును. దీనివలననే యవి ప్రియములగు వానిలో స్వరూపసుఖము యొక్కలక్షణము యొక్క అతివ్యాప్తి కలు గుననుశంక కలుగును.

దానిం దీర్చుట కొఱకు నాసుఖము దుఃఖసంబంధము లేని దందురు. ఏ దుఃఖమును లేనిస్వభావము గలది యదియని చెప్పిరి.

1. ముందుచెప్పిన విషయసుఖమును దాని సాధనమును అనంత దుఃఖములచే మూయఁబడియున్నవి గావున దుఃఖసం

బంధముగలవిగా నున్నవి. ఈస్వరూప సుఖమున్ననో అట్టిది
కానేరదు. అయినను దుఃఖమును దానిసాధనమున్నైన వీటి
కల్పితమునకు నధిష్ఠానమై యుండుటచే కల్పిత సర్పము యొక్క
సంబంధములేని రజ్జువలె అది దుఃఖసంబంధము లేనిదగును.
కాబట్టి విషయ సుఖమునకున్ను దాని సాధనములకున్ను విలక్ష
ణమైయుండుటచే స్వరూపసుఖమునకు చాటియుందు అతివ్యాప్తి
కాజాలదు.

2. లేక విషయసుఖము యొక్క సాధనములు తామే ప్రీతికి
విషయములుగావు. అయినను విషయసుఖమునకు హేతువులగు
టవలన ప్రీతికివిషయములగుచున్నవి. కావున నవిప్రియమన
బడుచున్నవి. విషయసుఖమేదియో పరమప్రీతికి విషయము
కానేరదు. అయితే ప్రీతిమాత్రమునకు విషయమగును. కావున
ప్రియతరమనబడుచున్నది. స్వరూపసుఖములో, పరమప్రీతికి
విషయమగుటచే ప్రియతరమనబడుచున్నది. కావున విషయ
సుఖముకన్నను దానిసాధనముకన్నను. స్వరూపసుఖము
యొక్క లక్షణమునకు అతివ్యాప్తిలేదు. (ప్రీతి, ప్రియము,
ప్రేమ, ఒకవస్తువు పేళ్లు).

ఇట సుఖమనుపదము సత్తు చిత్తు మొదలగువానికి
*3 ఉపలక్షణమగును. ఉత్తమగురువు, అనుటవలన బ్రహ్మ
నిష్ఠయు శాస్త్రజ్ఞానమునుగలవాడు అనునది చేకొనబడు
చున్నది సందేహావిపరీతములులేని దృఢాపరోక్షజ్ఞాన మను
భవమందురు. సత్యదృఢానుభవమే యనుకయనిరి.

---

* 3. లక్ష్యముయొక్క యేకదేశమందుండి లక్ష్యమును పూర్తిగ దెలిపించు
నదేదియో యది ఉపలక్షణమనబడును, లేక అజహల్లక్షణ (వాచ్యార్థము
విడువక దాని సంబంధముగల అధికఅర్థము దెలుపులక్షణ) అర్థమును దెలుపు

ఇట బ్రహ్మము సర్వాత్మమైయుండుటచే దానికి నేననుపదముయొక్క అర్థమగు ప్రత్యగాత్మతో గొంచెమైనను భేదము లేదు. కావున "నేనుసర్వాత్మయగు బ్రహ్మ"మను నిగూఢాభిప్రాయము అర్థముచే నెఱుగబడుచున్నది. (గూఢము=రహస్యము) ఇదియే వస్తునిర్దేశరూప మంగళమగును. దీనిచేనిట బ్రహ్మాత్మైక్యము అను నీగ్రంథవిషయము సామాన్యముగా సూచింపఁబడినది.

ఇక పైపద్యముయొక్క మొదటి సగముచే జిజ్ఞాసువులకు గ్రంథమునందు ప్రవృత్తికలుగుటకొఱకు సర్వదుఃఖముల నివృత్తియు పరమానంద ప్రాప్తియు నగు గ్రంథముయొక్క ప్రయోజనమును సూచించువాఁడై వస్తునిర్దేశరూప మంగళమును సమాప్తిచేసి రెండవసగముచే గురుభక్తి జ్ఞానమునకు సాధనమగుటను సూచించువాఁడై గురుభక్తిపూర్వకముగ గ్రంథారంభ ప్రతిజ్ఞను జేయుచున్నాడు:—

గీ॥ సకలదుఃఖంబులుం దీర సరసముండు
మహితమానందమదియు మంగళమునగును,
గురువరుపదంబుల నుతించి ధరరచింతు,
బాలబోధంబు బాలురుం దెలియునట్లు॥

---

నదియేదియో యది ఉపలక్షణమనబడును. ఆయుపలక్షణముచే దెలుపఁబడు అర్థమేదియో యది ఉపలక్షితమనబడుచున్నది, కాకము దేవదత్తుని ఇల్లు అనుచోటనున్నది. కాకము ఇంటియొక్కదేశమందుండి యింటినంతయు దెలిపించునదియైయున్నది. కావున నది ఉపలక్షణమగును లేక ఇట సుఖమను పదము ఏదియో యది అజహల్లక్షణ (విడువనిలక్షణ) చే సత్తు చిత్తు మొదలగు అధికఅర్థమును దెలిపించునదియైయుండుటచే దానికి (సత్తు, చిత్తు మొదలగు వానికి) ఉపలక్షణమగును.

తా॥ అవిద్యయు దానికార్యమునగు సకలయనర్థములును లేనిచోటుగలదగు విరోధములేని యానందరూపబ్రహ్మమే (విష్ణుమొదలగు సర్వదేవతలకు అధిష్ఠానమైయుండుటంబట్టి) చెప్పంబడు సాంగశరీరూపమయినదగు బ్రహ్మోపదేశము చేయదగిన కృపానిధియగుచు ఆచార్యుని పాదపద్మములను శిరము వందించి (సంస్కృతగ్రంథములకు తక్కినగొన్ని తెలుగు గ్రంథములను నేరనశక్తులగు మందబుద్ధులగు) బాలురెఱుంగునట్లు బాలబోధమను గ్రంథమును జెప్పుచున్నాను.

వృక్షముయొక్క వేరునందు జలముపోయుట వలనవృక్షపు శాఖలు మొదలగు సకలాంగంబులును దృప్తిబొందుచున్నవి. ప్రాణమునకు నాహారమొసంగుటచే సకలయింద్రియములకును తృప్తికలుగుచున్నది. అట్లు బ్రహ్మమును స్మరించుటచే సకల దేవతల స్మరణయుకలుగుచున్నది.

గురుభక్తి, జ్ఞానమునకు ముఖ్యసాధన మగునది యిచ్చట సూచింపఁబడినది.

2. ఇంటికి నాల్గుపాదములును లేక యుండిన నాయిల్లు నిలువనియట్లు సకల గ్రంథములకును నాల్గు అనుబంధములును లేకయుండిన గ్రంథము పూర్తిగలది కానేరదు వానిం దెలిసి ననే గాని వివేకులకు గ్రంథమందు ప్రవృత్తి గలుగ నేరదు. కాన గ్రంథారంభమున నాల్గనుబంధములును అవశ్యముచెప్ప వలసినవి యగును. ఈగ్రంథము వేదాంతము యొక్క ప్రకరణ మైయుండుటచే వేదాంతమున కేవి యనుబంధములో యవియే దీనికి నగును. అట్లయినను జిజ్ఞాసువులు తెలియుట కొఱకు నాల్గు అనుబంధములను సంగ్రహించి చెప్పవలసిన దగును.

ఆ యనుబంధముల నిప్పుడు ప్రయోజన పూర్వకముగాఁ జెప్పుచున్నాము.

అధికారి, సంబంధము, విషయము ప్రయోజనమను నీనాలుగింటికిని అనుబంధమని పేరు. (తన్ను దెలిసిన పిమ్మట ముముక్షువును గ్రంథముతోఁ బొందించునది యేదియో యది అనుబంధమనఁబడు చున్నది) ఈనాలుగనుబంధములను దెలిసిననే గాని వివేకికి గ్రంథమందు ప్రవృత్తి కలుగనేరదు. ఈ నాలుగనుబంధములనెఱిఁగి వివేకియగువాఁడు గ్రంథమును జూచును. గావున నీనాల్గనుబంధములను గ్రంథారంభమందవశ్యము చెప్పఁదగినదగును.

## ౩. అధికారి వర్ణనము.

స్థూలదేహమందు వాతము, పిత్తము, కఫము, అనుమూఁడు దోషములున్నవి. దానింబోఁగొట్టు నిమిత్తము ధన్వంతరి మొదలగువారు ఆయుర్వేదమును రచించియున్నారు. దాని వలెనే అంతఃకరణమునందును 1. మలము. 2. విక్షేపము. 3. అజ్ఞానను మూఁడు దోషములున్నవి. వానింబోఁగొట్టు నిమిత్తము కర్మకాండము ఉపాసనాకాండము, జ్ఞానకాండమను మూఁడు కాండములతోఁ గూడిన నాలుగు వేదములను పరమేశ్వరుడు రచించి యున్నాఁడు.

1. మలమనునది పాపమునకయినది. ఆపాపము జన్మాంతరములందు చేసిన అశుభకర్మముచే గలిగిన అధర్మము. అపూర్వము అదృష్టమను పేళ్లతోఁ గూడిన సంస్కార (వాసనా) రూపమయి యుండుటచే అతిశయ (అధిక) సూక్ష్మముగానున్నది. కావున ప్రత్యక్షముగచూచుటకు కానఁబడదు. ఐనను

అశుభవాసన మూలముగ దాని యనుమానము గలుగుచున్నది.

ఏపురుషునకు నిషిద్ధకర్మములచేత నైనను విషయములచే నైనను ఇచ్ఛ కలుగుచున్నదో వాని చిత్తమందు అశుభవాసనయున్నది. ఇందు చేతనే వాఁడు మలదోషముతో గూడిన వాఁడని తెలియఁ బడుచున్నది. కావున నిష్కామ కర్మము నైనను సర్వజీవుల యందును దయనైనను లేక ఈశ్వరనామ పఠనము మొదలగువానినైనను జేయవలయును. ఏలయన నిష్కామకర్మముచే నైనను సర్వభూతములందుంచు కరుణచే నైనను ఈశ్వరనామోచ్చారణచేనైనను మలదోషము నివృత్తి యగుచున్నది. వానిలో ఈశ్వర నామమును 4* క్రమప్రకార ముచ్చరించుటేదియో యది పాపము, విక్షేపము, చంచలత అను రెండు విధములగు మలమును నాశముచేయు నదియై యున్నది. తక్కిన కర్మము మొదలగునవి — పాపరూపమగు మలమును మాత్రము నాశము చేయునవియైయున్నవి.

2. చిత్తముయొక్క చంచలతకు విక్షేపమని పేరు. ఎవనిచిత్తము వేదాంతశ్రవణము మొదలగు వానియందైనను లేక మహావాక్యార్థమగు స్వస్వరూప మందైనను స్థిరముగాక అన్యవిషయములందు తిరుగుచున్నదో వానిచిత్తము చంచలమగును. ఇందువలననే యాపురుషుఁడు విక్షేపదోషముతోఁ గూడిన వాఁడని తెలియవలయును.

---

4*. ఇటఈశ్వర నామమును జపించు క్రమము;— 1 సాధువులనింద, 2 అసత్పురుషులవద్ద నామముయొక్క వైభవము చెప్పుట 3 శివవిష్ణువుల (దానిచే నుపలక్షింపఁబడిన గణేశ, సూర్య, దేవి అనువాటి) యందు భేదబుద్ధి 4 వేద వాక్యములందు అశ్రద్ధ (విశ్వాసహీనత) 5. శాస్త్రప్రవచనములందు అశ్రద్ధ

1. కాబట్టివాఁడు ఈశ్వరనామోచ్చారము, లేక 5* అజపామంత్రోచ్చారణము ఈశ్వరమూర్తి ధ్యానము, లేక నిర్గుణబ్రహ్మమును చింతించుటయును నీ మొదలగు ఉపాసనలను జేయువలయును. ఏలన ఉపాసనచేత చిత్తముయొక్క ఏకాగ్రతగలిగి విక్షేపదోషముయొక్క నివృత్తికలుగుచున్నది.

---

6 గురువాక్యములందు అశ్రద్ధ 7 ఈశ్వరనామ మాహాత్మ్యమందు అర్థవాదభ్రమ (యజ్ఞముయొక్క ఫలంబు అనిత్యుడట అనునట్టి స్తుతిని తెలిపించుటయేను ముఖ్యము) 8 నామము సర్వపాపములను బోగొట్టునను బుద్ధిచే నిషిద్ధకర్మల నాచరించుట. 9 గొప్పపుణ్యమును గలిగించునది నామము అను బుద్ధిచే విహితకర్మముల చేయక విడచుట. 10 అన్యధర్మములతో నామము సమముగనునుట ఈ పదియును నామముయొక్క అపరాధములు.

ఈ యపరాధములు పదింటినివిడచి (1) ప్రాతఃకాలము (2) మధ్యాహ్నకాలము (3) సాయంకాలము (4) మధ్యరాత్రికాలము, అను నీ నాల్గు కాలములందును విభజించి, లక్షమార్లైనను దానికెక్కువగానైనను ఈశ్వరనామము నుచ్చరించి దానియందు చిత్తవృత్తిని నిలుపవలెను. ఇది ఈశ్వరనామమును జపించు సామాన్యక్రమము. దీని విశేషక్రమము గురుముఖమున తెలియందగినది.

*5 సోహమ్మను మంత్రమును అజపామంత్రము లేక అజపాగాయత్రి యనుదురు. దీని జపమును అజపాజపమందురు. దీనిని నాల్గవటిప్పణిలో జెప్పినట్లు జపించుటయే చిత్తశుద్ధికి హేతువగును లేక చాలకాలమువరకు జపించుచుండిన ఎప్పుడువృత్తి అంతర్ముఖముగుచున్నదో, యప్పుడు శ్వాసము బైటవచ్చునపుడు సకారము (సో అనుదాని)ను శ్వాసము లోపల ప్రవేశించునపుడు హకారమును (హం అనుదాని) ధ్యానించవలెను. ఇది అజపాగాయత్రియగును. దీనికి ముఖ్యముగా నివృత్తిపరుఁడగు సన్న్యాసియే అధికారి. ఇది సోపాధికధ్యానము. దీనియందుండి సకారహకారములనుహల్లులనెత్తివేయగా

2. లేక శరీరము, వాక్కు, మనస్సు, ధనమనువానిచే ఈశ్వరునియందు బుద్ధిగలుగునట్లు చేయఁబడు బద్ధము లేని *6. గురుసేవ యేదియో దానిచే కర్మోపాసనలు లేకయే చిత్తశుద్ధియు, ఏకాగ్రతయు గలుగుచున్నవి.

మిగిలిన ఓం అను యక్షరమేదియో దాని ఉపాసన నిరుపాధికమగును. సోహం, ఓం అను రెండుపదములకును అర్థము ప్రత్యగాత్మమున కభిన్నమయిన బ్రహ్మము ఒక్కటియే. అది శుద్ధమైనదగుటచే నిరుపాధికమగును. ఐనను ఓమను నక్షరమందు సకార హకారమను ఉపాధుల చేరికచే సోహం అను పదముకలుగుచున్నది. అది సోపాధికమనఁబడుచున్నది. ఓంకారము యొక్క ఉపాసనక్రమము ఓంకారమను గ్రంథమందును, అద్వైత స్వబోధ సుధాకరమందును విస్తారముగా వ్రాయఁబడియున్నది. దానిం దెలియఁగోరు వారు అందు జూడఁదగినది.

*6 ఇటు యిది రహస్యము:— ఈశ్వరసేవచేనైన పుణ్యముయొక్క యుత్పత్తిమూలమున అదృష్ట ఫలప్రాప్తి కలుగుచున్నది. ఈశ్వరబుద్ధిచే జేయఁబడిన గురుసేవచే పైజెప్పిన అదృష్టఫలప్రాప్తియు, గురువు ప్రసన్నతయు దాని మూలమున ఉపదేశరూపమగు దృష్ట (ప్రత్యక్ష) ఫలప్రాప్తియుఁ గలుగుచున్నది. ఆ (గురు) సేవ శరీరము, మనస్సు, వాక్కు, ధనమును వాటి నర్పణముచేయుట గలుగుచున్నది.

గురువాజ్ఞను పరిపాలించుట శరీరార్పణము. గురువు నందీశ్వర భావమును ఆతని రూపమును ధ్యానించుటయు మనస్సుయొక్క అర్పణము. గురువును నిందింపక స్తుతించుట వాగర్పణము. గృహస్థుఁడగుగురువునందు సకలధనమునర్పణము చేయుట లేక సన్యాసియైన గురువు ప్రసాదము కొఱకు సర్వధనమును విడుచుట (ధనార్పణము) దయగల యొకానొక గురువు పైజెప్పిన సేవ లేకయే ప్రసన్నుఁడై ఉపదేశము చేసినను చిత్తశుద్ధిగల అధికారికి శుభము గలుగును. వానిలో శరీరము వాక్కు ధనము అనువాని యర్పణరూపగురు

(3) లేక యెవనికి మంద జిజ్ఞాసవలనను (జ్ఞానఆశవలనను) *7 వేదాంత శ్రవణముచేసైనను అభ్యాసము చేసైనను ప్రీతి పూర్వకముగా పరబ్రహ్మమునందు ప్రవృత్తి గలుగుచున్నదో వానికి కర్మోపాసనలు లేకయే చిత్తశుద్ధియు ఏకాగ్రతయు కలుగుచున్నవి. ఏలయన "శ్రద్ధ భక్తి గురుసేవ అనువానితో వేదాంతమును వినుటవలన ప్రతిదినమును 80 కృచ్ఛ్రచాంద్రాయణములయొక్క ఫలము కలుగుచున్నది." అనుటవలన పాపమగు మలమునివృత్తి యగుటతో చిత్తశుద్ధియు గలుగుచున్నది దీర్ఘకాలము నిత్యము నెడతెగక ఆశతో వేదాంత శ్రవణాభ్యాసముచే దృష్టాంతము ఇతిహాసము మొదలగువానిచే నాటకమును జూచుటవలన నెట్లు వినోదము కలుగుచున్నదో యట్లు బుద్ధికి వినోదముకలుగు చున్నది. ఇందుచే విక్షేపమగు మలము యొక్కనివృత్తి పూర్వకమగు చిత్తము యొక్కయేకాగ్రత కలుగుచున్నది యనుట అభిప్రాయము.

---

సేవచే మలదోషనివృత్తియు మనస్సుయొక్క అర్పణరూపగురుసేవచే విక్షేప దోష నివృత్తియు గలుగుచున్నవి.

* 7 ఇట యిది రహస్యమగును:— ఎవనికి దృఢజ్ఞానము గలిగియున్నదో వానికిఁ జేయవలసిన దొకటియు లేదు. ఎవనికి తీవ్రజిజ్ఞాసఁ (జ్ఞానమున ఆశ) గలిగియున్నదో లేక మందజ్ఞానము గలిగియున్నదో వానిచే శ్రవణాదులు చేయఁదగిన వగును. కర్మోపాసన చేయవలసినది లేదు. ఏ సుబుద్ధికి మంద జిజ్ఞాసచే వేదాంత శ్రవణమున ప్రవృత్తికలుగుచున్నదో వానిచేతను శ్రవణము చేయఁదగును. ఎవనికి మంద జిజ్ఞాస యుండియు వేదాంత శ్రవణమున ప్రవృత్తికలుగలేదో వానిచే నిష్కామకర్మయు ఉపాసనయు చేయఁదగినవగును. ఎవనికి వైరాగ్యలేశము లేమిం జేసి మందజిజ్ఞాసయు లేదో వానికి సకామ కర్మోపాసనలు చేయఁదగినవగును.

8. బ్రహ్మమగు ఆత్మను నేదెలిసికొన లేదు. అను*8వ్యవహారమునకు ఏదిహేతువో యది *9 అజ్ఞానము. ఎవని చిత్తము నందిట్లు కనఁబడుట కలుగు చున్నదో వాడజ్ఞాని. వానికి తత్వజ్ఞానమును సంపాదించుట తగినదగును. ఏలనతత్వజ్ఞానముచేత అజ్ఞానము నివర్తించుచున్నది. తక్కిన సాధనములచేత నివర్తించుటలేదు. అయితే యాతత్వజ్ఞానము అధికారికిదొరకును. ఆ యధికారి యెవఁడన:— ఎవనికిజన్మమందైనను జన్మాంతరమందైనను చేసిననిష్కామ కర్మ, ఉపాసనలచేత మలవిక్షేప దోషములు నాశమై మూడవదియగు అజ్ఞానదోషము మిగిలి యున్నదో వివేకము మొదలగు నాల్గు సాధనములగలవో యాపురుషుడు ఈగ్రంథమునకును ఈ గ్రంథ విచారమూలకముగ ఆత్మజ్ఞానమునకును ఆత్మజ్ఞానమూలకముగ మోక్ష

* 8 చెప్పుటయు కనఁబడుటయు వ్యవహారమందురు.

*9 ఆవరణశక్తివిక్షేపశక్తులుం గల అనాది అనిర్వచనీయ భావరూపము అజ్ఞానపదార్థమగును. బ్రహ్మమును ఆత్మను కప్పియుంచుట ఆవరణమగును. ఇట్టి శక్తి ఆవరణశక్తి యగును. ప్రపంచమును దానిజ్ఞానమును విక్షేపమగును. దానిం గల్పించు సామర్థ్యమేదిగలదో యది విక్షేపశక్తియగును. ఉత్పత్తిలేని దానిని అనాది యందురు. ఘటము మొదలగు కార్యముల ప్రాగభావమును బోలె అజ్ఞానమునకు ఉత్పత్తిలేదు. గాన యది (అజ్ఞానము) అనాదియగును. సత్తు అసత్తునకు విలక్షణమై (బాధింపదగినస్వరూపముగలదిగా) యుండుటచే అజ్ఞానము అనిర్వచనీయ మగును. దీనినే మిథ్యయందురు. ఉన్నదియను వ్యవహారమునకు నేది హేతువో యది భావరూపమగును. ఎందుచే అజ్ఞానము జగమునకు ఉపాదానమగుటచే ఉన్నదియనువ్యవహారమునకు హేతువగుచున్నదో దానిచే నది భావరూపమగును. అనిర్వచనీయమై యుండి ఏది భావరూపమై యున్నదో యది అనిర్వచనీయ భావరూప మనఁబడును. ఈయజ్ఞానమునే కారణదేహము అవిద్య మొదలగు పేళ్లచే చెప్పుచున్నారు.

మునకును అధికారియగును.

### 4. నాలుగు సాధనముల పేళ్లు:—

మొదటిదివివేకము; రెండవదివిరాగము; మూడవదిషట్సంపత్తి; దీనిని జిజ్ఞాసువగువాడు ధరించి నాల్గవదగు ముముక్షుతను ఆశించును. ఇవి నాల్గుసాధనములు అగును.

### 5. వివేకలక్షణము. (1)

ఆత్మ, నిత్యమును (అవినాశియును) క్రియలేనిదియును (అచలమును) నయి యున్నది. జగము అనిత్యమును (వినాశియు) చలమై (క్రియకలదియును) యున్నది. అని తెలిసికొని పాలు నీరు వేరుచేయుహంసమువలెసారమైన ఆత్మను అసారమైనఅనాత్మను దృఢముగా విచారింపవలెను. (వేరుచేయనేర్వవలెను) అదియువివేకము, ఇట్లుమనస్సున నిశ్చయము చేయుము.

సంశయము:— వివేకకాలమందు "జగము అనిత్యము అనగా మిథ్య అనియెప్పుడు తెలియఁబడెనో, అప్పుడు మరల ప్రపంచబంధముకొఱకుగల ఉత్తర (వెనకటి) సాధనములతో గూడినజ్ఞానమునకేమిప్రయోజనమున్నది?

సమాధానము:— వివేకకాలమున శాస్త్రముచేతను, యుక్తిచేతను, పరోక్షముగ జగత్తునుమిథ్యయని తెలిసికొన్నప్పుడును, అపరోక్షముగమిథ్యయని తెలిసికొనలేము. కావున ప్రపంచ అపరోక్షబాధము కొఱకు ఉత్తరసాధనముతోఁగూడిన జ్ఞానముచే ప్రయోజనము కలుగుచున్నది.

### 6 వైరాగ్యలక్షణము. (2)

"అర్జునా! బ్రహ్మలోకము మొదలు సర్వలోకములును పునరావృత్తి (తిరిగివచ్చుట) గలవని" భగవానుని వాక్యముందు

టుంజేసి, ఈలోకము మొదలు బ్రహ్మలోకము పర్యంతమగు సకలలోకముల భోగమును, ప్రమాణయుక్తులచేత తనచిత్తమందు అనిత్యమనియెఱింగి వానిని కాకిమలమువలె చిత్తము నందుండి విడిచిపెట్టవలెను. ఇట్లుదోషదృష్టిచేత ఇహలోకపర లోకభోగములపై ఆశనువిడుచుట ఏదియోయదివైరాగ్యమని తనబుద్ధియందు తలంపుము.

ఇట కాకిమలమును జేకొనునదేదియోయదిమలముయొక్క మలరూపమునుండుటంబట్టి మిక్కిలి విసుగు (దోషదృష్టి) విషయమగుననుదానిని గుర్తించుట కొఱకగును.

ఇటయిదివిశేషము:— విడచిన యిచ్ఛకు, లేక యిచ్ఛలేకుండుటకు వైరాగ్యమనిపేరగును. ఆవైరాగ్యము (1)యతమానము (2) వ్యతిరేకి (3) ఏకేంద్రియము (4) వశీకారమను భేదములచే నాలువిధములు.

1. మందవిరాగమునకు యతమానమనిపేరు.

2. నాకులియొక్క (ముంగిసపొరలినమూలిక) ఆశ్రయము చేత, సర్పముతో యుద్ధముచేయు నకులము (ముంగిస) వలె సత్సంగముయొక్క ఆశ్రయముచే దుర్గుణములవిడుచుటయందును సద్గుణముల చేకొనుటయందును గలుగు ఉత్సాహమేది యది వ్యతిరేకమగును.

3 ఇంద్రియములను అణచుటయగు దమమునకు ఏకేంద్రియమనిపేరు.

4 మనస్సు నిగ్రహమగు శమమునకు వశీకారవైరాగ్యమని పేరు. అందు వశీకారవైరాగ్యము 1 మందము 2 తీవ్రము 3 తీవ్రతరము అనిమూడు విధములు.

1 పుత్రుఁడు ద్రవ్యము మొదలగు వాని నాశముచే "ఛీ! యిదేమి సంసారము" అని కలుగు క్షణికబుద్ధివృత్తి మంద వైరాగ్యము.

2. ఈలోకము లోని పుత్త్రుఁడు మొదలగు సంబంధమగు సుఖమందిచ్ఛలేని దేదిగో యది తీవ్రవైరాగ్యమగును.

3. పునరావృత్తి గలవని తెలిసి సర్వలోకముల యిచ్ఛను విడుచుట తీవ్రతర వైరాగ్యమగును. వానిలో జ్ఞానమునకు కారణమై యున్న తీవ్రతరమును ముముక్షువగువాఁడు * 10 సంపాదింపవలెను.

## 7. షట్సంపత్తుల పేళ్లు:— (3)

శమము, దమము, ఉపరతి, తితిక్ష, సమాధానము విశ్వాసము, (శ్రద్ధ) అనునీయారింటినిపండితులు షట్సంపత్తియందురు

## 8. శమదమముల లక్షణము (1-2)

1. విషయ వాసన బలముచే ఉన్మత్తమగు మనస్సను ఏనుగు ఏదిగో దానిని విషయములలో అత్యంత దోష దృష్టి రూపమగు అంకుశముచే జయించుట (స్వాధీనము చేసి కొనుట) శమము అని తెలియునది.

2. శబ్దము మొదలగు నైదు విషయములరూపమగు మార్గమందు ప్రీతిగల యింద్రియముల సముదాయరూపమగు గుఱ్ఱ

* 10. మందతీవ్ర వైరాగ్యములందును, ఇహలోకపరలోకముల యిచ్ఛ అంతర్గతమై (అణగి) యున్నది. అదిజ్ఞానము యొక్క ప్రతిబంధకమగును. తీవ్రతర వైరాగ్యమందు ఇహలోకపరలోకముల యాశయును ప్రతిబంధకములేదు. కావున యది జ్ఞానమునకు సాధనమైనదై యుండుటవలన జిజ్ఞాసువగువాఁడు ...నిని సంపాదించుట యుచితమగును:

ములేవియో వానిని విషయములందు దోషదృష్టిపూర్వకముగా శాస్త్రచింతనాదిరూప జాటిచే జయించుట దమమని తెలియఁ దగినది.

ఇట, యుదిరహస్యము:— శరీరము రథము. దానికి ఇంద్రియములు గుఱ్ఱములు. మనస్సు కళ్లెము. బుద్ధి సారథి. ఆ రథమందుండు ఆత్మ రథికుఁడు.

(1) ఏ రథికుని బుద్ధియను సారథి, ప్రమాదముచే (మఱచిన వాఁడై యున్నాఁడో వానియింద్రియములగు గుఱ్ఱములుకుమార్గమందు (చెడుత్రోవయందు) బోవుచున్నవి. ఆ రథికుని నరకము మొదలగు దుఃఖరూపమగు గోతియందు త్రోయుచున్నవి.

(2) ఏ రథికుని బుద్ధియగుసారథి అప్రమాది (మఱపులేని వాఁడై) యై యున్నాఁడో వానియింద్రియములగు గుఱ్ఱములు సన్మార్గమందు పోవుచున్నవి. ఆ రథికుని స్వర్గము మొదలగు రూపమగు, లేక మోక్షరూపమగు నింటఁజేర్చుచున్నవి.

ఎందుచేత నిట్లున్నదో, దానిచే ముముక్షువునకు తన బుద్ధిరూపసారథి ఇష్టప్రకారము నడచుట, ఇష్టప్రకారము మాట్లాడుట, ఇష్టప్రకారము భుజించుట అను ప్రమాదమును బోకార్చి దానిమూలమున ఇంద్రియములను గుఱ్ఱములను సన్మార్గమునఁ బొందించుట తగినదగును.

ఇట బుద్ధియగు సారథిని వశముచేయుటశమము. ఇంద్రియములగు గుఱ్ఱములను వశముచేయుట దమమునగును. కావున సారథి ఆధీనమున గుఱ్ఱములును, గుఱ్ఱముల ఆధీనమున సారథియు నుండునట్లు బుద్ధికిని ఇంద్రియములకును నొకదానికొకటి

ఆధీనతయున్నది. కావున ముందుచెప్పిన శమదమములు ఒకదానికొకటి సాపేక్షములగును. ఇట్లు *11. షట్సంపత్తి పూర్తిగ నొకదానికొకటి సాపేక్షతగలదగుటచే నొకసాధన ముగా తలంపఁబడియున్నవని తెలియఁదగినది.

## 9. ఉపరతి తితిక్షల లక్షణములు. (3-4)

3. (ఇల్లు ఇల్లాలు పుత్త్రుడు ధనము మొదలైన మునుపే చిక్కినవగు విషయములందు దోషదృష్టిచే మలమందైనను వాంతియందైనను నిచ్ఛలేకయుండటవలె, ఇచ్ఛలేక యుండుట వైరాగ్యమగును. ఈవైరాగ్యము కలిగిన పిమ్మట ముందుండు విషయముల విడుదలయగు సన్యాసము కలుగుచున్నది) ఆవై రాగ్యమునకు విలక్షణమై ముందు విడువఁబడి మరలవచ్చి చేరు నట్టి విషయముల విడిచిన మలమువలెనైనను వాంతివలెనైనను త్యాగము చేయుట (అంగీకరించక యుండుట) అనగా మరల దానియందు (ఇష్టము) కలుగక యుండుట యేదియో దానిని వైరాగ్యము యొక్క ఫలమగు ఉపరతి యందురు.

4. శ్రవణాదులను సాధించునపుడు, వానికి విరోధము అగు శీతము, ఉష్ణము (ఆకలిదప్పులు, సుఖదుఃఖములు, లాభనష్ట ములు) మున్నగు ద్వంద్వధర్మముల సహించుటను, సాధువులు తితిక్షయందురు.

ముందు చెప్పఁబడిన తితిక్షనువిడచి ద్వంద్వధర్మముల విడు చుటయందు తత్పరుఁడై యుండు ముముక్షువునకు వేదాంత శ్రవణ మున్నగువానియందు వ్యవధానము (అంతరాయము=

* 11. షట్సంపత్తియను సమాధులు ఒకదాని కొకటి తోడగుటను, విచార సాగరము మొదటితరంగము టిప్పణిలోఁజూడుము.

మఱచుట) కలుగును. కావున తితిక్షయున్ను శ్రవణమున నుపయోగముగా నుండుటచే శ్రవణమునకు సాధనమైనదగును, ఇట్లు తక్కిన వివేకము మొదలగునవియు శ్రవణమునకు సాధనములని తెలియునది.

10. సమాధాన శ్రద్ధల లక్షణము. (5-6)

5 బ్రహ్మమను లక్ష్యమందు చిత్తము ఏకాగ్రముగా (తత్పరముగా) నుండుటను సమాధానమందురు.

6. వేదాంతశాస్త్రి వచనమందును, గురువాక్యమందును, గలుగు విశ్వాసము (ఆస్తిక్యము=నమ్మిక) ఏదిగలదో యది శ్రద్ధ యగును, పూర్వము ఉపాసనచేగలుగు చిత్తైకాగ్రత ఏదిగలదో యది సగుణబ్రహ్మమందైనను లేక దానిం దెలుపు (గుర్తించు) ప్రతిమ మొదలగు వానియందైనను గలుగునది యగును. ఇట చెప్పిన చిత్తైకాగ్రత, నిర్గుణబ్రహ్మమందు చిత్తము తత్పరమగుట యగును. ఇదివాని భేదములు.

ఇట షట్సంపత్తుల మధ్యశ్రమను కడపట చెప్పుటలో అభిప్రాయము ఇది :— వృక్షపుఫలమేదిగలదో యది యంత్యమందు (కడపట) కలుగుచున్నది. కావున వృక్షమందు సర్వాంగములలో ఫలము శ్రేష్ఠమగును. ఇందుచేతనే అదిముఖ్యమైనది యాయెను, అట్లుజ్ఞానముయొక్క సాధనములగు వివేకము వైరాగ్యము, శమము మొదలగు నవన్నిటియందును శ్రద్ధశ్రేష్ఠమగును. ఇందుచేనది ముఖ్యమైనది. కావున, నది కడపట చెప్పఁబడియున్నది.

ఫలముయొక్క యుత్పత్తికి పిమ్మట ఫలపరిపాకావస్థ కలుగునట్లు శ్రద్ధయుత్పత్తికి పిమ్మట ముముక్షుత్వము కలుగు

చున్నది. కావున ముముక్షుత్వము, శ్రద్ధయనుఫలముయొక్క పరిపాకావస్థయగును. ఇందుచేతనే యది శ్రద్ధకువెనుక చెప్పఁబడినది.

ఇట యిదిరహస్యము:— శాస్త్రము గురువు మున్నగువాని వాక్యములందు కలుగు శ్రద్ధయనునది, ఈశ్వరుఁడు గురువు మొదలగువారి భక్తిలేక కలుగదు. ఎవనిచిత్తమున మొదట ఈశ్వరుఁడు గురువు, తక్కిన ఋషులు, మునులు బ్రహ్మనిష్ఠులున్ను వీరియందు, పూజ్యులు (పూజింపఁదగిన వారను) బుద్ధి (ప్రీతిరూపమగు) భక్తిగలుగుచున్నదో వానికే వేదము మొదలగు శాస్త్రములందును గురువు మొదలగువారి వాక్యములందును భక్త్యనుసారముగా (ఎట్లు భక్తియో అట్లు) శ్రద్ధ కలుగుచున్నది. కావున భక్తి యనునది జ్ఞానమునకును, జ్ఞానముయొక్క సర్వసాధనములకును ముఖ్యకారణమగుచున్నది. ఇందుచేతనే శ్రద్ధ * 12. భక్తిపూర్వకముగానుండుటచే సర్వసాధనములందును ముఖ్యమగు సాధనమునగును.

ఇచ్చట యిది రూపకము:—

1. మోక్షసాధనముల సంపత్తి (పొందుట) వృక్షమగును.
2. దానికొఱకు నిష్కామకర్మ మొదలగు ప్రయత్నములచేఁ జేయఁబడిన శుద్ధచిత్తము, నేలయగును,
3. ఈశ్వరుడు, గురువు మొదలగువారిపై భక్తి విత్తనమగును
4. మందవివేకము మొలకయగును.
5. దృఢ వివేకము అడుగుమ్రానను.

* 12. ఇచ్చట "భక్తిపూర్వకమను" పదమునకు భక్తియను విత్తుతో కూడినదని యర్థము.

6. వివిధమగు వైరాగ్యము శాఖలగును
7. శమము మొదలగు నైదుసాధనములు పుష్పముల గుత్తులు.
8. గురువాక్య శ్రవణము దానిమీఁదకలుగు *13 మగ వృక్షపు సంయోగమగును.
9. *14. శ్రవణమనననిదిధ్యాసన మొదలగు నన్యసాధనములు ఆ పండ్ల సంపత్తగును.
10. శ్రద్ధ పండ్లగును.
11. ముముక్షుత్వము పండ్లపరిపాకదశయగును.
12. జ్ఞానము ఆ పండ్లరసమగును.
13. ఆపండునందును నిష్ప్రయోజనమగు భక్తియను బీజమున్నది.

ఆపండుయొక్క జ్ఞానమనురసమేదిగో యది శ్రద్ధయను పండుయొక్క యధీనమగును. ఏలయన ముందుజెప్పిన శ్రద్ధయనుపండు ఎండిపోయిన, జ్ఞానమనురసము ను ఎండును, గాన, జ్ఞానమను రసము శ్రద్ధయను పండుయొక్క యాధీనమగును.

---

*13. నిష్ఫలవృక్షమును మగవృక్షమనియు, సఫలవృక్షమును ఆడువృక్షమనియు చెప్పుదురు. అరిసెల్లి, ద్రాటి, మొదలగుకొన్ని ఆఁడు వృక్షముల మీఁద ఎప్పుడు మగవృక్షముల, లేక దానిపుష్పముల సంయోగము కలుగుచున్నదో అప్పుడు అవి ఫలించుచున్నవి. ఇది లోకప్రసిద్ధము.

*14. శ్రవణము జలము విడుచుట, మననము సంశయము మొదలగు కలుపుతీయుట, నిదిధ్యాసనము కావలి, వానిచే భేదవాది పాషండపురుషుఁడను [illegible] మొదలగు పశుపక్షులనుండి కాపాడుట, పదార్థశోధన ఎండిన శాఖ మొదలగు చెత్తలను తీయుటయగును. ఈ గుణవి కల్పించఁబడెను.

ఆపండును *15 భుజించుటపర్యాలమున *16. దానిరసము న్ను కడుపున నెలకొనును. గావునజీవించియుండుదనుక విద్వాంసుల చిత్తమున శాస్త్రగురువాక్యములచే నిశ్చయింపఁబడిన యర్థము నందుస్వభావమగు శ్రద్ధయుండును. అంతదనుక జ్ఞాననిష్ఠయు నుండును.

ఆపండును అనభిజ్ఞుఁడు (జ్ఞానములేనివాఁడు) అగుపురుషుఁడు భక్తియను రుచిగల విత్తుయొక్క యుపేక్షతో భక్షించుచు న్నాఁడు. వానికి అధిక రుచి కలుగుటలేదు. అభిజ్ఞ (జ్ఞానము గల) పురుషుఁడు భక్తియను విత్తుతోను జ్ఞానమగు రసము తోను నాపండును భుజించుచున్నాఁడు. వానిచే దాని అధిక రుచి ననుభవింపఁబడుచున్నది.

ఈ విధముచే ముందు చెప్పిన శ్రద్ధయను ఫలమునకు జీవన్ముక్తి, రుచియగును. విదేహముక్తి, దానిచేనైన ఆకలిని నివర్తించుట తృప్తియగును

11. ము ము క్షు త్వ ము యొ క్క ల క్ష ణ ము. (4)

ఆకలిగలపురుషుఁ డెట్లు. అన్నము ను ఆశించుచున్నాఁడో, అట్లు మోక్షముయొక్క తీవ్రమయిన యిచ్ఛయేదిమో దానిని పండితులును సద్గుణులగు మునిశ్రేష్ఠులును. (సన్యాసులగు ఆచార్యులు) ముముక్షుత్వమని చెప్పుదురు.

చెప్పబడిన ముముక్షుత్వము, సర్వసాధనములకుముందుగా

*15. విచారముచేత ధారణపర్యాలముగా. అనగా తాత్పర్యముచే నిశ్చయింపఁబడిన నిష్ఠపర్యాలముగా.

*16. శాస్త్ర గురువాక్యములచే నిశ్చయింపఁబడిన పరమార్థమగు అద్వైత, అర్థమందు.

మందరూపముగా, కలుగుచున్నది ఏలయన. "ప్రయోజన మనుద్దిశ్య న మందోఽపి ప్రవర్తతే" ప్రయోజనము నుద్దేశించక మందుఁడును ప్రవర్తించుట లేదు అను న్యాయము చేమోక్షమను ఫలముయొక్క యిచ్ఛలేక, నిష్కామకర్మ మొదలగు సాధనములందు నొకనికిని ప్రవృత్తి కలుగనేరదు. కాఁబట్టి మందముముక్షుత్వము సకల సాధనములకు, మొదట కలుగుచున్నది. అయిననది తీవ్రముగా లేదు.

తక్కిన సాధనములు సిద్ధించినపిమ్మట, తీవ్ర ముముక్షుత్వము కలుగుచున్నది. అదియే, గురుజ్ఞను శరణుపొందుటయనునది ముందుగల శ్రవణము మొదలగు వెనుకటిసాధనముల ప్రవృత్తికి హేతువగుచున్నది.

12. అధికారియందు కర్తవ్యమును గుర్తించుట,

ఇట్లు చెప్పఁబడిన అధికారి యొవఁడో వాఁడు సద్గురువు చరణములందు తలవంచి *17 విధిప్రకారము శరణుచొచ్చును. శ్లో॥ తద్విజ్ఞానార్థం సద్గురుమేవాభిగచ్ఛేత్సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం। శాన్తో దాన్త స్తితిక్షుః శ్రద్ధాన్వితః సమాహితో భూత్వాఽఽత్మన్యేవాత్మానం పశ్యేత్॥ ఆబ్రహ్మమును దెలిసికొనుటకొఱకు అయ్యధికారి, సమిత్పాణియై (పత్రపుష్పఫలాదులు గైకొన్నవాఁడై) శాంత (శమము) గలవాఁడై దమము తితిక్ష శ్రద్ధగలవాఁడై, సమాధానముతోఁ గూడనవాఁడై, శ్రోత్రియుఁడును (శ్రుతి దెలిపినవాఁడు) బ్రహ్మ

* 17. ఇచ్చట గురువును శరణుపొందు విధమును దెలుపుశాస్త్రవచనము విధియనఁబడును. ఈ "విధిప్రకారము" అను శబ్దముయొక్క అర్థము దాని తెలిసినను (దానినను సరించి) గురువును శరణుచొచ్చు క్రమముపై రెండవ యుపదేశమున 17 గ. వివరింపఁబడును.

నిష్ఠుఁడును నైనగురువునే పొంది బ్రహ్మమయినయాత్మయందే కూటస్థుఁడయిన ఆత్మను ఏకరూపముగా జూచునుగాత” అను శ్రుతిచేత.

## 13. గు రు ల క్ష ణ ము

1. బ్రహ్మనిష్ఠామార్గము యొక్క అనుభవముగలవాఁడై, మార్గమును జూపుపురుషునివలె బ్రహ్మమునందు నిష్ఠగల వాఁడై.

2. శ్రోత్రియు (మార్గముయొక్క గుఱుతులను దెలిసి, మార్గమునుజూపు పురుషునివలె శ్రుతుల అర్థమును దెలిసిన) వాఁడై.

శరణుపొందిన శిష్యునకు మార్గమును జూపు పురుషునివలె అద్వైతబ్రహ్మమును నుపదేశించువాఁడెవఁడో ఆతఁడే శ్రీమంతుఁడగు బ్రహ్మవిద్యయగు లక్ష్మిని గల గురుదేవుఁడగును.

కావున శరణుబొందిన శిష్యుఁడు. ఆగురువునకు నెప్పుడును సేవచేయువలెను.

జ్ఞానమునకు పూర్వముచేయు, ఈశ్వర, గురు, వేదాంత, శాస్త్రముల, సేవయైనది జ్ఞానము సిద్ధించుట కొఱకగును. జ్ఞానము కలిగినపిమ్మట చేయునట్టి నీ మూటియొక్క సేవచే, మేలును మఱచుట అనుదోషముపోవుట కొఱకగును. ఈ యభిప్రాయముచేతనే ఇచ్చట ఎప్పుడును సేవచేయువలయునను నది చెప్పఁబడినది.

## 14. స ం బ ం ధ వ ర్ణ న ము (2)

ఈ గ్రంథము బ్రహ్మముయొక్క ప్రతిపాదకము (బ్రహ్మమును చెప్పునది) ను, బ్రహ్మ మీగ్రంథముచే ప్రతిపాద్యమును (చెప్పఁబడునదియు) నగును.

ఈ రెంటికిని నొకదానికొకటి ప్రతిపాద్య ప్రతిపాదక భావ రూపసంబంధము ప్రసిద్ధముగానున్నది.

1. ప్రతిపాదనముచేయునదేదియో యది ప్రతిపాదకమనఁబడును. ఈ గ్రంథము బ్రహ్మమును ప్రతిపాదనముచేయునదై యుండుటచే ప్రతిపాదకమగును.

2. ఏది ప్రతిపాదనము చేయఁబడుచున్నదో యది ప్రతిపాద్యమనఁబడును. బ్రహ్మము ఈ గ్రంథముచేఁ బ్రతిపాదనము చేయఁబడుటచేఁ బ్రతిపాద్యమగును.

ఇది మొదలగు మరియు ననేక విధసంబంధములను చెప్పుదురు. వానిని విస్తరించునను భయముచే వ్రాయకవిడచితిని.

ఇచ్చట సంబంధమగు అనుబంధమును కల్పించుటకు, ఇది ప్రయోజనమగును ఏవస్తువునకు దేనితో సంబంధమున్నదో, యా వస్తువునకు దానియందుపయోగమున్నది. కుమ్మరి మొదలగువారికి కుండతో సంబంధమున్నది. అందుచే వారు ఘటమునందుపయోగపడుచున్నారు. ఏవస్తువునకు దేనితో సంబంధము లేకయున్నదో, యావస్తువునకు దానియందుపయోగము కలుగుటలేదు. నేత్రమునకు వాయువుతోను, ఆకాశముతోను సంబంధము లేదు. కావున నేత్రమునకు వాయువునందును ఆకాశమునందును ఉపయోగముకలుగుట లేదు. అట్లు గ్రంథమునకును బ్రహ్మమునకును పరస్పరము (ఒకటికొకటి) సంబంధము లేకున్న గ్రంథమునకు బ్రహ్మమందును బ్రహ్మమునకు గ్రంథమందును ఏయొక్కయుపయోగమును సిద్ధింపదు. కావున, పరస్పరముపయోగము పరస్పరమందు నిశ్చయించుటకొఱకు వాని సంబంధము కల్పింపఁబడియున్నది. ఇట్లు తక్కినసంబంధములందును దెలిసికొందురుగాత! తంత్రికి

పుత్త్రుఁడు జన్యుఁడగుటచే పితకు తన జన్యమైన పుత్త్రునితో జన్యతాసంబంధమున్నది. అట్లు గ్రంథమునకు, బ్రహ్మము ప్రతిపాద్యమైయుండుటంజేసి గ్రంథమునకు తన ప్రతిపాద్యమైన బ్రహ్మముతో ప్రతిపాద్యతా సంబంధమున్నది. పుత్త్రునికి పిత జనకుఁడై యుండుటచే పుత్త్రునికి తనజనకుఁడైన పితతో జనకతాసంబంధమున్నది. అట్లే బ్రహ్మమునకు గ్రంథము ప్రతిపాదకమగును; అందుచే బ్రహ్మమునకు తన ప్రతిపాదకమైన గ్రంథముతో ప్రతిపాదకతా సంబంధమున్నది.

ఎట్లు పితకు పుత్త్రునికి నొకరికొకరికి జన్యజనకతా రూప సంబంధమున్నదో అట్లు గ్రంథమునకును బ్రహ్మమునకును నొకదానికొకటి ప్రతిపాద్యప్రతిపాదకతా రూపసంబంధమున్నదనునది సిద్ధించినది,

## 15. విషయ వర్ణనము (3.)

జీవబ్రహ్మైక్యము, ఈగ్రంథమునకు విషయమగునని పండితులు వేదమను సముద్రమును చిలికి నిశ్చయించియున్నారు.

ఇచ్చట "జీవుఁడు" అను శబ్దముచే జీవపదమునకు లక్ష్యార్థమైన కూటస్థ ఆత్మయను జీవసాక్షి చెప్పఁబడుచున్నది.

ఇచ్చట యిది శంకాసమాధానములగు విశేషఅర్థమగును.

శంక:— బ్రహ్మాత్మైక్యము ఈ గ్రంథమునకు విషయమని చెప్పినది పొసగదు. ఏలనగా సకలశరీరములందును ఆత్మయొకటియై యుండెనేని దానికి, ఏకమైన బ్రహ్మముతో నైక్యముసంభవించును. ఎందుచే సకలశరీరములందును ఆత్మయొకటిగాక అనేకములైయున్నవో, అందుచే దానికి ఏకమగు బ్రహ్మముతో నైక్యము పొసఁగదు.

సమాధానము:— ౧. సర్వశరీరములందును ఆత్మఅనేక

ములై యున్నవి అనుఅర్థమందు ఒక్క *18. ప్రమాణమును నుండదు.

౯. అజ్ఞానులకు ఇంద్రియమగు ప్రత్యక్షప్రమాణముచే *19 భేదముకనఁబడుచున్నదో, యాభేదస్ఫూర్తియు, దేహమును విషయముచేయునదగును. ఆత్మను విషయము చేయునదికాదు, ఏలయన ఆత్మ శ్రుతికి వేరైన ప్రత్యక్షమొదలగు ప్రమాణములకు విషయముకానిదై యుండుటచే.

కావున సకల శరీరములయందును ఆత్మ, వేరువేరుకాదు. అయిన ననేకఘటములందుండు ఆకాశమువలె సర్వశరీరములందును ఆత్మ యొక్కటియేయగును. అందుచే దానికి ఒక్కటియైన బ్రహ్మముతో నైక్యముపొందును.

శంక:— "ఆత్మ వేరువేరనుటలో నొక్కప్రమాణమున్నలేదు." అని (సిద్ధాంతియైన) తాముచెప్పినది పొసగదు ఎలయన ఆత్మ వేరువేరను అర్థమునందు ప్రత్యక్షాదిప్రమాణములన్నియు ఇట్లు (ఈవిధముగా) సిద్ధించుచున్నవి.

౧. ఎక్కడెక్కడ అహంప్రత్యయము యొక్క (నేననువృత్తి

---

* 18. యథార్థ అనుభవమును ప్రమయందురు. ప్రమయొక్క కరణమును ప్రమాణమందురు. ఆప్రమాణము:- ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, శబ్దము, అర్థాపత్తి, అనుపలబ్ధి అనుభేదములచే నారువిధములగును.

*19. అన్యోన్యాభావమును భేదమందురు. ఒకదానియందొకటిలేకయుండుట అన్యోన్యాభావమందురు. ఘటమందు పటాభావమును పటమందు ఘటముయొక్క అభావమును వాని అన్యోన్యాభావమగును. అదియే వాని భేదమగును. ఆ భేదము సజాతీయభేదము విజాతీయభేదము స్వగతభేదమని మూడు విధములు. అది ఈగ్రంథముయొక్క మొదటిపద్యార్థమందు ఉదాహరణముతో వ్రాయబడియున్నది.

యొక్క) భేదమున్నదో అక్కడక్కడ ఆత్మకు భేదమున్నది

(అ) ఎందుచేత ఒక్కొక్కదేహమునందును "నేను బ్రాహ్మణుడను, నేను క్షత్రియుడను" అను నీవిధముగా అహంప్రత్యయము యొక్క భేదము ప్రత్యక్షముగా గనఁబడుచున్నదో.

(ఆ) సర్వదేహములందును ఆత్మ యొక్కటియై యుండునేని "నీవు" "నేను" "ఇది" అని నిమున్నగు వ్యవహారములకు లోపము కలుగును. దానివలన ఆత్మయొక్క భేదమునందు *20. ప్రత్యక్ష ప్రమాణమున్నది.

౨. ఎందుచే ఆత్మకు భేదములేకయుండిన "నీవు, నేను, ఇది" అను నిదిమున్నగు వ్యవహారము సిద్ధింపదో, అందుచేత వ్యవహారసిద్ధి భేదములేక సంభవింపక పోవుటవలన ఆత్మయొక్క భేదమందు *21. అర్థాపత్తి ప్రమాణమున్ను సిద్ధించుచున్నది.

3. (౧) ఆత్మ యేదియో యది యొక్కొక్కశరీరమునందును భిన్న భిన్నమగును శరీరరూపవ్యక్తులు భిన్నములుగా నుండుటచే, గోవు (ఆవు) మొదలగు పశువులవలె.

(౨) ఆత్మయేదియో యది ఒక్కొక్క శరీరమందును భిన్న భిన్నముగా నేయున్నది ఒక్కొక్కశరీరమందును అహం ప్రత్యయము యొక్క భేదముండుటవలన, ఘటాదులను వలె

*20. ప్రత్యక్ష ప్రమయొక్క కరణము (సాధనరూప పంచేంద్రియములు) ప్రత్యక్ష ప్రమాణమనఁబడును.

*21. ఒక పుష్టిగలపురుషుఁడు పగటియందు భుజించుటలేదు. అచ్చట రాత్రిభోజనములేక పుష్టి (లావు) సంభవింపదను జ్ఞానముచేత రాత్రిభుజించునను కల్పనకలుగుచున్నది. ఇచ్చట భోజనములేక పుష్టిసంభవింపదను జ్ఞానము అర్థాపత్తి ప్రమాణము. ఆ జ్ఞానముచేఁగలుగు రాత్రిభోజనపుకల్పన యేదియో యది అర్థాపత్తిప్రమయగును. దీనికి అనేక భేదములున్నవి.

నవి మొదలయిన *22. అనుమాన ప్రమాణములును ఆత్మ యొక్క భేదమందు సిద్ధించుచున్నవి.

౪. (౧) "అతిథి, దేవుఁడు, గంధర్వుఁడు, మనుష్యుఁడు, పితృదేవత, అసురుఁడు" అని యీలాగు దేవతలు మొదలగు వారి భేదము ప్రతిపాదించు శ్రుతులును,

(౨) "దేవుఁడు. దానవుఁడు, గంధర్వుఁడు, యక్షుఁడు, రాక్షసుఁడు, కిన్నరుఁడు," అను నివిమొదలగు పురాణవచనములును, ఆత్మభేదమందు *23. ప్రమాణములగును.

౫. సిద్ధాంతీ! తామెప్పుడు ఆత్మైక్యమును అంగీకరించుచున్నారో? అప్పుడు మీయొక్క వేదాంత సిద్ధాంతమునందు, సుఖదుఃఖము మొదలగువానికి వ్యవస్థసిద్ధింపదు. ఏలన,

(అ) ఒకఁడు దుఃఖి లేక సుఖియైన అందఱు దుఃఖులు లేక సుఖులు అగుదురు.

(ఆ) ఆత్మకు ఏకత్వముండిన సకలజనులు సర్వజ్ఞులగుదురు. అందుచే విధినిషేధరూపమగు శాస్త్రములు వ్యర్థమగును. సర్వజ్ఞులను బట్టి విధినిషేధములు లేక పోవుటవలన,

(ఇ) ఒకఁడు (బంధముగల) వాఁడైన యెడల అందఱు బద్ధు

---

*22. లింగముయొక్క జ్ఞానముచే గలుగుజ్ఞానము అనుమితిప్రమయగును. దానిసాధనమగు లింగముయొక్క జ్ఞానమేదియో యది అనుమానప్రమాణము. పర్వతమందుండు పొగయను అగ్నియొక్క లింగముగలది. దాని (లింగపు) ప్రత్యక్షజ్ఞానముచే నీకొండ అగ్నిగలది యను నిశ్చయమైన పరోక్షజ్ఞానము గలుగుచున్నది. అట్టి పొగజ్ఞానము అనుమానప్రమాణము. దానిచేగలుగు అగ్నిజ్ఞానము అనుమితిప్రమ. దీని విశేషప్రక్రమము వృత్తిరత్నావళియందు వ్రాయంబడియున్నది.

*23. ఇది శాబ్దప్రమయొక్క కరణమయిన శబ్దప్రమాణమగును.

లగుదురు. లేక యొకడు ముక్తుడైనచో నందఱు ముక్తులగుదురు.

కావున ఆత్మ అనేకమనునది ప్రమాణసిద్ధమగుచున్నది.

సమాధానము:— ప్రతివాది ఆత్మ అనేకమనుటలో నీవు చెప్పిన ప్రత్యక్షము మొదలగు ప్రమాణములు సంభవింపవు. ఏలయన,

౧ వ్యాప్తియొక్క వ్యభిచారమువలన ప్రత్యక్షప్రమాణము సిద్ధింపక పోవుటవలన,

(అ) "ఎక్కడెక్కడ అహంప్రత్యయముయొక్క భేదము న్నదో, యక్కడెక్కడ ఆత్మకు భేదమున్నది" అను నియమ (కూడగలుగు) మగు వ్యాప్తియేదిగలదో యది వ్యభిచారమును (వేఱగుటను) బొందుచున్నది. నేను శిశువు, నేను కుమారుడు, నేను యువకుడ, నేను వృద్ధుడ అని యీలాగు శిశుత్వము మొదలగు అవస్థల భేదములచే అహంప్రత్యయమునకు భేదమున్నను శిశుత్వము మొదలగు అవస్థలుగల అహంప్రత్యయార్థమగు ఆత్మకు భేదము కానఁబడకుండుటచేతను ఆత్మకు భేదముండిన బాల్యావస్థ మొదలు వృద్ధావస్థవఱకు చేసిన కార్యముల జ్ఞాపకము సంభవింపక పోవుటవలనను, ఆత్మయొక్క భేదమందు ప్రత్యక్షప్రమాణము సిద్ధింపదు.

(ఆ) ఎట్లు ఒకే శరీరమందు అవయవముల భేదములను నాశ్రయించి, తల, కాలు, చేతులు అను నివి మొదలగు వ్యవహారములు కలుగుచున్నవో అట్లు శరీరములన్నిటియందును ఆత్మయొక్కటియై యుండియు శరీరభేదమును నాశ్రయించి "నీవు, నేను, ఇది," అను నివి మొదలగు వ్యవహారములు సిద్ధించుచున్నవి.

౨. ఆవ్యవహారము ఆత్మభేదమును అపేక్షించుటలేదు.

ఇట్లు వ్యవహారము సిద్ధింపగానే ఆత్మభేదములేక వ్యవహారము సంభవింపదనుటలేదు. కావున ఆత్మభేదమందు అర్థాపత్తిప్రమాణమున్ను సిద్ధింపలేదు.

3. శరీరమగు వ్యక్తులభేదముచేతను, అహంప్రత్యయము యొక్క భేదముచేతను ఆత్మకును భేదమున్నదను అనుమాన ప్రమాణమున్ను సిద్ధింపదు. ఏలయన, స్థూల, సూక్ష్మ, కారణమను మూడు దేహములకును, జాగ్రత్స్వప్న దేహములకును భేదముండియు అహంప్రత్యయముయొక్క అర్థమగు ఆత్మకు భేదములేనందున,

౪. (౧) ముందుచెప్పిన శ్రుతి, ఆత్మోపాధియగు దేవాది దేహముల భేదమును జెప్పుచున్నది; ఆత్మభేదమునుగాదు. ఎందుకన సకలదేహములందును చైతన్యము ఏకరూపముగా నుండుటచే ఆత్మకుభేదముసంభవింపదు. కావున ముందుచెప్పిన శ్రుతి శరీరభేదమును ప్రతిపాదించుటయందు తాత్పర్యముగలది యగును. ఆత్మభేదమును ప్రతిపాదించుటయందు తాత్పర్యము గలదికాదు అనునది సిద్ధించుచున్నది. అట్లే,

(౨) ముందుచెప్పిన పురాణవచనమును దెలిసికొనునది.

౫. (౧) ప్రతివాదీ! ఆత్మాభేదమైతే సుఖదుఃఖ మొదలగువాని వ్యవస్థ సిద్ధింపదని నీవు చెప్పినది యు పొసఁగదు. ఏలయన ఆ సుఖదుఃఖముల వ్యవస్థ ప్రారబ్ధకర్మముల అధీనమై యుండుటచేతను, ఒకేదేహమున కర్మభేదముచే సుఖదుఃఖ మొదలగువాటి *24. విచిత్రస్వభావము కనఁబడుటచేతను, సుఖదుఃఖములు పుణ్యపాపముల కార్యమైయుండుటచేతను,

*24. ఇచ్చట ఇది రహస్యము:—— ఒకదేహములోనే ఆత్మయొకటే, ఒప్పుకొనవలసినదే యగును. అట్లే పాదమందుకలుగు బాధను శరీరమంతయు

వానికి భేదముండుటచేతను చిదాభాసునితోఁగూడిన అంతఃకరణమగు భోక్తయొక్క భేదముండుట వలనను, సుఖము దుఃఖము మొదలగువాని వ్యవస్థసంభవించుచున్నది.

ప్రతివాదీ! ఆత్మఒక్కటియేయయిన సకలజనులును సర్వజ్ఞులగుదురు; అందుచే విధినిషేధరూపశాస్త్రములు వ్యర్థములగును. అని నీవుచెప్పినదియు పొసఁగదు. ఎందుకనగా,

ఎక్కడను, ఎప్పుడును, ఆత్మయేయెఱుగునదియైననుయుండి ఆయాదేహములు ఆయాబుద్ధినిగొనియే యెఱుఁగుచున్నవి. ఎందువలన దేహభేదముచే, బుద్ధిభేదము నియమితమైయున్నదో అందుచే నొక్కొక్కదేహమందును జ్ఞానముయొక్క భేదమున్నది. లేక, యెందుచేత, వస్తువు తెలియఁబడుచున్నదో అట్టిబుద్ధివృత్తియైన జ్ఞానము, పరిచ్ఛిన్నమగును, కావున నేత్రమునకు

---

అనుభవించుటలేదు పాదమందుమాత్ర మనుభవించుచున్నాఁడు. దానివలె శిరమునందు కలుగు సుఖమును శరీరమంతటియందనుభవించుటలేదు. శిరమునందుమాత్రమనుభవించుచున్నాఁడు. ఎప్పుడు ఒక దేహమందును కర్మభేదముచే సుఖదుఃఖముల విలక్షణతానుభవము కలుగుచున్నదో, అప్పుడు భిన్నభిన్న శరీరముల కర్మభేదముచే సుఖదుఃఖముల విచిత్రతానుభవము కలుగుచున్నదనుటలో చెప్పవలసినదేమియున్నది? ఇది కైముత్తిక న్యాయము, ఇట్లు చెప్పుటచే సర్వశరీరములందును ఎప్పుడు ఆత్మఒక్కటియైయున్నదో అప్పుడు ఒకశరీర క్రియ సకలశరీరములందును కలుగవలయునను శంకకు సమాధానమగుచున్నది. ఏలయన, ఎప్పుడు ఒకశరీరమందు శ్రోత్రము త్వక్కు మొదలగు ఇంద్రియముల క్రియభిన్నభిన్నమగుచున్నదో, ఒకదాని క్రియ వేఱొకదానిచే గాకపోవుచున్నదో, ఇట్లు క్రియయొక్క విలక్షణతయున్నదో, అప్పుడు భిన్నభిన్నశరీరముల క్రియయొక్క విలక్షణతనము కలుగుచున్నదనుటలో నేమిచెప్పవలసియున్నది?

వలె తన సంబంధముగల వస్తుమాత్రమును బ్రకాశింపఁజేయు బుద్ధివృత్తికి సకలపదార్థములతో సంబంధము పొసగుటలేదు. దానికన్ని పదార్థములతోను సంబంధముండినయెడల సర్వజనులును సర్వజ్ఞులగుదురు. ఎందుచే బుద్ధివృత్తికి సకలపదార్థములతోను సంబంధములేదో అందుచే సకల జనులకు సర్వజ్ఞత్వము సిద్ధించుటలేదు.

లేక, శబ్దముయొక్క ఉత్పత్తికి హేతువైన వ్యాపకమైన ఆకాశమేదియో దానికెచ్చటను భేరీమద్దళము మొదలగు వానితో సంబంధమున్నను ఎచ్చటదండెము మున్నగువానిచే భేరిమున్నగువానికి తాడనము (కొట్టుట) కలుగుచున్నదో, అచ్చోటనే శబ్దముయొక్క ఉత్పత్తి కలుగుచున్నది. ఎచ్చటను కలుగుటలేదు. దానివలెనే ఏకమైన పరిపూర్ణ ఆత్మయొక్క జ్ఞానముగూడ ఎచ్చట బుద్ధివృత్తికి పదార్థముతో సంబంధము కలుగుచున్నదో ! అచ్చోటనే ఉదయించుచున్నది. తక్కిన చోటుల ఉదయించుటలేదు. కాబట్టి బుద్ధివృత్తులు అనేకములై యుండుటచేతను అవ్యాపకములుగానుండుటచేతను సకలజనులకు సర్వజ్ఞత్వము సంభవింపదనునది సిద్ధించినది.

అల్పజ్ఞ జనులయొక్క ప్రవృత్తినివృత్తులకు హేతువగు విధినిషేధరూపమగు శాస్త్రములు ప్రయోజనముకలవియే యగును.

(3) ప్రాణులకు సర్వజ్ఞత్వములేకుండుటచే, వేదాంతశ్రవణజన్యజ్ఞానముచే, ప్రత్యగభిన్న పరబ్రహ్మమును స్వస్వరూపముగ ఎవఁడు *25 ఎఱుఁగుచున్నాఁడో, వానికే ముక్తికలుగు

*25. ఇచ్చట నెవఁడనునది అంతఃకరణమునందు చేతనప్రతిబింబమైనచిదాభాసుఁడు. అయిన (౧) బ్రహ్మమైన ఆత్మను తెలిసికొనఁగనను

దృఢజ్ఞానమేదిగలదో యది ఈగ్రంథమునకు, అవాంతర ప్రయోజనమనఁబడుచున్నది.

(౧) ఏఫలప్రాప్తియొక్క యిచ్ఛ పురుషునికి కలుగుచున్నదో యది పరమప్రయోజనమగును.

(౨) పరమప్రయోజనమునకు సాధనమేదిగలదో యది యవాంతరప్రయోజనమగును.

ఇచ్చట యిది సంశయము:— ౧. సర్వానర్థముల నివృత్తియును, బరమానంద ప్రాప్తియునైన మోక్షమేదిగలదో, యది జ్ఞానముచేత జన్యమా? (కలిగినదా?) లేక అజన్యమా? జన్యమనిన, మోక్షమునకు అనిత్యత్వము కలుగును. అజన్యమనిన జ్ఞానములేకయే సకలపురుషులును ముక్తులుగావలెను. కావున సాధనమగు జ్ఞానమును సంపాదించుట వ్యర్థమగును.

సమాధానము:— వ్యావహారిక రజ్జువునందుండు ప్రాతిభాసిక సత్తగలసర్పమేదిగలదో, దానికి తనయధిష్ఠానమగు రజ్జువునందు, పారమార్థికసత్తుయొక్కయు లేక వ్యావహారికసత్తుయొక్కయు మూఁడుకాలములందును, నే యత్యంతాభావమున్నదో, యది యాసర్పముయొక్క నిత్యనివృత్తియగును. అదియే విషయరూపనివృత్తియనియుఁ జెప్పఁబడును. ముందు, చెప్పిన నిత్యనివృత్తిరూప ప్రాతిభాసికసర్పమేదిగలదో యది నిత్యనివృత్తమనఁబడును. తన యధిష్ఠానమగు రజ్జుయొక్క యపరోక్షజ్ఞానము గలిగిన వెనుక "రజ్జువునందు సర్పమునకుమూఁడు కాలములందును అత్యంతాభావము, లేక మిథ్యాత్వమున్నది." అను రూపమునకు ముందే సిద్ధించిన, విషయీరూప నిత్యనివృత్తియొక్క, నిశ్చయమైనచో యే పాతము కలుగుచున్నదో, యాబాధచే, పరమార్థ సత్తునైనను, లేక వ్యవహారసత్తుచే

నైనను సర్పముయొక్క, మూఁడుకాలములందును లేని దానిని, విషయముచేయునదిగాను ప్రాతిభాసికసత్తుగాను, సర్పముయొక్క మిథ్యాత్వమును విషయముచేయునదిగానున్నది. ఆ నిశ్చయస్వరూపమయిన వృత్తిజ్ఞానమైన బాధయే నిత్యనివృత్తమయిన సర్పముయొక్క నివృత్తిరూపముగానున్నది. అదియే విషయిరూపనివృత్తియనియుఁ జెప్పఁబడును ఇట్లు నిత్యనివృత్తమయిన సర్పనివృత్తి కలుగుచున్నది. దానివలెసృష్టిదృష్టి (మూఁడుసత్తులుగల) వాదముయొక్క క్రమమున వ్యావహారిక సత్తను గలదియు దృష్టిసృష్టి (రెండు సత్తలు గల) వాదముయొక్క క్రమమయిన ప్రాతిభాసికసత్తనుగలదియునైన సర్వానర్థరూపమైన అజ్ఞానమును, దానికార్యమునయిన ప్రపంచమేదియోఁ యది పరమార్థసత్తునుగల బ్రహ్మమునందు అధ్యస్తమైయున్నది. కావున, దానికి తన అధిష్ఠానమగు బ్రహ్మమునందు శ్రుతియుక్తులచేతను, విద్వాంసుల అనుభవముచేతను నిశ్చయింపఁబడిన పరమార్థసత్తచే మూఁడుకాలములందును ప్రపంచముయొక్క అత్యంతాభావమున్నది. అది యాప్రపంచ నిత్యనివృత్తియగును. అదియే విషయరూపనివృత్తి యనియుఁ జెప్పఁబడును. ముందు చెప్పిన నిత్యనివృత్తిగల వ్యావహారిక, లేక, ప్రాతిభాసిక ప్రపంచమేదియో, యదినిత్యనివృత్తమనఁబడును. అధిష్ఠానమగు బ్రహ్మముయొక్క దృఢఅపరోక్షజ్ఞానమునకు పిమ్మట "బ్రహ్మమునందు ప్రపంచమునకు మూఁడుకాలములందును అత్యంతాభావము, లేక మిథ్యాత్వమున్నది." యను రూపముగలదియగు, మునుపేసిద్ధించియుండు, విషయరూపమగు నిత్యనివృత్తియొక్క నిశ్చయమైనచో యే బాధ కలుగుచున్నదో యాబాధము పరమార్థసత్తచే

ప్రపంచముయొక్క మూడుకాలములలేకుండుటను విషయము చేయునట్లును, వ్యావహారిక, లేక, ప్రాతిభాసికసత్తచే ప్రపంచముయొక్క మిథ్యాత్వమును విషయము చేయునదిగానున్నది. ఆ నిశ్చయ స్వరూపమైయున వృత్తిజ్ఞానమగు బాధయే. నిత్యనివృత్తి ప్రపంచనివృత్తిరూపమగును. అదియే విషయి రూపనివృత్తియనియుఁ జెప్పఁబడుచున్నది.

ఇచ్చట యిది వివేకమగును:— విషయ, విషయీ, భేదముచే, నివృత్తి రెండు విధములుగానున్నవి. ఘటమునువలెనైనను, లేకరూపమువలె నైనను, ప్రకాశముయొక్క, మును పేసిద్ధించియుండు నివృత్తియేదియో, యది, విషయరూపనివృత్తియనఁబడును. ఇట్లు అధిష్ఠానజ్ఞానముచే మును పే సిద్ధించియుండు ప్రపంచమునకు, మూడుకాలము లేకుండుట లేక, మిథ్యాత్వమున్నది. దీపమునువలెనైనను లేక నేత్రమునువలెనైనను, మునుపేసిద్ధించియుండు విషయరూపమగు నివృత్తిని ప్రకాశింపఁజేయు వృత్తిజ్ఞానమేదియో యది విషయి రూపనివృత్తియనఁబడును. ఇట్లు పూర్వసిద్ధనిత్యనివృత్తియొక్క నిశ్చయజ్ఞానమయినచో బాధయున్నది. ఈవిధములచే అనర్థపు విషయరూపనివృత్తి యేదియో, యది జ్ఞానమునకుమునుపే, సిద్ధించియుండుటచే నిత్యమగును. దానిచే మోక్షముయొక్క మొదటియంశము అనిత్యమగునను ప్రసంగములేదు. విషయీరూపనివృత్తియయిన వృత్తిజ్ఞానమేదియో యది అధిష్ఠానజ్ఞానముచే గలిగినదగును. అందుచే సకలపురుషులకును మోక్షప్రథమాంశ ప్రాప్తిప్రసంగము లేదు.

ఇంటియందు పూడ్చియుంచియుండు, నిధినిత్యప్రాప్తమైన్నను ఎంతదనుక తెలియఁబడకయున్నదో యంతదనుక

పొందఁబడకయుండునట్లున్నది. పిమ్మట యెప్పుడాకయాప్త (నిజము చెప్పెడు) పురుషునియుపదేశముచే, నా నిధిజ్ఞానము కలుగుచున్నదో అప్పుడు దొరకినట్లగుచున్నది. ఈ విధము చేతనే, యిదినిత్యప్రాప్తియొక్క ప్రాప్తియగును. అట్లు పరమానందరూపబ్రహ్మము అహంప్రత్యయమునకు (అహంవృత్తి అహంశబ్దములకు) విషయమయియుండుటచే నెచ్చటను కనఁబడుచున్నది. అందుచేనది సర్వాత్మకమగును (అన్నిటిస్వరూపమగును) ఇందుచేతనే నిత్యప్రాప్తి స్వరూపమయినను, ఎంతదనుక నెఱుఁగఁబడకయున్నదో, యంతదనుక పొందఁజాలనిదానివలె కనఁబడుచున్నది. పిమ్మట ఎప్పుడు శాస్త్రగురు ఉపదేశములచే "నేను బ్రహ్మము". అను దృఢ నిశ్చయమయిన తత్త్వజ్ఞానముకలుగుచున్నదో అప్పుడు "పరమానంద రూపమగు బ్రహ్మమునేను" అని ప్రాప్తికలుగుచున్నది. అందుచేనిది నిత్యప్రాప్తబ్రహ్మముయొక్క ప్రాప్తియగును.

ఇచ్చటయున్న విషయ విషయీభేదములచేఁ ప్రాప్తి రెండువిధములై యున్నది:—౧ మునుపే సిద్ధించియున్నదియు సమీపమందుండునదియునైన అజ్ఞాత (తెలియబడని) వస్తుప్రాప్తి, యేదియో, యది విషయరూపప్రాప్తియగును. అజ్ఞానకాలమందున్న, ముందు చెప్పిన నిధిప్రాప్తియు, జ్ఞానదశయందున్న సర్వాత్మయగు, బ్రహ్మముయొక్క ప్రాప్తియును. విషయరూపప్రాప్తియగును. ౨. మునుపేసిద్ధించి యున్నవస్తుజ్ఞానమయిన ప్రాప్తియేదియో, యది విషయీరూపప్రాప్తియగును. పైజెప్పిన నిధిజ్ఞానమగు ప్రాప్తియును, బ్రహ్మముయొక్క జ్ఞానమగు ప్రాప్తియును, విషయీ రూపప్రాప్తియగును. దీనినేనిత్యప్రాప్త ప్రాప్తియనియుఁ జెప్పుదురు. ఈవిధముగా బ్రహ్మప్రాప్తియగు

రెండవ అంశమునకును జ్ఞానముచేగలుగబడుటలేనందున, అనిత్యతనుపొందుటలేదు దానిజ్ఞానమగు ప్రాప్తిజన్యమైయుండుటచే సకలపురుషులకును బ్రహ్మప్రాప్తిలేనందున సాధనజ్ఞానమువ్యర్థమగుటలేదు. అదిగాక బ్రహ్మప్రాప్తియగు మోక్షముయొక్క రెండవ అంశమునకు ముందుచెప్పిన నిత్యనివృత్తి భిన్నముకాదు. అందుచేమోక్షమందుద్వైతాపత్తియు (మోక్షము రెండగుటయు) లేదు ఇచ్చట యొకవిశేషమున్నది. అదిగ్రంథవిస్తరభీతిచే వ్రాయఁబడలేదు.

అధికారి మొదలగు నాల్గు అనుబంధముల విశేషములను జెప్పునదియైన మొదటి యుపదేశము సమాప్తము.

——:0:——

# రెండవ యుపదేశము.



## 17. గురుశిష్య సంవాద ప్రసంగపూర్వకమయిన సామాన్య ప్రశ్నోత్తరము.

సంసారమగు దావానలమును, నడవింగాల్చు, అగ్నిచే, తపింపఁజేయఁబడిన యొకానొక పురుషుఁడు ముందుచెప్పిననాల్గు సాధనములతోఁగూడిన వాఁడై నీరులేక బాధపడుచేపవలె, బంధమగు సంసారనుండి ముక్తుఁడు కాఁగోరుచున్నాఁడు ఆ పురుషుఁడు, సద్గురువును శరణుపొంది, పురుషుని క్షేశపించు (నడిపించు) ప్రమాణరూప శాస్త్రముగువిధిని యనుసరించి, గురుపాదముల నమస్కరించి మనస్సును ఏకాగ్రముచేసి (ఒక్క

టిగాఁజేసి) గురువునుజూచి మోక్షసాధనమును అడుగు చున్నాఁడు.

ఇచ్చట విధివి యనుసరించి యను వాక్యమునకు అర్థము క్రిందగనందగును. అధికారియగు పురుషుఁడు ఉపసదనమునకు దగిన పదార్థములను చేతంగొని, గురువునొద్దకుంజని సాష్టాంగ నమస్కారముచేసి "దేవా! నాకు ఉపదేశముచేయుదురు గాక" అని నుచ్చరించి, ఇతఁడే నాకాశ్రయమని నమ్మికతో నతనియందు గురుభావము చేయవలయును. ఇది గురువును శరణుచొచ్చు విధియగు శాస్త్రము. దీనినే ఉపసత్తియని చెప్పుదురు.

## 18. శిష్యుఁడు అడుగుచున్నాఁడు.

కృపానిధియగుగురుదేవా! మోక్షము ఏసాధనము వలన కలుగును? దీనిని తాముకృపచేసి చెప్పవలయును. ఎందుచే, నేను సంసారమగు దావాగ్నితాపముచే దుఃఖియగుచున్నానో అప్రాప్తబ్రహ్మమయిన వస్తువునుబొందు నిచ్ఛచే, దీనుఁడనై యున్నానో అజ్ఞానినై శ్రేయముగా నేమియు నెఱుఁగని వాఁడనునై తమ్ము శరణుబొందితిని. కావున తాముకృపచేసిగంగా జలశీతలమునకు, సమమైనశాంతముగల్గు నుపాయమును చెప్ప వలయును.

## 19. గురువు చెప్పుచున్నాఁడు.

శిష్యా! బ్రహ్మాత్మైక్య జ్ఞానముచే మోక్షముకలుగు చున్నది. వలయన. "జ్ఞానాదేవ తు, కైవల్యమ్. జ్ఞానముచేతనే కైవల్యము (మోక్షము) కలుగుచున్నది." "దేవం జ్ఞాత్వా సర్వపాశాపహానిః—దైవమును (ఆత్మను) ఎఱుఁగుటచే సకల

పాశములఁబోని కలుగుచున్నది.”

“తమేవవిదిత్వాఽతి మృత్యుమేతి నాన్యః పంథావిద్యతేఽయనాయ-ఆపరమాత్మను, తెలిసికొనియే సంసారమగుమృత్యువును దాటుచున్నాఁడు, మోక్షమును పొందుటకు వేఱుమార్గము లేదు” అను నీ మొదలగు శ్రుతులచే దృశ్యమైయుండుటచే; మిథ్యయగు నహంకారాది ప్రపంచరూపబంధమునకు, అధిష్ఠానజ్ఞానమను మేల్కొలుపుచే, స్వప్నము మేల్కొనుటచే నివృత్తియగుటవలె, నివృత్తి సంభవించుచున్నది. అదియుఁగాక, ఆత్మయైయుండుటచే, నిత్యప్రాప్తమయిన బ్రహ్మమేదియో దానిప్రాప్తిజ్ఞానముచే, సంభవించుచున్నదను నీ మొదలైన యుక్తులచేతను, మోక్షము, జ్ఞానముచే సంభవించుచున్నది. ఆ జ్ఞానము పై జెప్పఁబడు విచారముచేతనే కలుగును, ఏలయన యాజ్ఞవల్క్యమునియగు నతఁడు చెప్పుచున్నాఁడు:—

“ఆత్మావాఽరేద్రష్టవ్యశ్శ్రోతవ్యోనిదిధ్యాసితవ్యః॥ మైత్రేయీ! ఆత్మ నిశ్చయముగఁ జూడఁదగినదగును.” ఏయే సాధనములచే ననిన “శ్రవణముచేయఁదగినదగును, మననముచేయదగినదగును; నిదిధ్యాసనముచేయఁదగినదగును” అను నీ మొదలగు శ్రుతులచేతను,

శ్లో॥ “ఘృతమివపయసి నిగూఢం, భూతేభూతేచ వసతివిజ్ఞానం।
సతతం మంథయితవ్యం, మనసా మంథానభూతేన॥

పాలునందు నేయివలె ఒక్కొక భూతమునందును విజ్ఞానమున్నది. అది, శుద్ధమనస్సను కవ్వముచే విచారమను చిలుకుటకు విషయమైయున్నది.” అను దేవీ భాగవతవాక్యముచేతను,

శ్లో॥ పరోక్షజ్ఞాన మశ్రద్ధాం, ప్రతిబధ్నాతినేతరత్।

అవిచారోఽపరోక్షస్య, జ్ఞానస్య ప్రతిబంధకః॥

పరోక్షజ్ఞానము అశ్రద్ధను ప్రతిబంధించుచున్నది. వేఱు దానికాదు. అవిచారము, అపరోక్షజ్ఞాన ప్రతిబంధకమగును’’ అను పంచదశియందున్న ధ్యానదీపిక వాక్యముచేతను, విచారముచే, రజ్జుమొదలగువాని జ్ఞానము కలుగుటవలె, విచారముచే, అపరోక్షజ్ఞానము కలుగుట ప్రసిద్ధముగానుండుట చేతను బ్రహ్మముయొక్క యథార్థరూప అపరోక్షజ్ఞానమున్ను శ్రవణాదిరూప విచారముచే గలుగుచున్నది. కాఁబట్టి జ్ఞానము లేక, ఈమోక్షమునకు, విచారము లేక, ఈజ్ఞానమునకున్ను వేఱు ఉపాయము లేదు. కావున యిప్పుడు జ్ఞానమూలక మోక్షమునకు హేతువుగానుండు ఆ విచారమును నీవు విందువు గాక.

## 20. విచారస్వరూపవర్ణనము.

నేను ఎవరు? జగత్తేది? ఈశ్వరుఁడు ఎవరు? అనువిచారముచే తత్కాలము జన్మము మొదలగు సంసారము నష్టమగుచున్నది.

ఈ మూఁడు వస్తువుల విచారమేదియోయది ఉత్తమము. ఏలయన,

శ్లో॥ “అవిచారకృతో బంధో విచారేణ నివర్తతే।
తస్మాజ్జీవపరాత్మానౌ, సర్వదైవ విచారయేత్’’

అవిచారముచే నైనబంధము విచారముచే నివర్తియగుచున్నది. కావున జీవుని, పరమాత్మను ఎప్పుడును విచారింపవలెను.’ అను పంచదశియందుండు, నాటకదీపిక వాక్యము చేతను,

శ్లో॥ కోఽహం కథమిదంజాతం, కోవాకర్తాస్య విద్యతే।
ఉపాదానం కిమస్తీహ, విచారః సోఽయమీదృశః॥

నేనెవరు? ఈ ప్రపంచమేది? దీనికి కర్త యెవరు? దీనికి ఉపాదానమేది? అను అది యిది "ఈవిధవిచారము" అను అపరోక్షానుభూతి వాక్యముచేతను, ఉపాధియయిన జగత్తును, బ్రహ్మమును, ఆత్మను, విచారించుట ఉత్తమమగును. అల్పశ్రమగల జ్ఞానమునకు హేతువగుటవలన,

ఇచ్చట "నేను" అను పదముచే, అహంశబ్దముయొక్క వాచ్యార్థమగు జీవుఁడును లక్ష్యార్థమగు "కూటస్థ" ఆత్మయు, చేకొనఁబడుచున్నవి. "ఈశ్వర" శబ్దముచే, నద్దానికి (ఈశ్వరత్వమునకు) అధిష్ఠానమగు బ్రహ్మము అను "తత్" పద లక్ష్యార్థమును జేకొనఁబడుచున్నది.

గురుశిష్యసంవాదమగు సామాన్య ప్రశ్నోత్తరమును జెప్పునది యను రెండవయుపదేశము ముగిసినది.

——:o:——

# మూడవ యుపదేశము.



## 21. ఆత్మ, ఈశ్వరుడు, సృష్టి, అనువాని విషయమగు ప్రశ్నోత్తరము.

దేవా! శ్రుతియగువేదము ప్రకారము నేనెవడను, అను దానిని జెప్పవలయును. దేవదత్తుడు మొదలగుపేళ్లు, బ్రాహ్మణాదివర్ణములు, బ్రహ్మచారిమొదలగు ఆశ్రమములు, అను నీ

ధర్మములతోఁ గూడిన శరీరము నేనని వాకుఁగనబడుచున్నది.

ఇచ్చట "శరీరము" అను పదముచే మూఁడు శరీరములును, "పేరు" మొదలగు శబ్దములచే మూఁడు శరీరముల ధర్మములును జేకొన బడును.

22. శ్రీ గురువు చెప్పుచున్నారు.

శిష్యా! పేరు, వర్ణము, ఆశ్రమము వీనివలన ఉపలక్షింపఁ బడిన మూఁడుశరీరముల ధర్మములు, వీనితోఁ గూడిన మూఁడు శరీరములను వీనికి నీవు నిశ్చయముగా అతీతముగానున్నావు. (వేఱుగానున్నావు) కావున సత్తు చిత్తు ఆనందరూపమగు 'త్వం' పదలక్ష్యార్థ ఆత్మ నేనని నీవునిశ్చయింపుము.

23. శిష్యుఁడు ప్రశ్నించుచున్నాఁడు.

౧. గురువా! జగమునకు కర్తయగు నీశ్వరుఁ డెవఁడు? ౨. ఈతని నిజరూపమేది? దీనిని (ఈశ్వరుని, అతని నిజరూపమును క్రమముగా జగమునకు కర్తగాను కానుగను) ఎఱిఁగి భ్రాంతి మయమగు (భ్రాంతిరూపమగు కార్యముతోఁ గూడిన) అజ్ఞానమగు కూపము నష్టమగు రీతిం జెప్పవలయును.

శిష్యుఁడిట్లు రెండుప్రశ్నలను జేసెను.

24. శ్రీ గురువు చెప్పుచున్నారు.

ఇప్పుడు పైఁజెప్పిన రెండుప్రశ్నలకును ఉత్తరము చెప్పుచున్నారు:-

దేనిని సమష్టిరూపమగు నీశ్వరుని కారణశరీరమందురో, దేనియంశభూతమగు వ్యష్టి, అజ్ఞానము, జీవులకారణశరీరమై యున్నదో, యాసమష్టి యజ్ఞానమగు *26. మాయాశక్తితో

*26. ఇచ్చట యివి అవచ్ఛేదవాదప్రకారము ఈశ్వరుని లక్షణము చెప్పఁ

గూడిన సచ్చిదానందబ్రహ్మమేదిగలదో యది జగమునకు కర్త యగు నీశ్వరుఁడగును. ఆయీశ్వరుఁడు ఎచ్చటను పరిపూర్ణుఁడు. ఆతనికి వందనములుచేయుము.

ఇచ్చట "పూర్ణ" డను నీశ్వరుని విశేషణమేదిగలదో యది తక్కినసర్వజ్ఞత్వము మొదలగుధర్మముల ఉపలక్షణ (సూచక) మగును. కావున ఆ యీశ్వరుఁడు పరిపూర్ణుఁడును, సర్వజ్ఞుఁడును, సర్వశక్తివంతుఁడును, సమర్థుఁడును, స్వతంత్రుఁడును, పరోక్షుఁడును, నిత్యముక్తుఁడును నగును. మరియు "పూర్ణ" డను పదముచే నిరపేక్ష వ్యాపకబ్రహ్మమగు నీశ్వరుని నిజరూపము గూఢాభిప్రాయముచే చెప్పఁబడినది.

ఇచ్చట వందనరూపమగు భక్తియేదిగలదో దానితోఁ దక్కిన శ్రవణము కీర్తనము మొదలగు ఎనిమిదివిధభక్తిని చేకొనవలయును. కాబట్టి ఈశ్వరుఁడు శ్రవణము, కీర్తనము, స్మరణము, పాదసేవనము, అర్చనము (పూజనము) వందనము, దాసభావము, సఖభావము (స్నేహము) ఆత్మనివేదనము, (దేహాదికమన్నిటిని సమర్పించుట) అను తొమ్మిదివిధములగు భక్తికిని విషయము కాదగినవాఁడు.

శిష్యుఁడడుగుచున్నాడు:-

కవిజనులకు రాజగు సద్గురుదేవా! జీవునకు ఉపాధియగు వ్యష్టిదేహాదులకు వేఱయియుండు ఆత్మను ఈశ్వరుని స్వరూపమును నేను *27. నిశ్చయముచేసితిని. ఇప్పుడు తాము ఈశ్వరుని

బడినది. ఆభాసవాదప్రకారము చిదాభాసునితోఁగూడిన మాయాశక్తిని చేకొనవలయుననునది విశేషము.

*27. సంక్షేపముగా నీ యుపదేశము యొక్క 23 వ ప్రసంగము వఱకు

దేహాదులను జెప్పుదురుగాక. దానిచేవాటికివేఱగు నాయొక్క-బ్రహ్మస్వరూపమేదియో యది తెలియఁబడవలయును.

శ్రీగురువు చెప్పుచున్నారు:-

శిష్యుఁడా! ఈశ్వరుని దేహాదులు ఏవియో వాటి విచారము నా యొద్ద వినుముగాక. వాటిజ్ఞానముచే ఈశ్వరుని నిశ్చయము గలుగును.

౧. జగత్తుయొక్క- ఉత్పత్తిస్థితిలయములను నీ మూఁడును ఈశ్వరుని యవస్థలగును.

౨. విరాట్టు, సూత్రాత్మ, అవ్యాకృతము, (మాయ) అను నీమూఁడును ఈశ్వరుని దేహములగును.

౩. సత్త్వాది మూఁడుగుణములు వస్తువులగును. అనగా కుమ్మరికి మన్ను సామగ్రియగుటవలె జగముయొక్క-సృష్టిసామగ్రులగును.

౪. కులాలునికి భూమి మొదలగునవి చోటగునట్లు మాయ ఈశ్వరునికి చోటగునని తెలియుము.

౫. వైశ్వానరుఁడు, హిరణ్యగర్భుఁడు, ఈశ్వరుఁడు (అంతర్యామి) అను నీముగ్గురు ఈశ్వరత్వమునకు ఉపాధియయిన మూఁడుదేహములకును క్రమముగా అభిమానులగుదురు.

౬. "ఏకముగానుండు నేను అనేకరూపములగుదును" అను నీక్షణము (చూపు) మొదలు జీవరూపముగా వ్యష్టి శరీరమందు ప్రవేశించు పర్యంతమగు సృష్టి ఏది గలదో యది ఈశ్వరుని కార్యమగును.

---

నిశ్చయము చెప్పబడినది. విశేషముగా పై బిదపది మొదలు ఏదవయోగు శేషము యును, అది (ఆత్మ) నిశ్చయముచేయఁదగినదగును.

౭. సర్వజ్ఞత్వము మొదలగునవి ఈశ్వరుని ధర్మములగును. కావున ముందుచెప్పిన సామగ్రులతో గూడిన మాయయును, మాయయందు ప్రతిబింబించిన చిదాభాసుఁడును దానితో గూడినబ్రహ్మచేతనమును ఈశ్వరపదమునకు వాచ్యార్థమగును. ఈయన్ని సామగ్రులతో (సాధనము) గూడిన మాయను, చిదాభాసునిన్ని మిథ్యాత్వబుద్ధిచే విడచి, మిగిలిన బ్రహ్మచేతనము ఏదిగలదో యది ఈశ్వరపదమునకు లక్ష్యార్థమగును. ఇదియే ఈశ్వరుని నిజరూపమగును. ఇది ముందు గూడాభిప్రాయమున నడిగిన రెండవప్రశ్నమునకు త్తరమగును.

## 25. శిష్యుఁడు అడుగుచున్నాడు.

స్వామీ! ఈశ్వరుఁడు ఏసృష్టిని (సృష్టివిషయమయిన జగత్తును) కలిగించెనో, అది యేక్రమమున కలిగెను? ఎన్నివిధములు? ఆసృష్టికి (ఉత్పత్తికి) విషయమయి కనఁబడుచుండు జగముమిథ్యయా? లేక సత్యమా? ఈ యభిప్రాయమును నాకుఁ జెప్పవలెను. (ఈమూడు ప్రశ్నలు శిష్యునిచేఁ జేయఁబడినవి.)

## 26. గురువు చెప్పుచున్నారు

ఈవిధముగా ముందు 24 వ ప్రసంగమువఱకు ఈశ్వరుని స్వరూపమును జెప్పి, యిప్పుడాతనిచేనయిన సృష్టిక్రమమును జెప్పుచున్నాఁడు:—

జీవులకర్మఫలభోగము కొఱకు "ఏకముగానున్న నేను, అనేకమగుదును" అనురీతి ఈశ్వరునకు ఇచ్ఛకలిగెను. అప్పుడు ఈశ్వరత్వమునకు ఉపాధియైయున్న మాయయొక్క కార్యమునకు వ్యతిరిక్తమగు క్షోభము కలిగి క్రమముగా సర్వప్రపంచసముదాయమును కలిగెను.

ఆ ప్రపంచోత్పత్తి క్రమ మీక్రిందివిధము:—అవ్యక్తము, అక్షరము, అజ్ఞానము, ప్రధానము, శక్తి, మూఁడుగుణముల సామ్యావస్థయగు ప్రకృతి, యనునివి మొదలయిన పేళ్లచే, ప్రసిద్ధముగానుండు మాయయందుండి *28. మాయావిశిష్ట (మాయతోఁ గూడిన) చేతనమగు ఈశ్వరుని యిచ్ఛచే సమష్టి బుద్ధియగు మహత్తత్వముకలిగెను. ఆ మహత్తత్వము ౧ రాజసము. 2. సాత్వికము, 3. తామసమనుభేదములచే మూఁడు విధములగు అహంకారమును గలిగించెను.

౧. రాజసాహంకారమునుండి శ్రోత్రము (చెవి) త్వక్కు (తోలు) చక్షు (కన్ను) జిహ్వ (నాలుక) ఘ్రాణము (ముక్కు) అనునీయైదు జ్ఞానేంద్రియములును, వాక్కు పాణి, పాద, ఉపస్థ గుదము, అనునైదు కర్మేంద్రియములును గలిగెను. ఏలయన ఇంద్రియములు విషయములతోను, క్రియతోను, ప్రవర్తించుటయగు రజోగుణస్వభావము కలవిగానుండుటచే.

౨. సాత్వికాహంకారమునుండి, అంతఃకరణ శబ్దమునకు వాచ్యమగు, మనస్సు, దిక్కు వాయువు, సూర్యుఁడు, వరుణుఁడు, అశ్వినికుమార్లు, అనునైదు జ్ఞానేంద్రియముల దేవతలును, అగ్ని, ఇంద్రుఁడు, వామనుఁడు, ప్రజాపతి, యముఁడు అనునైదు కర్మేంద్రియముల దేవతలును; మనస్సు దేవతయగు చంద్రుఁడును గలిగిరి.

లేక, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారమను భేదములచే, మనస్సనుశబ్దమునకు వాచ్యార్థమయిన, అంతఃకరణము నాల్గువిధములగును. వానిలో మనస్సునకు దేవతచంద్రుఁడు,

*28. ఇచ్చట మాయయను శబ్దముచే ఆమాయయందుండు చిదాభాసుఁడు చెప్పఁబడును.

బుద్ధికి దేవత బ్రహ్మ, చిత్తమునకు దేవత వాసుదేవుఁడు, అహంకారమునకు దేవత రుద్రుఁడు. వీరందఱుసాత్వికాహంకారమున నుండి గలిగినవారని, యెఱుగుము. ఏలయన, అంతఃకరణములును, దేవతలును ప్రకాశరూపసాత్వికస్వభావము గలవారుగా నుండుటవలన.

3. తామసాహంకారమునుండి శబ్దము మొదలగు (శబ్ద, స్పర్శ, రూప, రస, గంధమను) ఐదు తన్మాత్రలు గలిగినవి. దీనినే సూక్ష్మపంచభూతమనియు అపంచీకృత పంచభూతమనియుఁ జెప్పుదురు.

ఈ వఱకుగలిగిన సృష్టియేదిగలదో యదిమొత్తము నొక్కటిచేసి సూత్రాత్మయనియు, హిరణ్యగర్భుఁడనియుఁ జెప్పుదురు. అది ఈశ్వరుని సమష్టి లింగశరీరమగును. దానియందే కదా! పదునేడు తత్వరూపములగు జీవులవ్యష్టి లింగములు అణగియున్నవి.

27. ఆ పంచతన్మాత్రలయిన సూక్ష్మభూతములకు పంచీకరణము గలిగి పంచీకృతపంచమహాభూతములయినవి.

పంచీకరణము:—ఆకాశము మొదలగు సూక్ష్మభూతముల నుండి ఒక్కొకటిని రెండేసిభాగములుచేయ, నవి పదియగుచున్నవి. వాటిలోనుండి ఐదు అర్ధ యర్ధభాగముల చేరికను విడిచి తక్కిన యయిదుభాగములనుండి ఒకొక్కటి నాలుగేసిగా చేయఁబడెను. ఆనాల్గు నాల్గుభాగములును నిలిపిపెట్టబడిన దానిదాని అర్ధయర్ధభాగములనువిడిచి తక్కినభూతముల నాలుగు అర్ధయర్ధభాగములలోఁ జేర్పఁబడెను. అందుచే నొక్కొక్క భూతమును ఐదైదు విధములాయెను.

ఒక్కొక్క సేరుకొలతగల గోధుమలు, బియ్యము, పెసలు

ఉద్దులు, సెనగలు, అనునైదువిధ అన్నమును అర్ధ అర్ధ భాగ ముచేయ పడి అర్ధసేరులగును. వానిలో ఐదు అర్ధసేర్లు ఉన్నట్లే నిలిపిపెట్టి తక్కిన ఐదున్ను నాలుగేసి భాగములుచేయబడెను. ఆనాల్గుభాగములును దానిదాని అర్ధసేర్లనువిడిచి తక్కిన అన్న ముల అర్ధసేర్లతో చేర్పబడెను. అట్లు చేర్పబడగా నొక్కొక్క యన్నమును ఐదు ఐదు విధములాయెను. అట్లు ఒక్కొక్క భూతమున్ను ముందుచెప్పినట్లు ఐదు ఐదు విధములాయెను.

ఈవిధముగా సూక్ష్మపంచభూతములకు ఈశ్వరుని ఇచ్ఛచే నొకదానికొకటి కలిగిన సంయోగమును (కలియుటను) శాస్త్ర ములందు పంచీకరణమందురు. ఏభూతములకు పంచీకరణము కలిగినదో వాటిని పంచీకృతభూతమందురు. వాటినే స్థూల భూతములనియు చెప్పుదురు.

౧. ఆ పంచీకృతపంచభూతములందుండి యొకదానికొకటి చేయుటవలన బ్రహ్మాణ్డము కలిగెను.

౨. ఆబ్రహ్మాండమందు జీవులవాసముకొఱకు పృథివికి క్రిందుండు అతలము, వితలము, సుతలము, తలాతలము, రసా తలము, మహాతలము, పాతాళమను నేడును పృథివికి పైనున్న భూలోకము, భువర్లోకము, స్వర్లోకము, మహర్లోకము, జనో లోకము, తపోలోకము, సత్యబ్రహ్మలోకమను నేడును నైన పదునాలుగు లోకములునుగలిగెను.

3. వానియందు దేవతలు, మనుష్యులు మొదలగు జరా యుజశరీరములును, పక్షులు మొదలగు అండజశరీరములును, వృక్షములు మొదలగు ఉద్భిజ్జశరీరములును, పేను మొదలగు స్వేదజశరీరములును, నగు నాల్గువిధములగు యోని స్థూల శరీరములకు భోగాయతనము (భోగించుటకుచోటు) కలిగెను.

ఆయాలోకములందు వారివారిశరీరములకు ననుయుక్తములగు భోగసాధనమగు అన్నము మొదలగు భోగ్యపదార్థములును గలిగెను.

28. తైత్తిరీయ యుపనిషత్తునందుండు "బ్రహ్మమగు ఆత్మయందుండి ఆకాశముకలిగెను. ఆకాశమునందుండి వాయువుగలిగెను. వాయువునుండి తేజస్సుకలిగెను. తేజస్సునందుండి జలముకలిగెను. జలమునందుండి పృథివికలిగెను. పృథివియందు ఓషధి (అన్నపువృక్షము) లుకలిగెను. ఓషధులందుండి అన్నముకలిగెను. అన్నమునందుండి వీర్యము మూలముగా పురుషుడుగలిగెను." అనునివి మొదలయిన వాక్యములచే మొదట ఆకాశము మొదలు క్రమముగా పంచభూతములు కలిగెను.

ఆయాపంచీకృత భూతములనుండి ప్రాణము మొదలగు క్రమముగా సమష్టియగు లింగశరీరముకలిగెను. పిమ్మటపంచీకృతమగు నాభూతములందుండి బ్రహ్మాండముకలిగెను. ఆబ్రహ్మాండము విరాట్టుశరీరమనబడును. ఆబ్రహ్మాండమందు దాని యభిమానియగు వైరాజపురుషుఁడు నెలకొనియున్నాడు. అది వైశ్వానరుఁడను పేరుతో ప్రసిద్ధమయినదగును. అదియే క్షీరసాగరమున శయనించు శ్రీనారాయణుఁడను పేరుగల అంతర్యామియొక్క లీలావిగ్రహమగును. దానినాభికమలమందు వైరాజపురుషుని భోగవిగ్రహమగు నాలుగు ముఖములుగల బ్రహ్మగలిగియున్నాడు. ఆతనివద్దనుండి సమయానుసారముగా తక్కిన జీవుల ఆవిర్భావముకలిగెను. ఇదిప్రక్రియయగును.

అందుచేముందు మహాత్తత్వముయొక్క క్రమముగాజెప్పిన సృష్టి విరుద్ధమగుచున్నది. అయిన నిచ్చట మహాత్తత్వమొద

లగువాని క్రమముగా నేసృష్టిచెప్పబడియున్నదో, అదిజ్ఞానశక్తి గల మహత్తత్త్వమునకు సమముగా చిత్తపు ఆవిర్భావపూర్వకముగా అహంకారము కలుగుచున్నది. ఆయహంకారము లేచుటవలన, పంచభూతములు ఇంద్రియమొదలగువాటి, చెప్పుటయు, కనబడుటయు, నగు వ్యవహారము కలుగుచున్నది. అను అనుభవము ననుసరించి చెప్పంబడియున్నది.

విచారదృష్టితోఁ జూచునప్పుడు వేదమునందొకచోట క్రమములేకయు నొకచోట క్రమముగను, ఒకచోట తేజస్సు మొదలగు మూఁడుభూతములనుండియు, ఒకచోట ఆకాశము మొదలగు పంచభూతములనుండియు, ఒకచోట మహత్తత్త్వ మొదలగువానినుండియు గ్రమముగా సృష్టిచెప్పఁబడియున్నది.

ఈయన్నివాక్యములకు నొక్క యర్థమును చేయుటలో విరోధము కనఁబడుచున్నది. కాఁబట్టి ఈయన్ని వాక్యములకు ఆయా విధములచేతను ముముక్షువులకు సృష్ట్యారోప మూలకముగా దాని యపవాదమును జేసి జగముయొక్క మిథ్యాత్వ నిశ్చయ పూర్వకముగా అద్వైతతత్త్వము నుపదేశించుట యందు తాత్పర్యమగును.

అదియునుగాక ప్రపంచము సత్యమగునేని సకల వేదవాక్యములున్ను దానిని ఒకేవిధముగా నిరూపించును. అట్లు నిరూపింపలేదు. కావున ప్రపంచము మిథ్యయే యగును. ఇట్లుసర్వ వేదవాక్యములకును దాత్పర్యము నిశ్చయింపఁ బడియున్నది. ఈ యర్థము ప్రసంగము వలన నిరూపింపఁ బడినది

ఇచ్చట పంచీకృతభూతము మొదలు స్థూలదేహపర్యంతము నైన ప్రపంచమేదిదో యది యంతయుఁ జేరివిరాట్టనఁ బడుచున్నాడు. ఆవిరాట్టు ఈశ్వరుని సమష్టిరూప స్థూలదేహ

మగును. ఇది మొదటి ప్రశ్నమున కుత్తరమగును.

29. ఇట్లు ఈశ్వరుండగు కర్తయగు నతఁడు జగత్తును సృష్టించెను. ఆసృష్టి, సమష్టి వ్యష్టి భేధములచే రెండువిధములని తెలియునది. సమష్టిని ఈశ్వరుని ఉపాధియనియు వ్యష్టిని జీవుని ఉపాధియనియు నెఱుంగునది.

వనమును బోలినదైనను జలాశయ (తటాక) మును బోలినదైనను గోత్వము మొదలగు జాతులవలెనైనను తనమొత్త శరీరము వలెనైనను అనేక పదార్థములు ఒకబుద్ధికి విషయ మగుట యేదిరో యది సమష్టి యనంబడును. ఒక్కొక్క వృక్షమును వలెనైనను ఒక్కొక్క నీటిబొట్టును వలెనైనను ఒక్కొక్క వ్యక్తిని (ఆవు మొదలగురూపములను) వలెనైనను దన శరీరమందున్న క్రిములు మొదలగు వానియొక్కొక్క దేహమును వలెనైనను అనేక బుద్ధులకు విషయమగుట యేది రో యదివ్యష్టి యనఁబడును.

వానిలో సమష్టి కారణ శరీరమును సమష్టిసూక్ష్మశరీరమును సమష్టి స్థూలశరీరమును, ఈశ్వరుని ఉపాధులు అగును. వ్యష్టి కారణదేహమును వ్యష్టి సూక్ష్మదేహమును వ్యష్టిస్థూల దేహ మున్ను జీవుల ఉపాధులగును.

ఇచ్చటవిశేషణమే వ్యావర్తకత్వము ననుసరించి ఉపాధికి సమముగా నుండుటచే ఉపాధిశబ్దముచే చెప్పఁబడి యున్నది.

తనకు ఆశ్రయమగు వస్తురూపమందు దేనిప్రవేశము కలిగి యున్నదో అట్టివ్యావర్తక వస్తువేదిరో యది విశేషణమని చెప్పఁబడుచున్నది.

౧. అదిఘటమునకు నీలవర్ణము విశేషణమగుటను వలెను.

౨. కేవలము గ్రాసునందు తూచఁబడిన బంగారమునకు

లక్క విశేషణమగుట వలెను.

3. ధనములేని వ్యాపారపురుషునికి భాగముగల వేరుధనము గలపురుషుడు విశేషణమగుటవలెనగును ఏలయన నీమూడును జేనివలన తనకాశ్రయమగు వస్తువు స్వరూపమునందు ప్రవేశించి వ్యావర్తకమయి (తక్కినవానినుండి వేఱుచేసి తెలిపించునవి) యయి యున్నవో దానివలన అవి విశేషణము లనఁబడుచున్నవి.

(౧) ఘటమందలి నీలవర్ణము ఘట స్వరూపమందు కలిసి నీలఘటమును తక్కిన పసుపు మొదలగు ఘటములనుండి వేఱుచేసి తెలిపించునదిగా నున్నది. కావున నదివిశేషణమగును,

(౨)లక్కయేదిభూ యాదిజలమునకు వెలుపల తూచఁబడినదై భూషణ స్వరూపమునందు భారమై కలిసియే తక్కిన భారములేనిదగు పెద్ద ఆభరణముల నుండి దానిని వేఱుచేసి తెలిపించునదియై యున్నది. కావున నది భూషణమునకు విశేషణమగును.

(3) ధనముగల *29. భాగముగల పురుషుఁడును వ్యాపారవిషయమగు వస్తువునందు అభిమానమూలముగ ప్రవేశమునుబొంది తక్కినభాగము లేనివారినుండి తనతో భాగముగలవాడగు ధనములేని పురుషుని వేఱుచేసి తెలిపించువాడై యున్నాడు. కావున నాతడతనికి విశేషణమగుచున్నాడు.

తనయాశ్రయ స్వరూపమందు జేనికిప్రవేశములేదో యట్టి వ్యావర్తకవస్తువు ఉపాధియనబడుచున్నది.

౧ అదిఘటము ఘటాకాశమునకు ఉపాధియగుటవలెను,

---

*29. ఇచ్చట భాగముగలవాఁడు ధనివాఁడు, అనువారి దృష్టాంతమేది [illegible] చెప్పబడినది.

౨. జలమందు త్రాసుచే తూచబడిన ఆభరణమునకు లక్క ఉపాధియగునట్లును,

౩. వ్యాపారపురుషుఁడు కార్యముకొఱకుంచియుండు పని వాఁడెవఁడో వాఁడు వానికి ఉపాధియగునట్లుగాను అగును.

ఏలయన నీమూఁడును దేనిచే దనుయాశ్రయస్వరూపమందు ప్రవేశింపక వ్యావర్తకముగా నున్నవో దానిచే నవియుపాధు లగుచున్నవి.

(౧) ఘటమేదియోయది ఘటావచ్ఛిన్న ఆకాశమాత్రమందు ఘటాకాశ వ్యవహారమును చూచుటచే ఘటాకాశ స్వరూపమున ప్రవేశముఁనొందక ఘటాకాశమును మహాకాశము మొదలగువానినుండి వేఱుచేసి తెలియఁజేయునదిగానున్నది. కావున నది దానియుపాధియగును.

(౨) లక్కయేదియో యదిజలమందు త్రాసుచేఁదూచఁబడిన ఆభరణమందు భారముగా ప్రవేశముఁబొందక దానిని తక్కిన లక్కలేని ఆభరణములనుండి వేఱుచేసి తెలిపించునదియైయున్నది. కావున నది దానియుపాధియగును.

(౩) కింకరుఁడు (పనివాఁడు) ఎవఁడో వాఁడు అభిమానము మూలముగా నా వ్యాపారి స్వరూపమందు ప్రవేశముఁబొందక తనకాశ్రయము లేని పురుషులనుండి యా యాశ్రయరూపమగు వ్యాపారిని వేఱుచేసి తెలిపించువాఁడైయున్నాఁడు కావున వాఁడు ఉపాధియగుచున్నాఁడు.

విశేషణమునకు ఆశ్రయమైన విశేషణముగల వస్తువేదియో యది విశిష్టమనఁబడును. ఉపాధికి ఆశ్రయమయిన ఉపాధిగల వస్తువేదియో యది ఉపహితమనఁబడును.

౩౦. అవివేకిదృష్టిచే సంశ్లిష్టత్వము మొదలగు ధర్మముల

తోఁగూడిన సమష్టిస్థూల సూక్ష్మకారణ ప్రపంచమునకు చేత
నపు స్వరూపమందు తాదాత్మ్యసంబంధమగు ప్రవేశముకనఁ
బడుచున్నది. ఆప్రపంచము కూటస్థచేతనము, జీవచేతనము,
మొదలగువానినుండియాయీశ్వర భాగముగా కనబడినచేతనమును
వేఱుచేసి తెలుపునది గానున్నది. గాన ఆప్రపంచముచేఁ గల్పిం
బడిన తాదాత్మ్యసంబంధముగలదియు క్రమముగా వైశ్వాన
రుడు, హిరణ్యగర్భుడు అంతర్యామియును పేళ్లచేప్రసిద్ధిబొంది
నదియునగు బ్రహ్మమైన ఈశ్వరచేతనమేది యో దానికిముందు
చెప్పిన మూడువిధములు సమష్టిప్రపంచము విశేషణమగును.

వివేకదృష్టిచే సమష్టి స్థూలసూక్ష్మకారణ ప్రపంచమునకు
చేతనస్వరూపమందు తాదాత్మ్యసంబంధమయిన ప్రవేశము కన
బడుటలేదు; అయితే అసంగత్వమే కనఁబడుచున్నది. ఆప్రపం
చము ఈశ్వరచేతనము జీవచేతనము మొదలగు వానినుండి
యును ముందుజెప్పిన ప్రపంచమయిన ఉపాధికి ఆశ్రయరూప
మగు చేతనమాత్రమును వేఱుచేసి తెలుపునదిగానున్నది.
కాఁబట్టి యాప్రపంచము ముందుచెప్పిన ప్రపంచమునకు అధి
ష్ఠానరూప ఈశ్వరసాక్షియగు బ్రహ్మచేతనపు ఉపాధియగును.

31. దానివలె అవివేకియొక్క దృష్టిచే కర్తృత్వము భోక్తృ
త్వము సుఖిత్వము దుఃఖిత్వము జీవత్వము సంసారిత్వము అల్ప
జ్ఞత్వము మొదలగు ధర్మములతోఁ గూడిన వ్యష్టిస్థూలసూక్ష్మ
కారణ ప్రపంచమునకు తనయధిష్ఠాన సంబంధమయిన కూటస్థ
చేతనస్వరూపము నందు కల్పిత తాదాత్మ్య సంబంధమయిన
ప్రవేశము కనఁబడుచున్నది. ఆప్రపంచము బ్రహ్మచేతనము
ఈశ్వరచేతనము మొదలగు వానినుండి తనయాశ్రయ భూత
మయిన చేతనమును వేఱుచేసి తెలుపునదిగా నున్నది. కనుక

విశ్వ తైజస ప్రాజ్ఞులను పేర్లుచే ప్రసిద్ధమయిన స్థూల మొదలగు వ్యష్టి ప్రపంచముతో తాదాత్మ్యము గల కూటస్థచేతనమును సంసారియగు జీవుఁడేదియో దానికి ముందుచెప్పిన మూఁడు విధములగు వ్యష్టి ప్రపంచము విశేషణమనఁ బడుచున్నది.

వివేకియొక్క దృష్టిచే ధర్మములతోఁ గూడిన వ్యష్టిస్థూలసూక్ష్మకారణ ప్రపంచమునకు అధిష్ఠానకూటస్థచేతనమందు తాదాత్మ్య సంబంధమయిన ప్రవేశము కనఁబడుట లేదు. అయితే అసంగత్వమే కనఁబడుచున్నది. ఆ ప్రపంచము ఈశ్వర చేతనము మొదలగు వానినుండి ఆ ముందుచెప్పిన మూఁడు విధ వ్యష్టి ప్రపంచమునకు అధిష్ఠాన మయిన జీవసాక్షియగు, కూటస్థ చేతనమును వేఱుచేసి తెలుపించునదై యున్నది. కావున అది యా జీవసాక్షికి ఉపాధియనఁబడుచున్నది.

32. ఒక ప్రపంచమే చేతనమందు ఈశ్వరభావ జీవభావములకు విశేషణమును అధిష్ఠాన రూపమగు బ్రహ్మభావ సాక్షి భావములకు ఉపాధియు నగును.

ఒక కొలత యేజలమునకు బైట తూచుసమయమున భార అతిశయము కానంబడుటచేతను, గొప్ప ఆభరణమునుండి దాని వేఱుపఱచి తెలిపించునదియై యుండుట వలనను విశేషణమును జలమందుమాచుకాలపు భారము అధికములేనందునను తక్కిన వానినుండి వేఱు చేసి తెలిపించునది గానున్నందునను ఉపాధియు గానున్నది. ఆభరణము నందిలి భారముయొక్క ఆధిక్యతయు తక్కువయు దాని ప్రవేశమును అప్రవేశమును నగును.

లేక దండ మొక్కటియే నడచునప్పుడు తానున్న పురుషుని వలె నడచు కార్యమును గలదిగా నుండుట వలనను తక్కిన దండములేని పురుషులనుండి యితని వేఱుచేసి తెలుపునదిగా

ఉండుటచే దండి పురుషునికి విశేషణమును భోజన కాలమున పురుషునివలె తాను భోజన క్రియ లేనిదిగా నుండుట చేతను తక్కిన దండము లేని పురుషుల నుండి యీ దండము గల పురుషుని వేఱుచేసి తెలిపించున దై యుండుట వలనను ఉపాధియు నగుచున్నది. ఇచ్చట తన యాశ్రయ క్రియతో గూడియుండుటయు గూడికుండుటయు నే క్రమముగా దాని ప్రవేశమును అప్రవేశమును నగును.

దానివలె ఒక ప్రపంచమే అవివేకి దృష్టిచే భ్రాంతి రూపమగు ప్రపంచమునకును చేతనమునకును గల తాదాత్మ్య సంబంధముచేఁ గనఁబడుచున్నది. ఈశ్వరభావ జీవభావములకు విశేషణమును వివేకియొక్క దృష్టిచే గనఁబడుచున్న అధిష్ఠానమగు బ్రహ్మభావ సాక్షిభావములకు ఉపాధియు నగుచున్నది. ఇది రెండవ ప్రశ్నమునకు ఉత్తరమగును.

33. ఇపుడు "జగత్తు మిథ్యయా, లేక సత్యమా?" యని ముందు చెప్పిన మూఁడవ ప్రశ్నమునకు ఉత్తరము చెప్పుచున్నారు:— ఆ ముందు చెప్పిన జగత్తు స్వప్న ప్రపంచము శుక్తిరజతము త్రాటియందు పాముఅను వానికి సమానముగా మిథ్యగా (బాధింపఁదగిన స్వరూపము గలదిగా) నుండుటచే సత్తసత్తులకు విలక్షణమనిర్వచనీయమగునని తెలియఁదగినది. ఒకకాలమందును సత్యము (మూఁడు కాలములందును బాధింపఁబడనిది) కానేరదు.

దీని తాత్పర్యమిది:— ముందుచూచిన మిథ్య, లేక సత్యమయిన, అధ్యాసమునకు సజాతీయమగు వస్తువేదియో దాని జ్ఞానముచేఁగలిగిన సంస్కారముతోఁగూడిన పురుషుఁడయిన

ద్రష్టయొక్క దృష్టిచే *30. నిద్రదోషముచేనైనను లేక యేదే నొక మందాంధకార *31. మొదలగు *32. వేలు ప్రతిబంధములచేనైనను *33. జాగ్రతపదార్థమగు, లేక శుక్తియయిన లేక రజ్జువయిన అధిష్ఠానము *34. విశేషరూపముగాఁ గనబడదు *35. సామాన్య (ఇదియను) రూపముచేఁ గనఁబడు

---

*30. ఇదిస్వప్నమునకు నిమిత్తము. *31 ఇచ్చట మొదలగు అనుపదముచే లోభము భయము మొదలగు ప్రమాత (అంతఃకరణ) దోషమును, తిమిరము, పిత్తము, కామాల మొదలగు నేత్రరూప ప్రమాణదోషమును, అధిష్ఠానమునకు (సర్పమునకును, రజతమునకును) సమానరూపముగల ప్రమేయ (అధిష్ఠాన) దోషమున్ను చేకొనబడుచున్నవి.

*32. ఈమూడుదోషములున్ను సర్పదృష్టాంతమునకును రజతదృష్టాంతమునకును నిమిత్తకారణములగును.

*33. జాగ్రతపదార్థము ఒకవేదాంతపక్షముచే స్వప్నమునకు అధిష్ఠానమగును.

*34. దృష్టాంతమున ఇవిజాగ్రతపదార్థములు, ఇదిరజ్జు ఇదిశుక్తి యనునవి అధిష్ఠానపు విశేషరూపమగును. దేని అప్రతీతి (కనఁబడమి) చే అధ్యాసము కలుగుచున్నదో దేనిప్రతీతిచే (కనఁబడుటచే) అధ్యాసముకలుగక నివృత్తి యగుచున్నదో యది అధిష్ఠాన విశేషరూపమనఁబడును. దానిని అధ్యాస అధిష్ఠానమనియుఁ జెప్పుదురు. దాని అప్రతీతిరూపమే అధ్యాసమునకు ఉపాదానకారణమయిన అవిద్యయగును.

*35. వర్తమానకాలమునకు పురోదేశముతో (ముందుచోటుతోఁ) గల సంబంధము ఇదియను పదమునకు అర్థమగును. అదిమందాంధకారమొదలగు స్థలమున "ఇదియొకటి" అనురూపముగనదగును. ఆ యిదియనుట దృష్టాంతమయిన రజ్జుమొదలగువాని సామాన్యరూపమగును. దీనిప్రతీతి (కనఁబడుట) లేక ఎందుచే అధ్యాసముకలుగుటలేదో దానిచేనిది అధ్యాస ఆధారమగును. దేనిప్రతీతిచే అధ్యాసముకలుగుచున్నదో దేని అప్రతీతిచే అధ్యాసముకలుగుట లేదో భ్రాంతికాలమందు "ఇదిసర్పము" అని ఆరోపింపఁబడిన వస్తువుతో

బచే *36. నిద్రకాలమందు, శరీరమందుండు, లేక *37. నేత్ర ముకకింకవాది మూలముగా వృత్తిబయటపోయి శరీరమునకు వెలుపల శుక్తి లేక రజ్జువగు దేశమందుండు ఇదియనురూపమయిన అంతఃకరణవృత్తిచే ఉపహిత (ఆవరింపబడిన) సాక్షి చైతన్యమునకు ఆశ్రితమయిన *38 మూలావిద్యాకార్యమయిన *39. స్థూలావిద్యయొక్క తమోగుణ అంశ పరిణామమయిన స్వప్నప్రపంచమును కల్పితరజతమును కల్పితసర్పమును *40. సత్తసత్తులకు విలక్షణమయిన అనిర్వచనీయమయి యుత్పత్తియగుచున్నది.

అదే నిమిత్తముచే అనేకసమయమందు అదే అవిద్యయొక్క చేసికొనబడుచున్నదో, భ్రాంతితీరిన కాలమందును "ఇదిరజ్జు" వని యేదికనబడుచున్నదో యది అధిష్ఠాన సామాన్యరూపమగును. దానినే అధ్యాస ఆధారమనియుం జెప్పుదురు.

*36 ఇది స్వప్నదృష్టాంతమునకొఱకు జెప్పంబడినది.

*37. ఇది శుక్తి, రజ్జు దృష్టాంతములకొఱకు జెప్పంబడినది.

*38. శుద్ధచేతనమును ఆవరణముచేయు అవిద్యయొక్క

*39. ఘటాది ఉపాధులచే అవిచ్ఛిన్నచేతనమును ఆవరణముచేయు అవిద్యయొక్క.

*40. మూడుకాలములందును బాధగలుగని దానిని సత్తు అందురు.

దానివిలక్షణమని చెప్పుటచే బాధితమగునదిచేకొనబడుచున్నది. వంధ్యా (గొడ్రాలు) పుత్రునిని, కుందేలుకొమ్మును బోలె స్వరూపము లేనిదానిని అసత్తందురు. దాని విలక్షణమని చెప్పుటచే స్వరూపముగలదిచేకొనబడున్నది. వీనిచే బాధయోగ్య స్వరూపముగలది సత్త సత్తు, విలక్షణము (అనిర్వచనీయము) అనుపదమునకు అర్థమగును. దీనినే మిథ్యయనియు చెప్పుదురు. స్వప్నము మొదలగు ప్రపంచము దేనిచే అధిష్ఠానజ్ఞానముచే బాధితమగునదియు స్వరూపము గలదియునగానున్నదో దానిచే సత్తసత్తులకు విలక్షణమగును.

సత్త్వగుణపరిణామ మయినవాని జ్ఞానములను సత్త్వసత్తుల యొక్క విలక్షణ అనిర్వచనీయములుగానే ఉత్పత్తియగుచున్నవి.

క్రమముగా, *41. జాగ్రత్ ప్రపంచము *42. శుక్తి *43 రజ్జు, అనువాటి జ్ఞానముచే, వృత్తిమూలకముగా *44. వాసితో, నేకరూపమయిన సాక్షియగు అధిష్ఠాన జ్ఞానముచే, ఒకేకాలమందు రెండును నివృత్తియగుచున్నవి.

వీటిచే అనిర్వచనీయ (అధ్యాసరూప) స్వప్న ప్రపంచ మొదలగువాని ప్రతీతియును జెప్పుటయునయిన వ్యవహారభేదియో యది సిద్ధాంతమున సమ్మతింపఁబడిన *45. అనిర్వచనీయఖ్యాతి

---

*41. జాగ్రత్ ప్రపంచమువలన ఉపహితచేతనము. *42. శుక్తి, ఉపహితచేతనము *43. రజ్జు ఉపహితచేతనము.

*44. ఇచ్చట ఇది అభిప్రాయమగును:—. జాగ్రత్ ప్రపంచము, శుక్తి. రజ్జు, అను వానిచే ఉపహిత (హద్దుచేయబడిన) చేతనము విషయచేతనమనఁబడును. అకారణముచేతను, దాని వృత్తిచేతను ఉపహితమైన చేతనము, సాక్షియనఁబడును. ఈరెండు చేతనములకును, ఘటాకాశమఠాకాశముల వలె, స్వరూపముగా భేదములేదు. అయితే ముందుచెప్పిన, ఉపాధులచే నయిన మాటమాత్రము భేదముగలదు. ఎప్పుడు జాగ్రము మొదలయిన కాలముల జాగ్రత్ప్రపంచరూప, లేక శుక్తిరూప లేక రజ్జురూప అంతఃకరణముయొక్క వృత్తికలుగుచున్నదో. అప్పుడు రెండు ఉపాధులును, ఒకచోటునందుండుటచే, బాహ్యవిషయచేతనమునకును, అంతరసాక్షిచేతనమునకును, అభేదము చెప్పఁబడుచున్నది. కావున జాగ్ర ప్రపంచ జ్ఞానరూపవృత్తిచే దానిచే ఉపహితమయిన విషయచైతన్య ఆవరణము, భంగమగుచున్నది. అదియే, దానితో అభిన్నమయిన సాక్షిచేతన, ఆవరణభంగము. దానిచే స్వప్నము మొదలగు విషయముల నివృత్తియును వానిజ్ఞానముయొక్క నివృత్తియుఁగలుగుచున్నవి,

*45. శూన్యవాది—రజ్జుశేశమునందైనను, పుట్టమొదలగు చోటులందై

యనఁబడుచున్నది. ఎట్లు ముందు చెప్పిన దృష్టాంతమున్నదో *46. అట్లే *47. వర్తమాన (జరుగు) కాలమందును, భావి కాలమందును గనఁబడుచున్న మిథ్యమగు అహంకారాది ప్రపంచమేదియో దాని ముందుముందు అనుభవింపఁబడినదైన దాని సజాతీయ మిథ్యయయిన అహంకార మొదలగు ప్రపంచ జ్ఞానముచే తోఁచిన సంస్కారముతోఁ గూడిన సకలఅవివేకిజీవరూప ద్రష్టయొక్క దృష్టిచే పూర్వకాలపు సకలజీవులయొక్క *48 అదృష్టమును అవివేకము మొదలగు దోషమునగు నిమిత్త

---

వశమున అసత్తైన (స్వరూపములేని) సర్పము ఏదియో, దానిచెప్పుటయు, కనఁబడుటయు నయిన వ్యవహారము రజ్జుదేశమందు కలుగుచున్నదని అసత్ఖ్యాతిని చేకొనుచున్నారు. అదియు సంగతముగును:—ఏలయన వంధ్య (గొడ్రాలు) పుత్రునివలె, అసత్తయిన సర్పము మొదలగువాని ప్రతీతి అవిద్య మొదలగు కారణములు లేక సంభవింపకపోవుటవల్ల (౧) క్షణికవిజ్ఞానవాది:—రజ్జుదేశమందు మునను, కేవలు చోటులంపైనను, ఏసర్పము కనఁబడుచున్నదో, యది బుద్ధికి వెలిగాలేదు. అయితే క్షణిక విజ్ఞానమయబుద్ధిరూప ఆత్మయేదియో యది సర్పాకారముగా కనఁబడుచున్నది. అని ఆత్మఖ్యాతిచే కొనుచున్నాఁడు. అదియును అసంగతమేయగును:—ఏలయన ఈవిధముగానే క్షణమునకు పైఁబడిన కాలము వఱకు సర్పముకనఁబడుట సంభవింపవందున *49. (౨) నైయాయికుఁడు:— పుట్ట మొదలగుచోటులందుండు సర్పజ్ఞానము చక్షువునందుండు దోషప్రబలముచే నెదుటనుండు రజ్జుదేశమందు కలుగుచున్నదని అన్యథాఖ్యాతిచేకొనుచున్నాఁడు. అదియు అసంగతమే. ఏలయన, ఇట్లయిన మధ్యచోటులందు గల వృక్షములు మనుష్యులు మొదలగు వస్తువుల జ్ఞానమును దోషబలముచే కలుగుటచే, (౩) సాంఖ్యప్రభాకరమతముల ననుసరించువారు:—రజ్జుప్రదేశమున "ఇది, సర్పము" అనునిట్టి రెండు జ్ఞానములు కలుగుచున్నవి. వానిలో "ఇది" అనునది రజ్జువుయొక్క ఇదియను నంశము ప్రత్యక్షజ్ఞానము. "సర్పము అనునది మునుపుకనిన సర్పస్మృతిజ్ఞానము. ఈ రెండుజ్ఞాన

ముచే "నేనుచేతనరూపుముగానున్నాను లేక నిత్యముక్తుఁడనై యున్నాను లేక పరిపూర్ణుఁడనై యున్నాను" అనునట్టి చేతనానంద

---

ముల అవివేకరూప అఖ్యాతిగలదని చెప్పుచున్నారు. అదియును అసంగతమగును ఏలయన, బుద్ధిదేశమందు సర్పస్మృతిగలిగెని ఎదుటనుండు రజ్జుప్రదేశమున సర్పమునుజూచి తిరిగి పరుగెత్తుట సంభవింపకపోవుటచే. (౫) అద్వైతసిద్ధాంతమందు:—రజ్జుప్రదేశమందు అవిద్యమొదలగు దోషబలముచే, ననిర్వచనీయ (మిథ్యయగు) సర్పమును దానిజ్ఞానమును ఉత్పత్తియగుచున్నవి. పిమ్మట అధిష్ఠాన జ్ఞానముచే, వాని నివృత్తికలుగుచున్నది. ఈవిధముగా ననిర్వచనీయఖ్యాతి అంగీకరింపఁబడియున్నది. వానిక్రమము పైన సంగ్రహముగా వ్రాయఁబడియున్నది.

*46. ఇఁకనిటనుండి ప్రపంచమిథ్యాత్వమును జెప్పుచున్నాఁడు.

*47. ఇట ప్రపంచమునకు విత్తును వృక్షమునువలె ప్రవాహరూపమగు అనాదిత్వము సూచింపఁబడియున్నది.

*48. అదృష్టమనునది ప్రారబ్ధమగును. ఇటనిది రహస్యము:—నిరుపాధిక అజ్ఞానజన్యము, సోపాధిక అజ్ఞానజన్యము, అనుభేదములచే భ్రాంతిరెండు విధములు. విలక్షణ (తనసమకాలపర్యంతము కార్యమును నిలుపుటయగు) నిమిత్తకారణము, ఇట ఉపాధి యనఁబడుచున్నది అదిగాక కేవల అజ్ఞానముచేఁదోఁచు భ్రాంతి, నిరుపాధికభ్రాంతియగును. అది రజ్జుసర్పము, శుక్తిరజతము, మొదలగువాని భ్రాంతియగును. విలక్షణమగు నిమిత్తకారణరూప ఉపాధితోఁగూడిన అజ్ఞానజన్యభ్రాంతి, సోపాధికభ్రాంతియగును. ఎట్లుప్రకాశఅంధకారముల సంబంధరూప ఉపాధితోఁగూడిన, అజ్ఞానముచే దోఁచునట్టి, ఆకాశనీలత్వభ్రాంతియున్నదో, ఎట్లుబింబసన్నిధిరూప ఉపాధితోఁగూడిన అద్దపు అజ్ఞానముచే దోఁచినప్రతిబింబపు భ్రాంతియున్నదో, అట్లే జీవులకు అదృష్టరూప ఉపాధితోఁగూడిన మూలాజ్ఞానముచేఁ దోఁచిన ప్రపంచభ్రాంతియున్నది. అదిముందుచెప్పిన ఉపాధితోఁగూడిన అజ్ఞానముచేఁ దోఁచినదిగా నుండుటచే సోపాధికభ్రాంతియగును. నిరుపాధికభ్రాంతియొక్క బాధితానువృత్తి (బాధమునపిమ్మట కనఁబడుటలు) కలుగుటలేదు, ఏలయన ఉపాధి

నిత్యము కర్తృత్వము మొదలగు అధిష్ఠాన విశేషరూప *49 అప్రతీతి (అజ్ఞానము) కలుగుచున్నది. "నేనున్నాను, లేక ఇది యున్నది." అనునట్టి అధిష్ఠాన సామాన్య సద్రూప *50. ప్రతీతి కలుగుచున్నది.

దానిచే అజ్ఞానమున్నది తెలియుచున్నది అని బ్రహ్మము యొక్క సత్తాస్ఫూర్తిచే సిద్ధమగుటచే స్వయమును బ్రహ్మమే దిరెూ దానియాశ్రితముగానుండుటచే "స్వాశ్రయము" అనం బడుటయు "నేను బ్రహ్మము నెఱుగ" నని తానగుబ్రహ్మ మును నావరణముచేయుటచే "స్వవిషయమును" "నేనజ్ఞాని" యను నభిమ నముచేయుటచే *51. జీవుని ఆశ్రయించుటనగు నీవిధమగునది మూలావిద్యయగును. దీనిని మూలప్రకృతియు నియు మహామాయయనియు జెప్పుదురు. దానియందు కార్య మునకెదురుముఖమగు స్వభావరూప క్షోబము కలిగి యా

నిశ్చయములేనందున, దానినాశమును, పాతమునునయిన రెండునుండుటచే సోపాధిక భ్రాంతియొక్క పాతానువృత్తి కలుగుచున్నది. ఏలయన మిథ్యా త్వనిశ్చయరూపపాతముకలిగియు, ఉపాధియొక్కస్థితివరకు, స్వరూప అప్ర తీతిరూపనాశములేనందున.

*49. ఇదియే మూల అవిద్యయగును.

*50. చేతన ఆనందము మొదలగు వానివలె సత్తును (బ్రహ్మస్వరూపము,) అగును. వినను కలుగనివస్తువును కలిగించుసామర్థ్యముగల అవిద్యయొక్క గొప్పతనముచే సత్తుయొక్క ప్రతీతి కలుగుచున్నది. కావున ఉపచారముచే అఖండైకరస బ్రహ్మమందు సామాన్యవిశేషభావము చెప్పఁబడుచున్నది.

*51. ఏవిధముగా పెట్టెయందుంపబడినధనము "నేనుధనముగలవాడను" అని అభిమానించుటచే ఖరుమునియాశ్రయముగా చెప్పబడుచున్నదో యావి ధముగానే యవిద్య జీవునియాశ్రయమగును. ఇటు "జీవుఁడు" అనుపదముచే కలజీవులును, "అవిద్య" యనుపదముచే సమష్టి అవిద్యయుఁచేకొనబడును.

యవిద్యాతమోగుణాంశపరిణామమగు సదసద్విలక్షణ అనిర్వచనీయ సమష్టిరూపస్థూలసూక్ష్మప్రపంచము *52. క్రమముగా

---

*52. ఇది సృష్టిదృష్టివాద వ్యావహారికపక్షప్రకారము చెప్పఁబడియున్నది. ముందుగ సృష్టి (ప్రపంచయుత్పత్తి) కలిగియుండి పిమ్మట కాలాంతరమందు దృష్టి అనగా దానిజ్ఞానముకలుగుననువాదమును (చెప్పుటను) వేదాంతశాస్త్రమందు సృష్టిదృష్టివాదమందురు. దీనినే వ్యావహారికపక్షమనియు చెప్పుదురు. దీనియందు మూఁడుసత్తల అంగీకారమున్నది. పరమార్థసత్త, వ్యావహారికసత్త, ప్రతిభాససత్త అను భేదములచే సత్తమూఁడువిధములగును. ఎట్లు అర్జునుఁడు సన్యాసియై సుభద్రను (కృష్ణునిచెల్లెలిని) పాణిగ్రహణముచేసెను. అను కథ మహాభారతమందు ప్రసిద్ధము దానిని నటులు నటించుచున్నారు. అప్పుడు దానింజూచెడు జనులు వానియందు (సన్న్యాసియైన నటునియందు) “వీఁడు అర్జునుఁడు కపటసన్న్యాసియైయున్నాఁడు” అని అర్జునత్వము సన్న్యాసిత్వముల ఆరోపణను జేయుచున్నారు. అటనటత్వము పరమార్థసత్తను బోలియున్నది. దానియందు ఆరోపింపబడిన అర్జునత్వము వ్యవహారికసత్తను బోలియున్నది. దానియందు ఆరోపితమయిన సన్న్యాసిత్వము ప్రాతిభాసికసత్తను బోలియున్నది. దానియందు నటునివలె పరమార్థసత్తనో కల్పితములేనిదియగును. అర్జునత్వము సన్న్యాసిత్వమువలె వ్యావహారికసత్తయును ప్రాతిభాసికసత్తయును క్రమముగా దీర్ఘకాలముండుట అల్పకాలముండుట కనబడుచున్నవి. ఐనను కల్పితత్వము రెంటియందును సమానములగును. కావున రెండుసత్తవాదములు ముఖ్యమైనను త్రిసత్తవాదపుప్రకారముగురించి అనేకజిజ్ఞాసువులకు తత్త్వబోధముగలదు. అందుచేతను అద్వైతసిద్ధాంతమునకు హానిలేదు. దేనికి మూఁడుకాలములయందు బాధకలుగుటలేదో దానికి పరమార్థసత్తగలదు. దానివంటిది చేతనమగును. దేనికిబ్రహ్మజ్ఞానములేక బాధకలుగుటలేదో, బ్రహ్మజ్ఞానముచే దేనికి అధిష్ఠానమందును వేఱయిన సత్తాస్ఫూర్తికనఁబడుటలేదో, దానికి వ్యావహారికసత్తగలదు. ఈవిధమయినది ఆకాశముమొదలగు ప్రపంచమును మాయయునగును. దేనికి బ్రహ్మజ్ఞానములేకయే రజ్జు

నైనను *53. క్రమము లేకనైనను కలుగుచున్నది.

*54 అదేనిమిత్తము చేత *55 కాలాంతర మందైనను *56 అదేకాల మందైనను ముందు చెప్పిన అవిద్య సత్వగుణ పరిణామ మయిన *57 ఆ కారణ వృత్తిరూప లేక *58 ఆ విద్యావృత్తిరూప దానిజ్ఞానమునకుత్పత్తి కలుగుచున్నది. ఈవిధ మొదలగువాని జ్ఞానముచే బాధకలుగుచున్నదో, దానికి ప్రతిభాససత్తగలదు. ఈ॥ కలుగునవి రజ్జుసర్పమొదలగునవియగు

*53 ఇదిదృష్టిసృష్టి వాదము చొప్పున చెప్పబడినది. దృష్టి యనునది జ్ఞానము: దానిసమకాలమున సృష్టిని (ప్రపంచపు ఉత్పత్తిని) చెప్పుట దృష్టి సృష్టి వాదమనబడును. కావున పరమార్థ సత్త ప్రతిభాససత్తయను భేదముచే రెండు సత్తల అంగీకారము గలదు. వానిలో చేతనమునకు పరమార్థ సత్తను సకల ప్రపంచమునకు ప్రతిభాససత్తయునుగలదు. దానిలో జాగ్రత ప్రపంచము సంవాది (మణియొక్క ప్రభయందు మణియొక్క భ్రమవలె సఫల ప్రవృత్తిని కలుగజేయు) భ్రమయగును. స్వప్న ప్రపంచము విసంవాది దీపప్రభయందు మణియొక్క (రత్నముయొక్క) భ్రమనువలె నిష్ఫల ప్రవృత్తిని గలుగజేయు భ్రమయగును ఇంతటి వ్యత్యాసములున్నవి.

*54 అదృష్టము మొదలగు నిమిత్తముచే *55 ఇది మూడు సత్తల వాదముచొప్పున చెప్పబడినది *56 ఇది రెండుసత్తల వాదము ప్రకారము చెప్పబడినది. *57 ఇదిమూడు సత్తల వాదము ప్రకారము చెప్పబడినది. * 58 ఇదిరెండు సత్తల వాదము ప్రకారము చెప్పబడినది.

ఈపక్షమందు జాగ్రత్ స్వప్నముల పదార్థములయందు (53 వ టిప్పణమున) చెప్పిన విలక్షణతనమున కంటె వేఱు విలక్షణ తనము (వేఱుపాటు) లేదు. అయితే సకల పదార్థములును ప్రాతిభాసికములును సాక్షిభాస్యములగును. ప్రమాతృభాసికములు కావు అవిద్యయొక్క వృత్తివలన నైనను లేక కేవలము మనస్సుయొక్కవృత్తివలన నయినను దేనిని సాక్షి(వెల్లడి) ప్రకాశింప

ప్రపంచమును దానిజ్ఞానమును అవిద్యచే కల్పితమగును. దీనిచే కార్యాధ్యాసము సిద్ధించుచున్నది.

తన ప్రకాశముకొఱకు వేఱుప్రకాశ అపేక్షలేనిదై యుండుట వలన తన్ను తక్కినవానిని నిర్వహించు దీపము వలెను సాంఖ్యులు మొదలగువారు అభిప్రాయానుసారముగా *59 తన్నును తక్కినవానిని నిర్వహించు స్వప్రకాశ ఆత్మను బోలియును, నైయ్యాయికులు కొనియుండు తన్నును తక్కినవానిని నిర్వహించు ఘట పటముల అన్యోన్యాభావరూప భేదమును * 60. భేదించునది తానేయగు భేదమువలెను, ముందు చెప్పిన

---

చున్నది, ఇంద్రియమూలకముగ అంతఃకరణవృత్తిచే దేనిని సాక్షి ప్రకాశించునటుల తెలుపుచున్నదో యది ప్రమాతృ భాస్యము, వ్యావహారికము ఈశ్వర సృష్టియనబడుచున్నది.

*59 సాంఖ్య ప్రభాకరుని మతమందును కొందఱు ఉపాసకుల మతమందును తన్నును తన్ను సంబంధించియుండు దేహము మొదలగు సకలవస్తువులను ఆత్మ ప్రకాశింపచేయుచున్నది. కావున ఆత్మస్వప్రకాశమగునని చేకొనుచున్నారు, అద్వైత సిద్ధాంతమందుఁ దనప్రకాశమందు తనతో సకలప్రకాశముల అపేక్షలేనిదియయి అన్నిటిని ప్రకాశింపించుచుండునదిగా నుండుట వలన ఆత్మ స్వప్రకాశమగునని చేకొనియున్నారు. ఇదిభేదమగును.

*60 నైయ్యాయికుని మతమందు :— ఎట్లుఘటపటముల భేదించునది (భేదముచేయునది) ఆరెంటిభేదమో; అట్లు భేదమునకు ఘటము మొదలగు వానిలోనుండు భేదమేదియో యా తనభేదమును ఘటము మొదలగువానిని భేదించునదియును తానగునట్లే భేదమేయగును. అని చేకొనియున్నారు. ఇచ్చటతానే క్రియయొక్క కర్తయును దానే క్రియయొక్క కర్మము (విషయము) నునైయుండుటవలన ఆత్మాశ్రయరూపదోషము కలుగుచున్నది. ఆయాత్మాశ్రయము వారికి దూషణరూపము కాదు. అయితే భూషణరూపమగును. ఈలాగుననే నాసిద్ధాంతమందును తన అధ్యాసమందు అవిద్య తానే కారణ

కార్యాధ్యాసముయొక్క కారణమయిన మూలావిద్య యేది మాయది తన్నును తక్కినవానిని నిర్వాహము చేయునదిగా నుండుట వలన శుద్ధచేతన రూప అధిష్ఠానమున తన కల్పితము నకు అధ్యాసమునకు కారణము తానేయగును.

ఆ సామాన్యచేతనము దారుయందుండు సామాన్య అగ్నిని పోలును. సుషుప్తి యందుండుఅవిద్య ఆశ్రయమయిన తానైన చేతనము వలెను దానికి (అవిద్యకు) *61 విరోధి కానేరదు. అయితే సత్తాస్ఫూర్తి వలన దానికి సాధన మగును. కావున కారణాధ్యాసమును బొందుచున్నది. ముందుచెప్పిన కార్యాధ్యాసము ౧ అర్థాధ్యాసము ౨ జ్ఞానాధ్యాసము అను భేదములచే రెండు విధములగును.

మరుగని చేకొనబడియున్నది. ఇట ఆత్మాశ్రయరూపదోషముగలదు. అది యనుమానాభాసముగాదు. భూషణరూపమగును.

*61. సామాన్యచేతనము అజ్ఞాన ఆశ్రయమును విషయమునునగునను మాట "నేను (బ్రహ్మమునకు వేఱయినప్రత్యగాత్మ) అజ్ఞాని; బ్రహ్మమునెఱుం గను" అనుయనుభవముచేనైనను లేక సుషుప్తియందుండు చేతన అజ్ఞానముల అవిరోధయనుభవముచేనైనను సిద్ధించియున్నది. కావున స్వప్రకాశచైతన్యము నందు అజ్ఞానమెచ్చటనుండికలుగును? అదిలేక అవరణమెట్లుకలుగును? అదిలేక జననమొందుగు సంసారరూపవిక్షేపమెట్లుకలుగును? అదిలేక దానింబాధించు జ్ఞానమున్ను వానిసాధనములబోధించు శాస్త్రములును నిష్ఫలములగునను నీ మొదలగు కుతర్కసమూహములను ముందు చెప్పిన స్వానుభవరూపప్రబలప్రమాణము భ్రమింగుచున్నది. వీనిచే సామాన్య చేతనము అజ్ఞానమునకు విరోధికానేరదు. అయితే వృత్తిచేగూడినచేతనము లేక చేతనముతోగూడినవృత్తి అజ్ఞానమునకు విరోధియగును. ఎట్లు కాష్ఠమును (కట్టెను) చిలుకుటచే బయటికి వచ్చి వత్తియందుమండు అగ్ని యంధకారమునకు విరోధియగునో యట్లు అదియును విరోధియగును. వానియందును ఏవిషయము ఆకారముగా వృత్తిగలుగు

౧. సర్పము మొదలగువిషయములందు భ్రాంతియేదిగలదో యది యర్థాధ్యాసమనఁబడుచున్నది. అదియే అన్యోన్యాధ్యాసమునగును.

౨. ముందుచెప్పిన సర్పము మొదలగు విషయముల జ్ఞాన భ్రాంతియేదిగలదో యదిజ్ఞానాధ్యాసమనఁబడుచున్నది. వానిలో పరోక్షము అపరోక్షము అని జ్ఞానాధ్యాసమునకు రెండుభేదములున్నవి. అర్థాధ్యాసమునకు *62 అనేకభేదములుగలవు.

---

చున్నదో అవిషయమునందుండు అజ్ఞానమునకు అపేక్షచేతనము (వృత్తితో గూడిన చేతనము) విరోధియగును. తక్కినదానికి విరోధికానేరదు. ఎట్లు ఘటరూపవృత్తితోగూడిన చేతనముచే, ఘట అజ్ఞానమునకు నాశముకలుగుచున్నదో, పట అజ్ఞానమునకు నాశముకలుగుటలేదో, అట్లు బ్రహ్మాకారవృత్తితోగూడిన చేతనమువలన బ్రహ్మముయొక్క అజ్ఞాననాశముకలుగుచున్నది. తక్కినవానియొక్క అజ్ఞాననాశముకలుగుటలేదు. ఇదివిశేషము.

* 62 కేవల సంబంధాధ్యాసము (సంసర్గాధ్యాసము) సంబంధముతో గూడిన సంబంధి యధ్యాసము (సంసర్గ సహిత స్వరూపాధ్యాసము. అదియే అన్యతరాధ్యాసమగును) అను భేదముచే అర్థాధ్యాసము రెండు విధములగును వానిలో సంబంధ సహిత సంబంధి యధ్యాసమును కేవల ధర్మాధ్యాసము ధర్మసహిత ధర్మియధ్యాసము అను భేదములచే నిరుతెఱఁగులు ముందుచెప్పిన రెండు అధ్యాసములయందును ఆత్మయొక్క తాదాత్మ్యసంబంధ అధ్యాసము అవశ్యము కలుగుచున్నది కావున అన్యోన్యాధ్యాసమన్ననో యీరెండు అధ్యాసములయందును అనుస్యూతముగా (లోఁచేరికగా) నున్నది. అన్యతరాధ్యాసమన్ననో అన్యోన్యాధ్యాసముయొక్క ఏకదేశ (ఒకయంశ) అనగా స్వరూపాధ్యాసరూపముగా నుండుటచే దీనియందైనను లేక సంబంధియధ్యాసమందైనను అణగును. అయితే అనాత్మయందు (ఆరోపితమందు) సత్యఆత్మ (అధిష్ఠాన) కేవలసంసర్గాధ్యాసము కలుగుచున్నది. స్వరూపాధ్యాసము కలుగుటలేదు. ఆత్మయందు (ఆరోపములేని దానియందు) మిథ్యయాయిన

ఇట యిదివిశేషమగును:—

౧. అజ్ఞానము, అహంకారము, (అంతఃకరణము) దాని ధర్మము, ఇంద్రియము, ఇంద్రియముయొక్క ధర్మము, దేహము, దేహధర్మము అను నీమొదలగు అనాత్మకును వానిప్రకాశింపించు *63. ఆత్మకును కాఁచిన ఇనుపముక్కయందు ఇనుమునకును అగ్నికిని గలతాదాత్మ్యమువలె తాదాత్మ్యముగలదు. అది అధ్యాసముయొక్క స్వరూపమగును.

౨. అధిష్ఠానవిశేషరూప అజ్ఞానము అధ్యాసమునకుపాదాన * 64 కారణమగును.

(౧) సజాతీయ వస్తువు యొక్కజ్ఞానముచేతఁ గలిగిన సంస్కారము.

(౨) లోభము భయము, మొదలగు *65 ప్రమాత (అంతఃకరణ) దోషము.

అనాత్మయొక్క సంబంధ సహిత సంబంధియొక్క (సంసర్గ సహిత స్వరూపముయొక్క) అధ్యాస కలుగుచున్నదనుట నిశ్చయము

*63 రజ్జుయొక్కసంబంధము సర్పమందు అధ్యస్తమగును. సర్పసంబంధ సహిత స్వరూపము రజ్జువందు అధ్యస్తము ఇట్లారెంటికిని పరస్పర అధ్యాస రూప తాదాత్మ్యము గలదు. అట్లే అకల్పిత ఆత్మయొక్క సంబంధము అనాత్మయందు అధ్యస్తము. కల్పితఅనాత్మ సంబంధముతోఁగూడిన స్వరూపము ఆత్మయందు అధ్యస్తమగును. ఈ విధముగా ఆత్మానాత్మలకు కాచిన ఇనుమును బోలి పరస్పరాధ్యాస రూప తాదాత్మ్యముగలదు. ఎక్కడయైనను (అన్ని అధ్యాసలందును) అధిష్ఠాన ఆరోపితములకు ఈవిధము తాదాత్మ్యము గలుగుచున్నదనునది యభిప్రాయము.

* 64 ఉత్పత్తి స్థితిలయముల కారణము.

*65 ఆత్మయందు అనాత్మ అధ్యాసయందు జీవుల అదృష్టరూపప్రమాతృ దోషముగలదు.

(౩) పిత్తకామలాదులు మొదలగు *66 ప్రమాణ (నేత్రము మొదలగు ఇంద్రియముల) దోషము.

(౪) మూఁపలము (ముక్కోణము) రూపతయు తళతళ మెఱుపు నలె మొదలగు సాదృశ్యరూప *67 ప్రమేయ ప్రమాణము చేత నెఱుఁగఁదగిన అధిష్ఠాన దోషము.

(౫) అధిష్ఠాన *68 ఇదంతయును *69 సత్తయుమునగు సామాన్య రూపజ్ఞానమును నీయైనను అధ్యాస నిమిత్త కారణములగును.

౩. పుత్త్రులు మొదలగువారి యందుగల యాత్మభ్రాంతి అధ్యాస అవధియగును.

౪. జననమరణ మొదలగు సంసారము. అధ్యాసయొక్క *70. ఫలమగును. ప్రత్యగభిన్న అంతరాత్మకంటె వేఱుకాని బ్రహ్మరూప అధిష్ఠాన జ్ఞానము చేతఁ గారణముతోఁ గూడిన ప్రపంచమును, దాని జ్ఞానమునునైనఁ వీని *71. మిథ్యాత్వ

---

*66. ఆత్మయందు అనాత్మ అధ్యాసయందు తానే పొందిన ప్రమాణ రూప ఆత్మయందుగల అవిద్య యేదిగలదో యది ప్రమాణదోషమగును.

*67 ఆత్మయందు అనాత్మ అధ్యాసయందు ఆత్మయందుగల నిరపేక్షత అనాత్మయందును సాపేక్షత గలదు. కావున ఆరోప్యము (అనాత్మ)తో అధిష్ఠానమునకు సాదృశ్యము గలదు. అది ప్రమేయ దోషము అగును.

*68 ఇది రజ్జు మొదలగు దృష్టాంతముల కొఱకు చెప్పఁబడినది

*69 ఇది బ్రహ్మరూప దార్ష్టాంతికము కొఱకు చెప్పఁబడినది.

*70 రజ్జుసర్పము మొదలగు అధ్యాసకు భయము అదురుటు మొదలగునవి ప్రయోజనము అగును.

*71. ఇది వ్యవహారసత్తవలన లేక ప్రతిభాససత్తవలన బాధలక్షణమగును.

నిశ్చయము, లేక *72. మూడుకాలములు లేని నిశ్చయమను నివృత్తి కలుగుచున్నది.

ఈవిధమున పదుగురు పురుషులకు, రజ్జురూప అధిష్ఠాన అవిద్యచే దండము, సర్పము, హారము భూమినివేరు, జలధార, భూమిపగులు అనునట్టి మొదలగు విలక్షణభ్రాంతి కలుగుచున్నది; లేక, అందఱికి ఒకేసర్పభ్రాంతి కలుగుచున్నది. అయితే ఎవనికి రజ్జురూప అధిష్ఠాన జ్ఞానము కలుగుచున్నదో, వాని దృష్టివలన, తనసాక్షి యాశ్రితమయిన, అవిద్యయంశ తిరస్కారము చేతనైనను, నాశముచేనైనను, భ్రాంతినివృత్తి కలుగుచున్నది. అధిష్ఠాన జ్ఞానములేని అన్యపురుషుల దృష్టిచే, అవిద్యతోఁగూడిన భ్రాంతియెట్లో యట్లు (ఉన్నరూపమున) నెలకొనుచున్నది.

ఆవిధముననే, సకలపురుషులకు అధిష్ఠానబ్రహ్మ అవిద్యచే దేవతలుమనుష్యులు మొదలగు భేదములచే పరస్పరము* 73. విలక్షణముగానైనను, లేక *74. సమానముగానైనను అధ్యస్తముగా ప్రపంచమును దానిజ్ఞానమును గలుగుచున్నవి. అయితే ఎవనికి ప్రత్యగభిన్న బ్రహ్మరూప, అధిష్ఠాన అపరోక్షజ్ఞానము, కలుగుచున్నదో, వానిదృష్టిచే కారణసహితప్రపంచము, దాని జ్ఞానము అనువాని నివృత్తికలుగుచున్నది. అధిష్ఠాన జ్ఞానము లేని, అన్యపురుషుల దృష్టిచే, కారణముతోఁ గూడినప్రపంచ

*72. ఇది పరమార్థసత్తగా బాధలక్షణముగును.

*73. ఇది ప్రతిజీవునియొక్క సృష్టిభేదమును అంగీకరించు, వాచస్పతి మిశ్రమొదలగువారి మతమున (చెప్పఁబడినది)

*74. ఇది శాస్త్రప్రసిద్ధసర్వ సాధారణసృష్టిమువలన చెప్పఁబడినది.

మును, దానిజ్ఞానమును ఉన్నరీతిగనే * 75. అనాది రూపముగా నెలకొనియున్నవి. ఇది మూడవ ప్రశ్నమున కుత్తరమగును.

34 శిష్యుఁడు అడుగుచున్నాఁడు:—భగవానుఁడా! ఏ విధముగా భయంకరమగు స్వప్నము కనఁబడుచున్నదో, అది మిథ్యయైనను పాదప్రక్షాళనము (కాళ్లు కడుగుట) గజేంద్రమాతృ పతనము మొదలగునుపాయములచేత దాని, నివృత్తి కలుగుచున్నదో, ఉపాయము లేక తీరుటలేదో,

ఆవిధముగానే, యీకనఁబడుచున్న జగత్తు, అధ్యాసరూపముగా నుండుటచే, మిథ్యయైనను, ఉపాయములేక యది చెడుటలేదు. అయితే జ్ఞానములేక భక్తిలేక కర్మమును నేదైననొకయుపాయముచేతనే చెడును. కావునదీని, నివృత్తి యుపాయమును నాకుఁగృపచేసి చెప్పవలయును. నేను తమపాదములకు నమస్కరించుచున్నాను.

## 35. నివృత్తిలక్షణము

ఇప్పుడు శ్రీ గురువు జగత్తుయొక్క అత్యంతనివృత్తియుపాయమును చెప్పుటకుఁ బూర్వము నివృత్తిభేదముల చెప్పుచున్నాఁడు.

---

*75 ఎట్లు నిద్రకాలమున స్వప్న అనాదిత్వము కనఁబడి, జాగ్రతకాలమున దానికి బాధకలుగుచున్నదో అట్లు అజ్ఞానదశయందు కారణముతోఁగూడిన ప్రపంచ అనాదిత్వము కనఁబడి జ్ఞానరూపజాగ్రత కాలమున దానికి బాధ కలుగుచున్నది. అనాదిరూపఘటము మొదలగు కార్యముల ప్రాగభావనాశమువలెను కొండగుహాయందుండు అనాది అంధకార నాశమువలెను అనాది వస్తువు నాశమును అనుభవసిద్ధమగును.

నివృత్తి రెండు విధములగును:—

౧. ఒకటి కారణమందు కార్యముయొక్క లయరూప నివృత్తియగును. అది సుషుప్తి, మూర్ఛ, మరణము, ప్రళయము, అను నవస్థలయందు జగత్తు, తనకారణమయిన అజ్ఞానమునందు లయమగుటయును, పగులునట్టి యవస్థయందు ఘటము, మన్నురూపముగా మిగులుటచే మంటియందు లయమగుటయును నగును.

౨, మఱియొకటి కారణముతో కార్యలయరూపనివృత్తి యగును. అది మోక్షదశయందు అజ్ఞానరూప కారణముతో జగము లయమగుటయును, దగ్ధపటము (కాల్చఁబడినవస్త్రము) తనకారణమయిన తంతువులతో (నూలుతో) లయమగుటయునగును.

ఇట్లీ రెండువిధముల నివృత్తి చెప్పఁబడినది. వానిలో,

(౧) కారణమందు కార్యలయరూప మొదటినివృత్తి యేది యోయది అసారము. అనగా మోక్షమందుపయోగము లేనిదైయుండుటచే శ్రేష్ఠము లేనిదగును.

(౨) కారణముతో కార్యసహితలయరూపరెండవనివృత్తియేది యోయదియే సారమయినదగును. అనగా మోక్షమునందుపయోగము గలదిగా నుండుటచే శ్రేష్ఠమగును.

కావున జగత్తుయొక్క రెండవనివృత్తియే ముముక్షువునకు జ్ఞానముచే సంపాదింపఁదగినదగును.

36. జగముయొక్క నివృత్తియుపాయవర్ణనము.

జగతునకు కారణము అజ్ఞానము, దాని కార్యము జడమగు జగత్తని తెలియనది. ఇట జడమనుపదము చేతనరూప చిదా

ఘాసునుని, సూచించునదై యుండుటచే, జడచేతనాత్మక చరాచరజగత్తు, అజ్ఞానప్రయుక్తమగును. ఆకారణముచే ముందు చెప్పిన, అత్యంతనివృత్తి, జ్ఞానముచే గలుగుచున్నది దీని నివృత్తికొఱకు వేఱు ఉపాయము లేదు. ఏలయన, "జ్ఞానము లేక ముక్తి గలుగనేరదు" "దానినే యెఱిగి మృత్యువును దాటుచున్నాఁడు; మోక్షమునకు పోవుటకొఱకు వేఱుమార్గము లేదు." అనుట మొదలగు ననేక శ్రుతులుండుటచే, ఆశ్రుతులను అర్థముతో ముందు (రెండవ యుపదేశమందు) చెప్పియుంటిమి. ఐనను, ముముక్షువు దృఢతనముకొఱకు మఱియు వానిపట్టు జ్ఞాపకపఱచితిమి గాన నది పునరుక్తి (చెప్పినది మఱలచెప్పుట) కానేరదు.

## 37. జ్ఞానముయొక్క విషయమును (బ్రహ్మాత్మైక్యమును)

---

చెప్పుట

ఇప్పుడు శ్రీ గురువుగారు జ్ఞానస్వరూపమును జెప్పుటకు ముందు జ్ఞానవిషయమగు బ్రహ్మాత్మలయొక్క ఐక్యమును జెప్పుచున్నాఁడు:—

౧. స్థూలదేహమునకు గల స్థూలత్వము (లావు) కృశత్వము (సన్నము) గౌరవత్వము (గురుత్వము) నలుపు, వర్ణము (జాతి) ఆశ్రమము (స్థితి) మొదలగు ధర్మములును దాని (దేహ) జాగ్రత బాల్యము మొదలగు అవస్థలును గలిగినవి మొదలగునవిగా తక్కిన ఇంద్రియములు ప్రాణము, మనస్సు బుద్ధి, అజ్ఞానము వానిధర్మము; అవస్థయునవియును వ్యష్టిప్రపంచమగును.

౨. విరాట్టు మొదలగు శరీరమును సర్వజ్ఞత్వము సృష్టిని కలుగఁజేయుట మొదలగునవి వానిధర్మములు ఉత్పత్తి మొదలగు వాని అవస్థలునగు నివి మొదలగునవి, సమష్టి ప్రపంచమగును.

ఈ దేహాది ప్రపంచముకంటె వేఱుగు (వివేకదృష్టిచేభిన్నమ ను), ఆహా ప్రత్యయమునకు (నేనను పదమునకును) నేనను ప్రతీతి విషయమయిన యాత్మస్వరూపమేదియోయది, సంగ (సంయోగము మొదలగు రూప, లేక, సజాతీయ విజాతీయ స్వగత భేదసంబంధము) వికారము (జన్మము ముందు లేక వెనుకగలదను) అస్తిత్వము; వృద్ధి (పెరుగుట) విపరిణామము (తరుగుట) అపక్షయము (తక్కువ) నాశము అనునా ఱు లేక షడ్భావ వికార యనునీమొదలుగా నింకనుగల యనేక వికార ధర్మము లేనిది యగును

స్థాలీపులాక (ఒకబియ్యముడికిన అన్నబియ్యముడుకుట) అను న్యాయముచే; లేక ఒకయింట ఆకాశముసిద్ధింపగా నన్ని యిండ్లయందైనను లేక బ్రహ్మాండమందైనను నాకసముసిద్ధించు విధమైన ట్లు ఒక శరీరమందు సచ్చిదానందరూపయాత్మ "నే నున్నాను; నేను ప్రకాశించుచున్నాను; నేనెప్పుడుప్రియుడనై యున్నాను" అనుభవముచేత సిద్ధించుచున్నదో, యట్లు అన్య శరీరములందును, నాకసము నున్నగు ప్రపంచమునందును, సిద్ధించుచున్నది. కావున నది పూర్ణము. (అన్నిచోట్లవ్యాపించి నది) యగును దీనిచేతనే యది బ్రహ్మరూపమగును.

ఈవిధమున నిటమహావాక్యార్థరూపమును జ్ఞాన విషయ రూపమునగు బ్రహ్మాత్మయొక్క ఐక్యము చెప్పబడియెను. ఆత్మ, ఈశ్వరుడు, సృష్టియును వానివిషయమగు ప్రశ్నోత్తర వర్ణనమను మూడవయుపదేశము

సమాప్తము.

——:0:——

# నాల్గవయుపదేశము.

—:o:—

## బ్రహ్మాత్మైక్య సామాన్యనిరూపణము.

**38.** శిష్యుడు ప్రశ్నించుచున్నాడు:— స్వామీ! కర్త, భోక్త యను సంసారజీవుడనగు నేను, ఎట్లు బ్రహ్మరూపమగుదును. అని నిట్టిసంశయము నాహృదయమున నినుపదీలవలె కట్టుపడు చునదై యుండుటచే చీలవైయున్నది. ఆసంశయమునే దయయుంచి తామునాశముచేసి కృపజేయువలయును.

39. ఇప్పుడు బ్రహ్మమునందు జీవత్వసంభవమును గురువుగారు చెప్పుచున్నారు.

మహాకాశమువలె పరిపూర్ణమైయున్న బ్రహ్మము, అశంకరైనను కల్పితదేహరూపఘటమందున్న మాయ (అవిద్య) రూపఘటజలశంకచే (కల్పితసంబంధముచే) శరీరము రెంటియభిమానమును జేసి పరిచ్ఛిన్నమయిన జీవరూపముగాఁ గనఁబడియున్నది.

వేఱు దృష్టాంతము:— నిర్వికారకుంతీదేవి పుత్త్రుఁడయిన కర్ణునందు రాధయను దాసిసంబంధముచేత రాధాపుత్త్రుని (దాసత్వము) కనఁబడునట్టి రూపభ్రాంతికలిగెను. పిమ్మట సూర్యునివాక్యముచే వానికి రాధయొక్క పుత్రత్వభ్రాంతినివృత్తియై కలరూపకుంతీపుత్రత్వము కనబడురూపమైన తేటయగు జ్ఞానముకలిగెను. అట్లే నిర్వికార చిదానందఘనబ్రహ్మమునందు అవిద్యాసంబధముచే జీవత్వపుకనఁబడు రూపభ్రాంతికలుగియున్నది పిమ్మట గురురూపసూర్యుని వచనముచే నాజీవత్వభ్రాంతి పోయి కలరూపమున బ్రహ్మత్వము ప్రతీతియయిన చక్కని

జ్ఞానము కలుగుచున్నది.

40. జీవస్వరూపవర్ణనము.

ఘటమందు నిండించిన జలమందుండు మహాకాశప్రతిబింబ
మువలె బుద్ధిపొందులేక దానికారణమయిన అవిద్యయందుగల
బ్రహ్మాభాసమేదిగలదో యది అవివేకదృష్టిచే తన యధిష్ఠానము
నైన కూటస్థచేతనముతోఁ గూడినదై (కూటస్థచేతనముతో
తాదాత్మ్యముగలదై) కనబడుచున్నది. దానినిజీవుడందురు.

41. స్థూలదేహరూప ఘటమందు బుద్ధిరూపలేక అవిద్యా
రూపజలమునిండియున్నది. దానియందుండు బ్రహ్మాభాసమును
మిథ్యయనియెఱిఁగి విడుచుటచే, మిగిలి నిలిచినదగువాని అధి
ష్ఠానమగు చిద్రూపకూటస్థచేతన మేదిగలదో యదిమహాకాశము
వలె బ్రహ్మమగును. (పరిపూర్ణచేతనరూపమగును) అదియు
తానే తానగు స్వరూపమగును, అనగా ఘటజలమందున్న
ఆకాశప్రతిబింబనిజరూప మహాకాశమువలె చిదాభాసరూప
జీవునినిజరూపమగును.

ఎట్లు ఐంద్రజాలిక పురుషుఁడు మాయచేనయిన శరీరమును
ధరించినవాఁడై మాయిక (మాయచేనైన) ఏనుఁగుమీద,
కూర్చుండి కదలక యుండువాఁడైనను. కదలువాఁడై కనఁబడుచు
న్నాఁడో, అట్లు ప్రాణమునందును (ప్రాణము మొదలగువానితో
గూడిన జాగ్రతయందును) స్వప్నమందును బ్రవేశించినదై
(సంబంధముమూలమున అధ్యస్తమయి) అచల (అకర్త) రూప
మయియుండియు ఆత్మచలించుచున్నది (క్రియయొక్క కర్తయు
దీనిచేభోక్తయునయి కనబడుచున్నది.)

ఇంటి యందుండు అర్కాభాసము (సూర్యచ్ఛాయ) చేతి
క్రియచే కదలనిదై యుండియు, కదలునట్లు కనఁబడుచున్నది

దానివలె దేహాదుపాధిచే అచలమయిన ఆత్మ చలించువట్లు అభి
ప్రాయమిది:—— ఆత్మ కర్తయగును కావునఅభోక్తయగును.
దీనివలన దానిబ్రహ్మత్వముయొక్క జ్ఞానము సంభవించుచున్నది.

## 42. జ్ఞానస్వరూపవర్ణనము.

మూఁడుశరీరములుగలవు వానికి మూఁడు అవస్థలుగలవు.
అమూఁడుదేహములందును పంచకోశములుగలవు. నేనువీనికి
సాక్షి. కావున నీసాక్ష్య (సాక్షిచేనెఱుఁగబడునది) రూపసం
ఘాతము నేనుగాను అయినను సాక్షిరూపప్రత్యగాత్మయగు నేను
వీనికి వేఱుగానున్నాను.

ఇట్లు నిజస్వరూపమును నెఱిగి పిమ్మట దానిని బ్రహ్మము
నకు అభిన్నముగా నెఱిగిన అబ్రహ్మమునకభిన్నమయిన ఆత్మయే
యెప్పుడున్ను సచ్చిదానందరూపమగును.

అదియునుఁగాక ప్రపంచము సత్యముగానే ద్వైతము సిద్ధిం
చుటచే అద్వైతశ్రుతిచేతఁ జెప్పఁబడు బ్రహ్మాత్మైక్యము పొస
గదు. కావుననిట బ్రహ్మాత్మైక్యమును జెప్పుటచే నాబ్రహ్మా
భిన్న ఆత్మకు భిన్నమయిన కార్యకారణరూప ప్రపంచమేదికలదో
యది యద్దమందున్న నగరప్రతిబింబమునువలెను స్వప్నమును
వలెను అధ్యస్తమయియుండుటచే మిథ్య అనునది అర్థముచే
సిద్ధించుచున్నది.

ఈ విధమగు నిశ్చయము (సంశయవిపరీతములులేని ఎఱుఁక)
యేదికలదో యది జ్ఞానమనఁబడును. అ జ్ఞానమే ప్రపంచరూప
అనర్థనివృత్తిరూపమును పరమానందరూప బ్రహ్మప్రాప్తి
స్వరూపమయిన మోక్షమునకు హేతువగును. (సాక్షాత్)
సాధనమునగును.

బ్రహ్మాత్మైక్య సామాన్యనిరూపణమను నాల్గవయుపదేశము
సమాప్తము.

# ఐదవ యుపదేశము.



## * 76 దేహత్రయ ఆత్మ వివేచన వర్ణనము.

### 43. శిష్యుఁడు ప్రశ్నించుచున్నాఁడు.

శ్లో॥ యథాముంజాదిషీకేవ ఆత్మా యుక్త్యా సముద్ధృతః
శరీర త్రితయాద్ధీరైః పరంబ్రహ్మైవ జాయతే॥

"ఎట్లు ముంజయను అరుమూసిన శలాకరూపతృణ (కసవు) విశేషమునుండి ఇషీకము (నడిమిదంటు) ఎత్తఁబడుచున్నదో యట్లు ధీరపురుషుల యుక్తిచే మూఁడు శరీరము నుండియుఁ జక్కఁగా నెత్తబడిన ఆత్మ పరబ్రహ్మరూపముగు చున్నది." అను శాస్త్రమందు (పంచదశియందు) చెప్పఁబడిన యర్థమును నెఱుఁగుట కొఱకు శిష్యుఁడడుగుచున్నాఁడు.

౧ గురుశ్రేష్ఠుఁడును శ్రోత్రియుండును బ్రహ్మనిష్ఠుఁడునయిన గురువరా! తాము చెప్పిన మూఁడు దేహము లేవి? ఇది దేహము యొక్క పేరు, గూర్చిన ప్రశ్నము.

౨ ఈమూఁడు దేహముల రూపమేది:— ఇది వాని వివేక పూర్వకమయిన స్వరూపము యొక్క ప్రశ్నము.

3 ఆత్మయెట్లు వీటికంటెను వేఱైయున్నది? ఇదివాని విచార ఉపయోగము యొక్క ప్రశ్నమగును.

* 76 మొదలు మూఁడవ యుపదేశము వరకు దిఙ్మాత్రమునుజ్ఞాపనదివలె సంగ్రహముగా దేహములందుండి వేఱుచేయఁబడిన ఆత్మ పొందిదియా యది యిప్పుడు ఇచటనుండి (ఐదవ యుపదేశమందుండి) ఏడవయుపదేశము పర్యంతము విశేషముగా వేఱుపఱచ బడుచున్నది. కావున పునరుక్తిరూపదోష ప్రాప్తిలేదు.

ఈ మూఁడు ప్రశ్నములకు తాము కృపచేసి యుత్తరము చెప్పవలయును.

44 గురువుగారు చెప్పుచున్నారు.

౧ స్థూల దేహము లింగదేహము కారణ దేహమను నీమూఁడు దేహములగును.

౨ ఈవిధము చెప్పిన మూఁడు దేహములు కార్యకారణ రూపములైయున్నవి.

[౧, ౨] వానిలో స్థూల దేహమును లింగ దేహమును నను రెండును అవిద్యచే చేయఁబడినవై యుండుటచే అవిద్య కారణ రూపమగును.

[3] కారణదేహము జగత్తునకు గారణమయిన మూల ప్రకృతియొక్క అవస్థా విశేషమగు యవిద్యారూపముగా నుండు టచే గారణ రూపమగును.

ఇది వానివిపాకమగును. కార్యకారణత లేనిదియు ప్రపంచ మునందుండు ఉపమానము లేనిదియునునగునది ఆత్మయగును.

45. ఇప్పుడు స్థూల దేహ స్వరూపమును దానితో ఆత్మకు గల భేదమును శ్రీ గురువుగారు చెప్పుచున్నారు:— పంచభూత ములకు ముందు (27 వ ప్రసంగమున) చెప్పిన విధము పంచీ కరణము కలుగుచున్నదో ఆవిధమయిన ఆకాశము, వాయు, తేజస్సు జలము, పృథివియను పంచభూతములగునవి పంచీ కృతమనఁబడును. వాని నిరువదైదు తత్వములనుండి స్థూల దేహము కలుగుచున్నది.

ఆ పంచీకృత భూతముల నిరువదైదు తత్వములివి యగును.

౧-గీ పృథివియొక్క ఐదు తత్వములు.— ఎముకలు మాంసము, నాడి, చర్మము, రోమమును నవి యగును.

౬-౧౦ జలము యొక్క ఐదు తత్త్వములు:— శోణితము శుక్లము, మూత్రము, చెమట, ఉమ్మినీరు అనునవియగును.

౧౧ ౧౫ తేజస్సుయొక్క ఐదు తత్త్వములు:— సోమరితనము, కాంతి, ఆకలి, దాహము, నిద్ర యనునవియగును.

౧౬-౨౦ వాయువుయొక్క ఐదుతత్త్వములు:— పన్నగించుట, నడచుట, ఉండుట, పరుగెత్తుట, విస్తరించుట అనునవియగును.

౨౧-౨౫ ఆకాశపు ఐదు తత్త్వములు:— (౧) భయము, మోహము, క్రోధము, కామము, శోకము అనునివియగును.

(౨) శేశ్ర[illegible] అవకాశము, కడుపు అవకాశము హృదయ్య అవకాశము, మెడయొక్క అవకాశము తలయవకాశము అనునివి ఆకాశముయొక్క ఐదు తత్త్వములగును.

ఇవి పంచీకృత పంచ మహాభూతముల కార్యరూప యిరువదైదు తత్త్వములగును. ఆ యొక్కొక్క భూతముయొక్క యిరువైదు తత్త్వములలో నొక్కొక్క తత్త్వము తమ తమ ముఖ్య భాగమగును. తక్కిన నాలుగేసి తత్త్వములు తక్కిన నాల్గు భూతములనుండి వచ్చిచేరియున్నవి. ఈవిధమగుటచే నీభూతములకు పరస్పరము చేరికయున్నది. దానిలో నొకదాని కొకటికి గల చేరికను నిట్లు తెలియవలయును.

౧-౫ పృథివి యొక్క అయిదు తత్త్వములలో:—

(౧) ఎముకలు పృథివియొక్క ముఖ్యభాగమగును.

(౨) మాంసము జలముయొక్క భాగము చేరియున్నది.

(౩) నాడి (నరము) తేజో భాగము చేరియున్నది.

(౪) త్వక్కు (తోలు) వాయువు భాగము చేరియున్నది.

(౫) రోమము ఆకాశ భాగము చేరియున్నది.

౬-౧౦. జలముయొక్క అయిదుతత్వములందు:-

(౧) శోణితము పృథివియొక్క భాగముచేరియున్నది.

(౨) శుక్లము జలముయొక్క ముఖ్యభాగ మగును.

(౩) మూత్రము తేజోభాగము చేరియున్నది.

(౪) చెమట వాయువుభాగము చేరియున్నది.

(౫) ఉమ్మినీరు ఆకాశభాగము చేరియున్నది.

౧౧-౧౫. తేజస్సుయొక్క అయిదు తత్వములందు:

(౧) సోమరితనము పృథివి భాగము చేరియున్నది.

(౨) కాంతి, జలభాగము చేరియున్నది.

(౩) ఆకలి తేజస్సు యొక్క ముఖ్యభాగము అగును.

(౪) దాహము, వాయువు భాగము చేరియున్నది.

(౫) నిద్ర ఆకాశభాగము చేరియున్నది.

౧౬-౨౦ వాయువుయొక్క అయిదు తత్వములయందు,

(౧) ముడుచుట (సమకుట) పృథివిభాగము చేరియున్నది.

(౨) నడచుట జలభాగము చేరియున్నది.

(౩) ఉండుట(నీల్గుట) తేజోభాగము చేరియున్నది.

(౪) పరుగెత్తుట వాయువుయొక్క ముఖ్యభాగము.

(౫) విరియుట (విస్తరించుట) ఆకాశభాగముచేరియున్నది

౨౧-౨౫ ఆకాశ అయిదుతత్వములయందు;

(౧) భయము పృథివిభాగము చేరియున్నది.

(౨) మోహము జలభాగము చేరియున్నది.

(౩) క్రోధము తేజోభాగము చేరియున్నది.

(౪) కామము వాయువు భాగము చేరియున్నది.

(౫) శోకము ఆకాశ ముఖ్యభాగమగును.

ఈక ఆకాశ మందు తత్త్వములయందు:—

(౧) సహము అవకాశము పృథివి భాగముచేరియున్నది

(౨) కడుపు అవకాశము జలభాగముచేరియున్నది.

(౩) రొమ్ము అవకాశము తేజోభాగముచేరియున్నది.

(౪) గొంతు (మెడ) అవకాశము వాయువుభాగముచేరి యున్నది.

(౫) తల అవకాశము ఆకాశపు ముఖ్యభాగమగును.

ముందు చెప్పిన భయము మొదలగునవి లింగదేహపుముఖ్య ధర్మములగును స్థూలదేహమందును ఘటమందలి జలము కొక్క శీతలత్వమువలె అవి బయలుపడుచున్నవి అందుచేనవి స్థూలదేహపు గౌణధర్మములగును. కావున స్థూలదేహము యొక్క తత్త్వములు దెలియందగినవియగును.

సహము అవకాశము మొదలగునవి స్థూలదేహమందు ప్రసిద్ధముగాఁగనఁబడుటచేతఁ గొందఱు గ్రంథకర్తలు వాసినే స్థూలదేహపు తత్త్వములుగా గణించుచున్నారు.

రెండువిధములందును ఆత్మ వానినుండి వేఱగునని నిశ్చయింపవలెను. ఈ యిరువదైదు తత్త్వముల సముదాయముపేరు స్థూలదేహమంట. దశ, పేరు, జాతి, ఆశ్రమము, రంగు, రూపము (లావు, సన్నము, పొడవు, పొట్టి) జన్మము, మరణము మొదలగు ధర్మములు గలవు.

46. ఈ విధముగా స్థూలదేహస్వరూపమును చెప్పి, ఇప్పుడు దానితో ఆత్మకుగల భేదమును జెప్పుచున్నాడు.

౧ ఆత్మ, స్థూలదేహపు జన్మమునకు ముందును, మరణము నకు పిమ్మటనుండునదియు నేకముగానునుండుటచే ఘటము

యొక్క వేరైన ఆకాశమువలె, స్థూలదేహముకంటె వేరైన దగును. వ్యభిచారము లేనిదియు నగును.

౨. దేహము ఘటమువలె తన యుత్పత్తికి ముందును మరణమునకు వెనుకయును లేనిదై అనేకముగానుండుటచే నాత్మకంటె వేరైనదగును. వ్యభిచారముగలదియగును.

౧. ఏవస్తువు అంతయు (అధిక) దేశమందును, అంతయు (అధిక) కాలమందును ఉన్నదగుచున్నదో, యది అవ్యభిచారి (జేఱుకానిది) అనఁబడుచున్నది.

(౧) ఆత్మ, దేనిచే సకలశరీరములందును నొకటిగా నుండుటచే ఆకాశమువలె వ్యాపకముగా నున్నదో అందుచే అన్ని దేశములందును నున్నది.

(౨) ఎందుచే సర్వదేహముల యుత్పత్తికి ముందును నాశమునకు వెనుకను ఆత్మయున్నదిగా నుండుటచే, మూడుకాలములందును బాధింపఁబడనిదిగా నగుచున్నదో, దానిచేనది అన్నికాలములందును నున్నదగును.

(౩) ఆత్మయెందుచే నన్నిదేహములందును నన్నికాలములందును నున్నదో దానిచే నది యవ్యభిచారి యగును.

౨. ఏవస్తువు అన్ని దేశములందును అన్నికాలములందును లేకయుండి యేదేనొక దేశమందును నేదేనొక కాలమందు నున్నదో యది వ్యభిచారి యనఁబడుచున్నది.

(౧) దేహము దేనివలన ఘటమునువలె పరిచ్ఛిన్నముగా నున్నదో దానివలన అన్ని దేశములందుండక యేదేనొక దేశమందున్నది.

(౨) దేహము దేనిచేత ఉత్పత్తి నాశము కలుగునదిగా నున్నదో దానిచేత అన్ని కాలములందు నుండక యేదే నొక కాల మందున్నది.

(౩) దేహము ఎందుచేత అన్ని దేశములందును అన్ని కాలము లందును నుండక యేదేనొక దేశమందు నొక కాలమందున్నదో యందుచేత, వ్యభిచారియగును.

ఎందుచేత ఆత్మయు దేహమును క్రమముగా నవ్యభిచారి యు వ్యభిచారియునై యున్నందున ఒకదానికొకటి విలక్షణమై యుంటున్నదో, యందుచేతనే వానికి నొకదానికొకటికి భేదము సిద్ధించుచున్నది.

ఇట యీ శంక కలుగు చున్నది:—

బ్రహ్మరూప ఆత్మకును దేహ (శరీరము మొదలగు) రూప అనాత్మకును.

౧. భేదము గలదా? ౨. లేక అభేదముగలదా? ౩. లేక భేదాభేదములు రెండును గలవా? అను నీమూడు వికల్పముల నడుగుదుము. వానిలో:

౧. వానికి భేదమును చెప్పినట్లయిన శ్రుతిస్మృతి యుక్తి విద్వాంసుల యనుభవమును, వానిచే సిద్ధించిన అద్వైత సిద్ధాంతమేమియౌ, దానికి హానికలుగును.

౨. వానికి అభేదమును జెప్పినచో, నారెంటినిన్ని వేఱు పఱచుట వ్యర్థమగును.

౩. వానికి భేదాభేదము అను రెంటిని జెప్పినచో, చీకటియు వెలుతురునువలె ఒకదానికొకటి విరుద్ధమగునా? రెండు ధర్మ ములకును నొక కాలమందు నొక ఆశ్రయమునందుండుట పొస

గదు. కావున ఈ నీవచనము "నిజము అబద్ధము" అను వాక్యమును బోలి * 77. వ్యాఘాతదోషము గలదగును.

ఈ శంకకు నిది * 78 సమాధానమగును:—

౧. శిష్యా! ఆత్మానాత్మములకు ముందు వేఱుచేసి నెఱుగని (భ్రాంతి) కాలమందు సర్వజీవములకును నభేదము గనంబడుచున్నది. పిమ్మట వివేచనము (వివేకజ్ఞాన) కాలమందు చేతనత్వము మొదలగునవియు జడత్వము మొదలగునవియునగు ధర్మము విలక్షణతా జ్ఞానముచేతను "నా దేహమున్నది" యను ననుభవముచేతను వానికి భేదము కనబడుచున్నది.

---

*77. ఒకదానికొకటి విరోధముగల రెండు ధర్మము లొకయధికరణమందు (ధర్మియందు) కూడియుండుట వ్యాఘాతదోషమగును. అది 'నా తల్లి గొడ్రాలు. నాకు నాలుక లేదు' అను మొదలగువాని యందుండునదగును.

*78 పార్థివకాష్ఠరూప (పృథివి కార్యమగు కట్టెరూప) కార్యమునకును జలతత్వమూలముగ అగ్నితత్వరూపకారణమునకును, చిలుకుటకుముందు అభేదము కనంబడుచున్నది. అది అయోగ్యమగును. శ్రేష్ఠమగు కారణమేదియో దానికి తిరోధానముండుటచే, దానిని (నికృష్ట అభేదమును) పోగొట్టు కొఱకు చిలుకుట మూలముగా, వానిభేదము చేయబడుచున్నది. పిమ్మట కలిగినగ్ని యొక్క ప్రబలత్వము మూలమున వానికి అభేదము కలుగుచున్నది. అదియోగ్యమగును నికృష్ట (తక్కువదగు) కాష్ఠరూపకార్యమునకు దాహమూలమున తిరోధానముండుటచే, అట్లె అనాత్మరూపకార్యమునకును ఆత్మరూప కారణమునకును వివేకజ్ఞానమునకుముందు అభేదము కనంబడుచున్నది. అది అయోగ్యమగును. ఆత్మయొక్క (అధిష్ఠాన) తిరోధానముండుటచే, దానిని (భ్రాంతిచే సిద్ధించిన అభేదమును) పోగొట్టుటకు వాని భేదజ్ఞానరూప వివేకజ్ఞానము చేయబడుచున్నది. పిమ్మట ప్రకటమగు ఆత్మప్రబలత్వము (సాక్షిత్వము) మూలముగా తత్వజ్ఞానకాలమందు వానికి అభేదము కలుగుచున్నది.

౨. వివేచన (పదార్థశోధన) మునకు పిమ్మట గురువుచే నుపదేశింపఁబడిన మహావాక్యముయొక్క అర్థపు విచార(తత్వ జ్ఞాన) కాలము నందును అభేద నిశ్చయము గలుగుచున్నది.

కావున ఆత్మానాత్మలభేదము, అభేదములు రెండును అనుభవింపఁబడినవి యగును. అయిన నారెంటికిని సత్యత్వముచే నైనను కల్పితత్వముచే నైనను నొకధర్మి యొక్క (ఆశ్రయము నందు) ఉనికియూ సంభవింపదు. అవిచీకటియూ వెలుతురును వలె నొకదాని కొకటి విరోధములుగా నుండుటచే అయిననా రెంటిలోను నొకదానికి సత్యత్వమును మరొకదానికి కల్పితత్వమును చెప్పవలయును. కావున ఆత్మానాత్మల భేదాభేదములు రెంటిలోను భేదము కల్పితమును అభేదము సత్యమును నగునని నిశ్చయము చేయవలయును. ఇందుచేఅద్వైత సిద్ధాంతమునకు హాని లేదు. భ్రమ (అవివేకము)చే సిద్ధించిన ముఖ్యఅభేదమును దీర్చుటకొఱకు వానిని వివేకించుటయు వ్యర్థముగాదు. ఈకల్పితముతో గూడిన వాస్తవ అభేదమే * 79 తాదాత్మ్య సంబంధ

---

అది యోగ్యమగును. మిథ్యయగు అనాత్మ (ప్రపంచ) రూపకార్యమునకు బాధకాలముగా తిరోధానముండుటచే,

* 79 ఇటువంటి యభిప్రాయమగును:—రెండు సంబంధులు లేక సంబంధము చెప్పుటకు సంభవింపదు. అభేదము లేక తాదాత్మ్యము చెప్పుటకు పొసగదు. కావున భేదముతో గూడిన అభేదమునకు తాదాత్మ్య సంబంధమని పేరు. భేదాభేదములకు రెంటికిని వెలుతురు చీకటివలె నొకచోటనుండుట విరోధమగునైనను అనాత్మకల్పిత కార్యరూపముగా నుండుటచేతను ఆత్మఅకల్పిత కారణ (అధిష్ఠాన) రూపముగా నుండుటచేతను, నారెంటికిని కల్పిత (మాటుమాత్ర) భేదముగలదు. కల్పితమునకు అధిష్ఠానమునకన్న వేరైన సత్త లేనందున దానికి వాస్తవ అభేదముగలదు. వీనిచే ఆత్మానాత్మలకు కల్పితభేద

మని చెప్పఁబడుచున్నది. ఆ * 80 తాదాత్మ్యమును అనాత్మ యును ఆత్మయును నయిన కార్యకారణముల వలె గుణగుణి యందును జాతివ్యక్తియందును క్రియక్రియగలదాని యందును నెఱుఁగదగినది.

ఇటువంటి ప్రక్రియ యగును:— ౧ సత్యము ౨ కల్పితము అను భేదములచే రెండువిధములగును వానిలో,

౧. భిన్నసత్తగల పదార్థములకు గల భేదమేదిగలదో యది కల్పిత భేదమేయగును. అది రజ్జువునకును కల్పిత సర్పమునకును గల భేదమును జాగ్రత్స్వప్నములకును గల భేదమును ఆత్మా నాత్మలకును గల భేదమును కల్పితములగును. రెండును భిన్న సత్తగలవిగా నుండుట వలన అనుట వలెనగును.

౨ సమానసత్తగల పదార్థములకుగల భేదమేదిగలదో యది (౧) కొన్నిచోట్ల కల్పితమును (౨) కొన్ని చోట్ల సత్యమును నగుచున్నది.

(౧) ఎచ్చట యేదేనొక యుపాధిచే భేదము కనఁబడుచున్నదో

---

ముతోఁగూడిన వాస్తవాభేదరూప తాదాత్మ్య సంబంధముగలదు. దీనినే భేదాభేదములవిలక్షణఅనిర్వచనీయతాదాత్మ్యమనియు చెప్పుదురు. వాస్తవభేదము లేనందున భేదముయొక్క విలక్షణమగును. కల్పితభేదముండుటచే అభేదముకంటె విలక్షణమగును.

*80. ఘటమయిన కార్యమునకును మట్టియయిన కారణమునకును కల్పిత (మాటమాత్ర) భేదమును వాస్తవ అభేదమునుగలవు; అట్లు అనాత్మకును ఆత్మకునునున్నది. అట్లే, ఘటనీలవర్ణమగు గుణమునకును ఘటమగు గుణికిని మాటమాత్రము భేదమున్నది. విచారింపగా గుణమునకు గుణితో భేదము సిద్ధింపదు. కావున అభేదమగును. ఇందుచేతనే వానికి తాదాత్మ్య సంబంధమున్నది. విచారింపగా దానికి భేదము సిద్ధింపదు.

యచ్చట యాభేదము కల్పితమగును. అది సమానసత్త గల ఘటాకాశమునకును మఠాకాశమునకును జీవునికిని ఈశ్వరునికిని గలభేదము ఉపాధిచేఁగలిగినదై యుండుటచే కల్పితమగుటం జేయును.

(౨) ఎచ్చట ఉపాధిలేక స్వరూపముగా భేదము గనబడుచున్నదో, యచ్చట యాభేదము సత్యమగును. అది ఘటపటములకుగల భేదమును, శరీరములకు నొకదానికొకటికిగల భేదమును, ఆకాశము మొదలగువానికి నొకటికొకటికి గల భేదమును ఉపాధిలేని ఘటము మొదలగువాని స్వరూపము చేనైనదిగా నుండుటచే సత్యమగును. వానియందు సత్యభేదమును (౧) పారమార్థికము, (౨) వ్యావహారికము, (3) ప్రాతిభాసికము ను భావముచే (సత్తచే) మూఁడు విధములకల్పన చేయఁబడుచున్నది.

(౧) ఏభేదముయొక్క అనుయోగిప్రతియోగి రెండును పరమార్థసత్తగలవిగా నున్నవో యాభేదము పారమార్థికమగును. సిద్ధాంతమున, శుద్ధచేతనమునకు వేఱుగా పారమార్థికసత్తగల దొక్కటియు లేదు. అందుచే, అనుయోగియు ప్రతియోగియును పారమార్థిక సత్తగలదికానేరదు. కావుననే ఏపదార్థమునకును పారమార్థికభేదమో యేవిధమునను సిద్ధింపదు.

(౨) ఏ భేదముయొక్క అనుయోగియు ప్రతియోగియు వ్యావహారసత్తగలవిగా నున్నవో యాభేదము వ్యావహారికమగును. అది వ్యవహారసత్తగల ఘటపటములకును, పృథివిజలములకును, జీవేశ్వరాదులకును, నొకదానికొకటికిగల భేదము వ్యావహారికమగుట యగును.

(3) ఏభేదముయొక్క అనుయోగియు ప్రతియోగియు, ప్రాతిభాసికసత్తగలవిగానున్నవో, యాభేదము ప్రాతిభాసిక మగును. అదిరజ్జువందు కనఁబడు సర్పము, దండము, మాల మొదలగువానికి నొకదానికొకటికి గల భేదము ప్రాతిభాసిక మగుట పోలును.

ఈ విధముగా సత్యభేదమునందును ఇంతటి విలక్షణత యున్నది.

దేనియందు అన్యముయొక్క భేదమున్నదో, అట్టిభేదము యొక్క ఆశ్రయమేదియో యది అనుయోగియనఁబడుచున్నది. అదిఘటమందుండు పటముయొక్క భేదమునకు, ఘటము అను యోగి యగుటను బోలును. దీనినే ధర్మియనియునందురు.

దేనిభేదము అన్యవస్తువునందున్నదో, ఆ భేదముగలవస్తువు యేదియో యది ప్రతియోగియనఁబడుచున్నది. అది ఘటమందున్న పటముయొక్క భేదమునకు ప్రతియోగి పటమగుట పోలును. దానినే నిరూపకమనియు చెప్పుదురు.

ఈ విధముగా వస్తువునందుండు భేదస్వరూపము చెప్పఁబడినది. ఇట్లు అభేదమున్ను ముఖ్య అభేదము, బాధ (మిథ్యా నిశ్చయ)ము చేనైన అభేదము అనుభేదములచే రెండు విధము లగును.

వానియందు భిన్నసత్తగల పదార్థములకుగల అభేదము, (౧) ముఖ్య అభేదము, ౨ బాధచేనయిన అభేదము, అనుభేద ములచే రెండువిధములు వానియందు,

౧. బాధ లేకయే, స్వరూపముగా వానికి కనఁబడు అభే దమేదియో, యదిముఖ్యము అగును. అది రజ్జునకును సర్పము నకును, స్థాణువునకును పురుషునకును, దేహమునకును ఆత్మ

కును, బ్రహ్మమునకును జగమునకును, మొదట, అవివేకకాలమందుగల అభేదమేదికలదో, యది ముఖ్యమగును. (భ్రాంతిరూపముగానున్నను ముఖ్యమువలె కనఁబడుచున్నది) అనుటను బోలును. అయితే యది భ్రాంతిరూపముగా నుండుటచే మిథ్యయగును.

౨. భిన్నసత్తగల పదార్థములకు రెంటినుండి యొకటిని (అల్పసత్తగల దానిని) బాధించుటలోఁగల అభేదమేదికలదో, యది బాధముచేనైన అభేదమగును. అదిరజ్జువునకును సర్పమునకును, స్థాణువునకును పురుషునకును, బింబమునకును ప్రతిబింబమునకును, ఆత్మకును అనాత్మకును, బ్రహ్మమునకును జగత్తునకును, బ్రహ్మమునకును చిదాభాసమునకును, పిమ్మట తత్వజ్ఞానకాలమందు ఏయభేదము కనఁబడుచున్నదో యది రెంటనొక దానిని బాధించుటచేఁ గలుగుచున్నది. కావునది బాధముచేనయిన, యభేదమగును, అనుటను బోలునదగును. అయిన నాయభేదము భ్రాంతి నివృత్తిచేనైనదిగా నుండుటచే, సత్యమగును.

మిథ్యాత్వనిశ్చయమునకు లేక, త్రికాల అభావ (మూఁడు కాలములేమి) నిశ్చయమునకు బాధయనిపేరు. దానినే నివృత్తి యందురు.

సమానసత్తగల పదార్థములకుగల, అభేదమేదికలదోయది, బాధలేకయే, స్వరూపముగాఁ గాన్పించుచున్నది. కావున ముఖ్యఅభేదమగును. అయితేయీముఖ్యాభేదమున్ను ౧. కొన్నిచోట్లసత్యము, ౨. కొన్నిచోట్ల కల్పితము.

౧. ఎచ్చట ఉపాధిలేని వస్తువుయొక్క స్వరూపమునకు అభేదము కనఁబడుచున్నదో, అచ్చటయీ అభేదము సత్య

మగును. అదిఘటమగు ఉపాధిదృష్టిని విడుచుటచేత కలుగు ఘటాకాశమహాకాశముల అభేదమున్ను బ్రహ్మమునకును కూటస్థ ఆత్మకును గలుగు అభేదమున్ను సత్యమగుటవలె యగును.

౨. ఎచ్చట దోషమగు ఉపాధిబలముచే అభేదము కనఁబడుచున్నదో, అచ్చట యాయభేదము కల్పితమగును. అది సన్నిధి దోషమగు ఉపాధిబలముచే మేఘమునకును ఆకాశమునకును గానఁబడు అభేదము కల్పితమగుటవలె యగును.

ఈ విధముచే అభేదమునకును విలక్షణతయున్నది.

౧. ఆత్మకును దేహమునకును గల అభేదమేదియోయది కల్పితముగా నుండుటచే, అల్పసత్తగల దేహమగు అనాత్మస్వరూపమును బాధించుటచేతనే కలుగుచున్నది. కావుననది సత్యమగును.

౨. మొదట అవివేకకాలమందు సర్వజీవులయందును గనబడు భిన్నసత్తనుగల ఆత్మకును, దేహమునకునుగల అభేదమేదియో యది, సమానసత్తగల పదార్థములవలె ముఖ్య అభేదమగును. ఆముఖ్య అభేదము భ్రాంతిరూపమైయుండుటచే కల్పితమగును.

కావున నాకల్పితముఖ్య అభేదమును నివర్తించుకొనుటకు ముముక్షువగు నతఁడు మొదట ఆత్మ దేహమగు అనాత్మయును, వీనియందు కల్పిత (ఆరోపిత) అభేదముయొక్క వివేచనమును జేయవలెను, పిమ్మట జ్ఞానకాలమందు ఆనాత్మను శాస్త్రయుక్తులచేతను, అపరోక్షానుభవముచేతను బాధించి యారెంటి అభేదమును తెలియవలెను.

౧. మహావాక్యముయొక్క బ్రహ్మాత్మైక్యమగు అర్థమును

విచారించు సమయమున దేహాది ప్రపంచమయిన అనాత్మ యొక్క ఏ బాధము చేయఁబడుచున్నదో యాబాధము ప్రపంచమును నిషేధించు శాస్త్రములవల్లను స్వప్నాది దృష్టాంత రూపమయిన యుక్తులచేతను జేయఁబడినది కావున పరోక్షమగును.

౨. మహావాక్యముయొక్క ముందు చెప్పిన అర్థముయొక్క "నేను బ్రహ్మముగా నున్నాను" అను దృఢనిశ్చయమయిన అపరోక్షజ్ఞానము కలిగిన పిమ్మట ఏయనాత్మ బాధకలుగుచున్నదో, యది యపరోక్షానుభవముచేనైనది కావున అపరోక్షబాధయగును.

అందుచే అపరోక్షబోధమందు అపేక్షింపఁబడిన బాధ, అపరోక్ష బోధముయొక్క ఫలరూపమయిన బాధయనుదాని భేదముచే, బోధ బాధముల నొకదానికొకటి అపేక్షరూప అన్యోన్యాశ్రయదోషము నిటసంభవించుట లేదు.

ఈవిధముగ ఆత్మానాత్మల రెంటికిని వాస్తవ అభేదమున్ను కల్పితభేదమున్ను అంగీకారము చేయుటచే, అద్వైతసిద్ధాంతమునకుఁజేటులేదు; వివేచనముచేసినదియు సఫలమగును.

ఈదేహాత్మల భేదాభేదములందుఁ జెప్పఁబడిన న్యాయము (ప్రకార) మేదికలదో దానితక్కిన శరీరమునకును అవస్థ మొదలగువానికిని చిదాభాసునికిని, ఆత్మకునుగల భేదాభేదములందును ముందుచెప్పిన శంకాసమాధాన పూర్వకముగా తెలిసికొనునది. ఈయర్థము ప్రసంగముచే సక్రమముగా జెప్పఁబడినదగును.

శిష్యుడా! ఈవిధముగా ఆత్మకును స్థూలదేహమునకును దేనిచేత సత్తయొక్కభేదముచే, భేదమున్నదో దానిచే నేను

స్థూలదేహముకాను, ఇదినాది కాదు. అయితే యిది పంచభూత
ములచే దేనిచే నేను స్థూలదేహముకానో దానిచే ముందు
చెప్పిన పేరు, జాతి, ఆశ్రమము, వర్ణము, రూపము మొదలగు
దీనిధర్మములున్ను నేనుకాను, నావియుగావు, అనినీవు నిశ్చ
యము చేయుము.

ఇటుయిదివిశేషమగును:— ౧ "అశరీరం వావసంతం-శరీర
మునకు వేఱైయుండు దానిని"

"శ్లో॥ జీవాపేతంవావ కిలశరీరంమ్రియతే నజీవోమ్రియతే,
నైనం ప్రియాప్రియే స్పృశతః॥

జీవునిచే విడువఁబడిన ప్రసిద్ధశరీరము, నిశ్చయముగానే
మరణించుచున్నది; జీవుఁడు మరణించుటలేదు. వీనిని సుఖ
దుఃఖములు స్పృశించుటలేదు."

శ్లో॥ అశరీరం శరీరేష్వనవస్థేష్వవస్థితం।
మహాన్తంవిభుమాత్మానం మత్వాధీరో నశోచతి॥

అస్థిరమయిన శరీరములందు శరీరములేక నెలకొనియుండు
మహావిభుఁడైన ఆత్మను, ధీరపురుషుఁడు నేననిమతించి, శోకిం
చుటలేదు" అనునీ మొదలగు శ్రుతులచేతను,

౨ శ్లో॥ "వాసాంసిజీర్ణానియథావిహాయ, నవానిగృహ్ణాతినరోఽ
పరాణి। తథాశరీరాణి విహాయజీర్ణా న్యన్యానిసంయాతి
నవాని దేహీ॥

తా॥ ఎట్లు పురుషుఁడు ప్రాతవస్త్రముల విడిచివేఱు క్రొత్త
వస్త్రముల గ్రహించుచున్నాఁడో, అట్లు దేహి
(జీవాత్మ) ప్రాతశరీరములను విడిచి వేఱు క్రొత్తశరీర
ముల పొందుచున్నాఁడు."

శ్లో॥ దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా।
తథా దేహాన్తరప్రాప్తిర్ధీరస్తత్ర న ముహ్యతి॥

తా॥ ఎట్లు దేహికి ఈ దేహమున కౌమారము (కుమారత్వము) యౌవనము, జర (ముసలితనము) కలుగుచున్నదో (స్వప్న దేహము కలుగుచున్నదో) అట్లు, అన్యదేహప్రాప్తి కలుగుచున్నది. దానిలో ధీర (వివేకియగు) పురుషుండు, "నేను పుట్టితిని గిట్టితిని" అని యీవిధముగా మోహమును పొందుట లేదు."

శ్లో॥ ఇదం శరీరం కౌంతేయ క్షేత్రమిత్యభిధీయతే।
ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః॥

తా॥ ఓ కుంతీనందనా! ఈ శరీరము క్షేత్రము అనఁబడుచున్నది. దీని నెఱుఁగునదేదియో దానిని క్షేత్రజ్ఞుఁడు, అని దానిం దెలిసినవారు చెప్పెదరు. అను నీ మొదలగు స్మృతులచేతను.

8. (౧) దేహము పేడకుప్ప వలెను వృక్షము వలెను పెరుగుట చేతను ఆహారము మొదలగువానిని గ్రహించుట చేతను లేక శకటము మొదలగువానివలె నడచుట మొదలగుపనులఁ జేయుటచేతను, లేక కమ్మరి తిత్తులవలె నిశ్వాస ఉచ్ఛ్వాసముల గ్రహించుటచేతను, లేక గానుగ నాడించు యంత్రమువలె మలమూత్రముల విడుచుటచేతను చేతనము కానేరదు. అయితే జడమును, మమత (నాదియను అభిమానము) యొక్క విషయమగును. ఆత్మ జాగ్రతయందు దీనియునికిని స్వప్నసుషుప్తుల యందు దీని అభావమును నెఱుఁగునదిగా నుండుటచే చేతనమును, నేనను వృత్తియొక్క విషయమును నగును. కావున నీ రెంటికిని ఐక్యము పొసగదు.

(౨) లేక, శిశువునకు స్తన్యపానము (పాలుత్రాగుట) నందు ప్రవృత్తికి హేతువయిన ఏ స్తన్యపానమునకు అనుకూలత్వముయొక్క స్మృతి, జన్మమునకు పిమ్మట కలుగుచున్నదో, యాస్మృతి, జన్మాంతరమునందు ఆయనుకూలత్వ అనుభవము లేక సంభవింపనేరదు. కావుననది, జన్మాంతరమున ముందుజెప్పిన అనుకూలత్వానుభవమును కల్పితముచే తెలిపించుచున్నది. ఆయనుభవమునకు కర్తయగు ఆత్మ ఈదేహమునకు వేఱుగా సిద్ధించుచున్నది.

(3) లేక, ఆత్మ, దేహమునకు భిన్నముకానిచో, పూర్వ జన్మమందులేని, ఆత్మచే చేయఁబడని కర్మముల విచిత్రసుఖ దుఃఖరూపమయిన ఫలప్రాప్తియగును.

అకృతాభ్యాగః- "చేయఁబడనిది అనుభవమునకువచ్చుట" అనుదోషమున్ను, ఈశరీరము మరణించినపిమ్మట వేఱుదేహము యొక్క పొందమిచే ఈదేహమున చేసినకర్మములు అనుభవింపక నశించునదయిన,

"కృతవిప్రణాశః-చేయుబడినవి అనుభవములేక నశించుట" అనుదోషమును గలుగుచున్నది. ఈరెండు దోషములును లోకప్రసిద్ధమునకును వేదప్రసిద్ధమునకును విరోధముగలవి యగును. అనునీ మొదలగు యుక్తులచేతను, ఆత్మస్థూల దేహముకంటె వేఱయినదగును.

౪. ఇందుచేతనే:-

యథానభసి మేఘౌఘా రేణుర్వా పార్థివోచితే।
ఏవం ద్రష్టరి దృశ్యత్వ మారోపితమబుద్ధిభిః॥

తా॥ ఎట్లు ఆకాశమందు మేఘసమూహములయినను, వాయు

వునందు పృథివియణువుల సమూహమయినను, ఆరోపింపఁబడి యున్నవో యట్లు జ్ఞానములేని పురుషులచే ద్రిష్ట (ఆత్మ) యందు దృశ్య (స్థూలదేహ)ము ఆరోపింపఁబడియున్నది.' అనునవి మొదలయిన (శ్రీ)మద్భాగవతవచనములును దేహము యొక్క అనాత్మత్వమునందు ప్రమాణములు గలవిగానున్నవి.

47. ఈవిధమున స్థూలదేహమునుండి ఆత్మను వేఱుచేసి, ఇప్పుడు సూక్ష్మశరీరముయొక్క స్వరూపమును దానినుండి ఆత్మ వేఱనుటను చెప్పుచున్నాఁడు

వేటికి ముందుచెప్పిన పంచీకరణము కలుగలేదో యట్టి వంటి ఆకాశాదిపంచమహాభూతములు అపంచీకృత భూతములనఁబడుచున్నవి. వాటినే సూక్ష్మభూతమనియు తన్మాత్రయనియుఁ జెప్పుదురు. ఆయపంచీకృత పంచభూతముల పదునేడు తత్వములచేతను లింగదేహముకలిగెను.

ఇప్పుడు పదునేడు తత్వములతోఁ గూడిన లింగదేహమును జెప్పుచున్నాఁడు.

౧-౫ శ్రోత్రము, త్వక్కు, చక్షు, జిహ్వా, ఘ్రాణమను నైదు జ్ఞానేంద్రియములు,

౬-౧౦ వాక్కు, పాదము, పాణి, ఉపస్థ, గుద, మనునైదు కర్మేంద్రియములు

౧౧-౧౫ ప్రాణము, అపానము, సమానము, ఉదానము, వ్యానమనునైదు ప్రాణవాయువులు.

౧౬-౧౭ సంకల్ప వికల్పమయవృత్తిరూపమనస్సు, నిశ్చయరూపవృత్తి మయమయినబుద్ధి, అనునీ పదునేడు తత్వములును చేరి లింగదేహమనఁబడుచున్నది.

శుభాశుభక్రియల కర్తృత్వము సుఖదుఃఖముల భోక్తృత్వము, పరలోకమునకు బోవుటయు, నీలోకమునకువచ్చుట; రాగము ద్వేషము మొదలగునవి, శమదమ మొదలగునవి, అంధ మంద పటుత్వములను నీ మొదలగునవి లింగదేహము యొక్క ధర్మములగును. [ఇట అంధత్వము, (గ్రుడ్డితనము) మొదలగునవి చెవిటితనము మొదలగువానిని గుర్తించు చున్నవి.]

48. మరణము, మూర్ఛ, సుషుప్తి, ప్రళయము, జ్ఞానము, (సమాధి) అను నైదవస్థలయందును లింగదేహమునకు నాశము (తనకారణమయిన అజ్ఞానమునలయించుట) కలుగుచున్నది. ఇట్లు వ్యభిచారియయియుండుటచే నీలింగదేహము అసత్తగును.

ఆత్మయన్ననో యీయన్నికాలములందును, ఉన్నట్లే ప్రకాశముగలదియయి నెలకొనియున్నది. ఇట్లు అవ్యభిచారి యయియుండుటవలన ఆత్మసద్రూపమగును. ఆత్మ, దేనివలన సద్రూపమయియున్నదో యందువలన, నది యీలింగదేహము కాదు. అయితే ఘటమందు పూర్ణమయిన జలమునకంటె దాని యందుండు ఆకాశము వేఱైయుండుటవలె లింగదేహమునకంటె వేఱుగానున్నది కావున,

శిష్యుడా! ఈలింగదేహము నేనుకాదు. ఇదినాదికాదు. ఇది అపంచీకృత పంచమహాభూతములకార్యమగును. దేనిచే నీలింగశరీరము నేనుకానో దానిచే కర్తృత్వభోక్తృత్వ సుఖ దుఃఖ మొదలగు ముందుచెప్పిన వీనిధర్మములును నేనుగాను, నావియుగావు. అయితే యవి లింగదేహమునకు చేరినవి. వీని నెఱుగు ద్రష్టయగునేను, వీనికంటె వేఱుగానున్నానని నిశ్చయము చేయుము.

ఇట యిది విశేషమగును:—

శ్లో॥ ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవ తు।
బుద్ధింతు సారథింవిద్ధి మనః ప్రగ్రహమేవ చ ॥౧॥
ఇంద్రియాణిహయానాహుర్విషయాం స్తేషు గోచరాన్
ఆత్మేంద్రియమనోయుక్తం భోక్తేత్యాహుర్మనీషిణః ॥౨॥
"శ్రోత్రస్యశ్రోత్రం"
యద్వాచాఽనభ్యుదితం, యేనవాగభ్యుద్యతే।
తదేవబ్రహ్మ త్వం విద్ధి, నేదం యదిదముపాసతే ॥౧॥
యన్మనసానమనుతే యేనాహుర్మనోమతం। ॥తదేవ ॥౨॥
యచ్చక్షుషానపశ్యతి యేన చక్షూంషిపశ్యతి। తదేవ॥ 3॥
యచ్ఛ్రోత్రేణనశృణోతి యేనశ్రోత్ర మిదంశ్రుతం।తదేవ॥ ౪
యత్ప్రాణేనప్రాణితి యేనప్రాణఃప్రణీయతే॥తదేవ॥౫॥

"నాచికేతువా! ఆత్మను రథికుఁడనియు, శరీరమును రథమనియు, బుద్ధినిసారథియనియు, మనస్సును కళ్లెమనియు తెలియుము, (౧)

ఇంద్రియములగుఱ్ఱములందురు [ప్రాణములేక, ఇంద్రియములకు ప్రవృత్తిసంభవింపమింజేసి, ఇట ఇంద్రియశబ్దముచేత, వానియజమానుఁడైన ప్రాణరూపరథముయొక్క బంధము చేకొనఁబడుచున్నది.] వానియందు శబ్దమొదలగు విషయముల మార్గమందురు. ఇంద్రియములను మనసుతోఁగూడిన ఆత్మను పండితులు భోక్తయనిచెప్పుదురు. [కేవల ఆత్మనుగాదు] (౨)

"శ్రోత్రియమునకు శ్రోత్రియము" ఏబ్రహ్మమువాక్కుచే చెప్పఁబడలేదో యేబ్రహ్మముచేత వాక్కుప్రకాశింపఁబడుచున్నదో, దానినే నీవుబ్రహ్మమని యెఱుగుము. ఏవీనిని (బ్రహ్మవిష్ణు మొదలగువారిని) జనులు ఉపాసించుచున్నారో వారు

బ్రహ్మము కాదు [ఇటవాక్కు, సకలకర్మేంద్రియములకు ఉపలక్షణమగును.] (౧) దేనిని మనస్సుచేత (ఫలవ్యాప్తిచేలోకము) మననముచేయుట లేదో, యేది మనస్సును విషయముచేసియున్నదో, దానినే నీవుబ్రహ్మమని తెలిసికొనుము. [తక్కినవస్తువులన్నిచోటులయందును సమానమగును. ఇటమనస్సు, బుద్ధి మొదలగువానికి ఉపలక్షణమగును.] (౨) దేనిని చక్షువుచే గాంచుట లేదో, దేనిచే చక్షువులనుచూచుచున్నావో, దానినే నీవు బ్రహ్మమని యెఱుగుము.

(3) దేనిని శ్రోత్రములచే వినుటలేదో దేనిచే నీశ్రోత్రియము విషయించుచున్నదో దానినే నీవుబ్రహ్మమనియెఱుగుము. దేనిని ప్రాణముచే (ప్రాణవృత్తితోఁగూడిన ఘ్రాణేంద్రియముచేత) విషయముచేయుట లేదో, దేనిచే (ప్రకాశింపఁబడునదిగానుండుటచే) ప్రాణము (ఘ్రాణము) తనవిషయముఁగూర్చిపోవుచున్నదో దానినే నీవుబ్రహ్మమని తెలియుము. [ఇట చక్షు మొదలగు మూడుఇంద్రియములును త్వక్కు, రసనముల ఉపలక్షణమగును] ౫ అను మొదలగు "శ్రుతులచేతను"

శ్లో॥ ఇంద్రియేభ్యః పరాహ్యర్థా హ్యర్థేభ్యశ్చపరంమనః ।
మనసస్తు పరా బుద్ధిర్బుద్ధేః పరతస్తు సః॥

ఇంద్రియములకంటె విషయములువేఱగును. "విషయములకంటె మనస్సువేఱగును. మనస్సుకంటె వేఱయినది బుద్ధి. బుద్ధికంటె వేఱయిన దేదియో యది ఆత్మయగును" అను మొదలగు స్మృతులచేతను లింగమో జడమును, దృశ్యమును, వికారియు, వినాశియు, మనోబుద్ధులకు విషయమునగును. జాగ్రత్ స్వప్నముల దానియునికియు, సుషుప్తియందు దానిలేమియునెఱుఁ

గునట్టి ఆత్మయున్నదో వానికిలక్షణమగును, అను మొదలగు యుక్తులను బోధించి (ఆటు) లింగములచేతను ఆత్మ లింగ దేహముకంటెను వేఱయిసిద్ధించుచున్నది.

49. ఇప్పుడు కారణదేహముయొక్క స్వరూపముతో దాని యాత్మ వేఱగుటను జెప్పుచున్నాడు.

శిష్యుడా! నీవు ఆత్మను దెలియఁజాలవు. తెలియనందున "నేను అజ్ఞాని" యని తన్ను మతించుచున్నావు. ఇదియే అజ్ఞానమని యెఱుగుము. ఆయజ్ఞానమే కారణదేహమగును.

"ఆత్మలేదు" అనునదిఅసత్త్వ (అసత్త్వాపాదక)ఆవరణముచే ఆత్మకనఁబడలేదు' అనునది అభాన ఆవరణమును అగును.

ఈరెండువిధ ఆవరణములకు హేతువగు చిదాభాసునితోడ గూడిన స్థూల సూక్ష్మశరీరములును కర్తృత్వము మొదలగు వాని ధర్మములగు ప్రపంచరూప విక్షేపమునకు హేతువగు రెండును అజ్ఞానరూపకారణదేహపు ధర్మములగును. ఆ కారణ దేహము ఆత్మనెఱుగుటచే నాశమగుచున్నది

స్థూలదేహలింగదేహములకు హేతువైయుండుటచే నీయజ్ఞానము కారణదేహమనఁబడుచున్నది.

ఆ కారణదేహము దేనివలన నీయొక్క దృశ్యమై (నీచేజూడబడునదై) యున్నదో (దేనిచే) నీవుఎప్పుడును దీనికిద్రష్టయయి (దీనింజూచువాడై) యున్నావో, దానిచే నీవీకారణదేహము కన్న వేరయిన అదృశ్యరూపముగానున్నావు.

కావున శిష్యుఁడా! నేనుకారణదేహముఁడనుగాను. ఇదినాది కాదు, ఇది అజ్ఞాని అంశము. దేనిచేనీకారణదేహము నేనుగానో దానిచే దీనిధర్మమయిన ముందుచెప్పిన ఆవరణవిక్షేపములకు హేతువాదము మొదలగునవియును నేనుగాను. నావియుగావు.

కారణదేహమవియగును. నేను దీనినెఱుఁగుద్రష్ట. దీనికంటె వేఱుగానున్నాను. అని నిశ్చయముచేయుము.

ఎట్లు జీవుల వ్యష్టియయిన మూఁడుశరీరముల కంటెను జీవసాక్షి వేఱుచేసి యోజింపఁబడినదో అట్లు ఈశ్వరుని సమష్టి మూఁడు శరీరముల నుండి ఈశ్వరసాక్షి (బ్రహ్మము) ఇట వేఱుపఱిచి యోజింపఁదగినది యగును. అట్లయినను అది ముందు మూఁడవ యుపదేశమందు తెలుపఁబడినది గాన నిట తెలుపఁబడలేదు.

ఇట యిది విశేషమగును:—

శ్లో॥ సుషుప్తికాలే సకలే విలీనే,
తమోఽభిభూతః సుఖరూపమేతి॥

తా॥ సుషుప్తి కాలమందు సకలమును (స్థూలసూక్ష్మప్రపంచమును) లీనముకాఁగా చీకటిచే (అజ్ఞానముచే) ఆవరింపబడినవాఁడై సుఖరూపమును బొందుచున్నాఁడు. అనునీ మొదలగు శ్రుతివాక్యములచేత జగమునకు కారణమును జ్ఞానముచే జీర్ణ(నష్ట)మయియుండుటచే కారణశరీరకమైన అజ్ఞానము, సుషుప్తి యవస్థయందు గనఁబడుచున్నది దానిచేనావరింపఁబడిన చిదానంద రూపమేదియో దానిజ్ఞాత ["సుషుప్తినుండిలేచిన పురుషునికి కలుగు "నేను ఒక్కటియు నెఱుఁగను." అను స్మృతికి కారణరూప సామాన్య చేతనమయిన సుషుప్తియజ్ఞానమునందు అనుభవరూప ప్రకాశకము.] ఆత్మయగును. అది యీ కారణదేహరూప అజ్ఞానముకంటె వేఱని సిద్ధించుచున్నది. స్వప్నమందు స్థూలదేహము తెలియకయుండ ఆత్మప్రకాశించుట అన్వయమగును. ఆత్మవ్యక్తము కాఁగానే స్థూలదేహము వ్యక్తముకామి వ్యతిరేకము. అట్లే సుషుప్తియందు లింగదేహము తెలియక

యుండి సాక్షి తెలియుట అన్వయము. లింగము తెలియమివ్యతిరేకము. అష్టసమాధియందు కారణదేహము తెలియకయుండి సమాధికి సాక్షియయియుండుటచే ఆత్మవ్యక్తమగుట అన్వయమగును. కారణదేహము వ్యక్తము కాని వ్యతిరేకమును నగును. ఈయన్వయవ్యతిరేకములు దేహమును ఆత్మను భేదించునవి యగును.

దేహత్రయ యాత్మవివేచన (వివేకము) వర్ణనమును
నైదవయుపదేశము
సమాప్తము.



# ఆటవ యుపదేశము.

---:o:---

## అవస్థాత్రయా ఆత్మవివేచనము.

50. శిష్యుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ జాగ్రత్స్వప్న సుషుప్త్యాది ప్రపంచం యత్ప్రకాశతే।
తద్బ్రహ్మాఽహమితిజ్ఞాత్వా, సర్వబంధైఃప్రముచ్యతే॥

తా॥ జాగ్రస్స్వప్న సుషుప్తి మొదలగు ఏ ప్రపంచము ప్రకాశించుచున్నదో అది బ్రహ్మము నేనని యెఱిఁగి సర్వబంధముల నుండి మిక్కిలిముక్తుడగుచున్నాడు.

(౧) "అస్యత్రిస్రః అవస్థాః త్రయః స్వప్నాః" ఈజీవునికి మూడవస్థలుఁగలవు. అవిమూఁడునుస్వప్నములట (మిథ్యయట)" (౨) ఈ మొదలగు శ్రుతులచేతను,

శ్లో॥ త్రిషుధామసుయద్భోగ్యం భోక్తాభోగశ్చయద్భవేత్ ।
తేభ్యోవిలక్షణస్సాక్షీ చిన్మాత్రోఽహంసదాశివః॥

తా॥ జాగ్రము మొదలగు మూఁడుచోట్లయందుగల భోగ్యము, భోక్తా, భోగమను త్రిపుటి విలక్షణమయిన చిన్మాత్రసాక్షిరూప నేనుసదాశివుడై యున్నాను. (౩) అను సూతసంహిత వాక్యముచేతను,

శ్లో॥ బుద్ధేర్జాగరణం స్వప్నః సుషుప్తిరితి వృత్తయః।
తా యేనైవానుభూయంతే సోఽధ్యక్షః పురుషః పరః॥

తా॥ బుద్ధికి జాగ్రము స్వప్నము, సుషుప్తి, అనునవి వృత్తులు. అవియెవనిచే ననుభవింపఁబడుచున్నవో, యీసాక్షియగుపురుషుఁడు, పరమాత్మయగును."(౪)అను శ్రీభాగవతపు నేడవస్కంధమునందుండు వాక్యముచేత మూఁడవస్థలనుండి వేఱుచేయఁబడిన ఆత్మ బ్రహ్మరూపముగా నిశ్చయింపఁబడి

యున్నదను నభిప్రాయముచేత శిష్యుఁడు ప్రశ్నించుచున్నాడు. స్వామీ! చెప్పఁబడిన నీమూఁడు దేహములును, దృశ్యమై యుండుటచే జడము; నేను వీనిద్రష్టనుగా, చేతనుఁడ; కావున నీమూఁడు దేహములును నేనుగాను అను తమరవాక్యమయిన అభిప్రాయమును నేనెఱింగితిని ఇప్పుడుమూఁడవస్థలు ఎట్లున్నవి. వానిని చెప్పవలయును.

51. మూఁడవస్థలును వాటిలో నాత్మకుగల భేదమును

౧ జాగ్రము ౨ స్వప్నము ౩ సుషుప్తి అనునవి మూఁడవస్థలు. ఈమూఁడవస్థలును నీవుగావు. అవినీవియు గావు. ఈమూఁడవస్థలును క్రమముగా మూఁడుదేహములకున్నవి. వాటిలో స్థూలదేహ అవస్థ జాగ్రతయును సూక్ష్మదేహయవస్థ స్వప్నమును కారణదేహపు యవస్థసుషుప్తియగును. ఇది వీనిక్రమమగును.

52. జాగ్రదవస్థా వర్ణనము.

ఏ యవస్థయందు మనుష్యుఁడుఁ జాగ్రత (మేల్కొని యుండుట) కలిగి వ్యవహారములు చేయుచున్నాడో యది జాగ్రావస్థయగును.

ఆ జాగ్రతావస్థ యేలాటిదనగా దేనియందు పదునాలుగు త్రిపుటులచే నన్ని వ్యవహారములును గలుగుచున్నవో అలాటిదగును.

ఇటమతివ్ఞు దేనియందువ్యవహారక పదునాలుగు త్రిపుటులచే నన్ని వ్యవహారములును కలుగుచున్నవో యది జాగ్రతావస్థ యనఁబడుచున్నది. అని జాగ్రతావస్థయొక్క స్థూల లక్షణము సూచింపబడినది. ముందు "దేనియందు పురుషుడు (మేల్కొను చున్నాడో" అను వాక్యముచేత నీయర్థము సూచింపబడునదగు చున్నది.

దేవతలకును మనుష్యులకును జాగ్రావస్థగలదు.
పశుపక్షి మొదలగు వాటికి స్వప్నావస్థగలదు
ద్రుమాను కొండ మొదలగు వాటికిసుషుప్త్యవస్థగలదు
వానిలో ద్రుమాకులకు క్షీణ (తక్కువ)సుషుప్తిగలదు.
కొండ మొదలగు వానికి గాఢ (దట్టమైన)సుషుప్తిగలదు.

దేనినుండి లేపుట లేక (నిద్రనుండి) తానే లేచుచున్నాడో అదిక్షీణసుషుప్తి యనఁబడును.

దేనినుండి లేపితే గాని నిద్రనుండి లేచుటలేదో యది గాఢ సుషుప్తి యనఁబడుచున్నది.

౧ శుభేచ్ఛ సువిచారణ తనుమానసి అనుసీమూఁడు జ్ఞానభూములు పర్యంతము అభ్యాసముగల జిజ్ఞాసులకు జాగ్రతావస్థగలదు.

౨. సత్వాపత్తియను పేరుగల నాల్గవభూమిని గల బ్రహ్మవిత్తను జీవన్ముక్తుఁడయిన విద్వాంసునకు:—

తనస్వరూపపు అవిచారకాలమందు జాగ్రతము వంటి యవస్థయున్నది.

విచారకాలమందు స్వప్నము నుండి లేచిన పురుషుని వంటి యవస్థయున్నది.

3. అసంసక్తి యను ఐదవజ్ఞానభూమినిగల బ్రహ్మవిద్వాంసుఁడైన జీవన్ముక్తునికి:—

సమాధి నుండి లేచిన కాలమందు స్వప్నము నుండి లేచిన వానివంటి యవస్థగలదు.

సమాధికాలమందు సుషుప్తివంటి యవస్థయున్నది.

౪. పదార్థాభావిని యను నాఱవ భూమినిగల బ్రహ్మవిద్వరిష్ఠుఁడైన పురుషునికి:—

అనేకముగా సుషుప్తి వంటిదియును

ఒకకాలమున స్వప్నమునుండి లేచినది వంటిది యైన అవస్థయున్నది.

తురీయమను నేడవ భూమి నెక్కిన బ్రహ్మవిద్వరిష్ఠ జీవన్ముక్తునకు ఎప్పుడును గాఢసుషుప్తివంటి యవస్థగలదు.

ఈయన్ని యవస్థలును జ్ఞానరూప వృత్తిఃయగును. ఏలయన

౧. క్షేపము (లోకవాసన శాస్త్రవాసన దేహవాసనయని మూఁడు రాజసవాసనలచేతను ఉద్భూతమయిన రాగద్వేషము మొదలగు వానితో గూడుట)

౨. మూఢత్వము (నిద్ర)

౩. విక్షేపము (క్షేపమునుండి విశేషమయిన చిత్తమునకు ఒకకాలపు ధ్యానముతో గూడి యుండుటయు

౪. ఏకాగ్రత్వ (ఒకేవిషయరూపమగుట)

౫. నిరోధము (అనాత్మాకారమును విడిచి ఆత్మయందు నిలుచుట, లేక తన యుపాదానమైన సత్వగుణమందు చిత్తము లయమగుట)

ఈయైదుభూములును యోగశాస్త్రమందలిబుద్ధికున్నవిగా జెప్పఁబడియున్నవి. దేనిచేజాగ్రత మొదలగునవియును ఇచ్ఛ మొదలగునవియు నయిన యవస్థలు వాని యందు అణగినవై యున్నవో దానిచేనివియు బుద్ధియొక్క యవస్థలేయగును ఆత్మవి కావు. ఆత్మవీనికి సాక్షియై ఎప్పుడునువీనికి వేఱుగా నున్నదని తెలియుము.

### ౧౩. పదునాలుగు త్రిపుటులవర్ణనము

౧-౫ ఐదుజ్ఞానేంద్రియములు ౬-౧౦ ఐదుకర్మేంద్రియములు.

౧౧-౧౪ మనస్సుబుద్ధి చిత్త అహంకారములను నాలుగు అంతఃకరణములు అనునీపదునాలుగు ఇంద్రియములును అధ్యాత్మములగును.

౧-౫ దిశలు వాయువు సూర్యుఁడు వరుణుడు అశ్వనికుమారులను నైదుగురును క్రమముగా జ్ఞానేంద్రియముల దేవతలు.

౬-౧౦ అగ్ని ఇంద్రుడు ఉపేంద్రుఁడు ప్రజాపతిమృత్యువను నీయైదుగురును కర్మేంద్రియముల దేవతలగుదురు.

౧౧-౧౪ చంద్రుఁడు బ్రహ్మ వాసుదేవుఁడు (క్షేత్రజ్ఞుఁడు) రుద్రుఁడు అనునీ నలుగురు అంతఃకరణముల దేవతలగుదురు.

ఈపదునాలుగురు దేవతలును అధిదేవతలు.

శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము, అను నైదును జ్ఞానేంద్రియముల విషయములగును.

వచనము ఆదానము గమనము రతి మలవిసర్జనముఅను నీయైదును కర్మేంద్రియముల విషయములగును

సంకల్ప వికల్పములు, నిశ్చయము, చింతనము, అహంభావము, అను నాల్గును అంతఃకరణ విషయములగును.

ఈశబ్దము మొదలుపదునాలుగు విషయములు అధిభూతములగును.

ఇట్లు ఒక్కొక్క యింద్రియమును అధ్యాత్మము. దానియొక్కొక్క దేవతయు అధిదైవతము దానియొక్క విషయమును అధి భూతమునగును.

వీటిచే నీపదునాలుగు త్రిపుటులకును భేదము గలదు.

54. ఈవిధమున జాగ్రతావస్థ యొక్క స్వరూపమును జెప్పియికదాని సామగ్రిని జెప్పుచున్నాడు.

జాగ్రతావస్థయందు చిదాభాసరూప జీవునికి: —

౧ నేత్రము స్థానము. జాగ్రతయందును అదిశరీరమంతటను వ్యాపించియున్నది అట్లయినను దాని విశేషభాగము నేత్రమందుండుటచే నేత్రము స్థానమనఁబడుచున్నది.

౨. క్రియాశక్తియగును. ౩ వైఖరి వాక్కు ౪ స్థూలము, భోగము ౫ గుణము సత్వము ౬ విశ్వయును పేరు పొందిన ఈజీవుడు జాగ్రతయొక్క అభిమానియగును.

55. ఇప్పుడు లెక్కిన అవస్థలయందు ఆత్మయొక్క అన్వయమునున్ను జాగ్రత్తయొక్క వ్యతిరేకమునున్ను చెప్పుచున్నాఁడు.

స్వప్నసుషుప్తులందుండు జాగ్రతావస్థయొక్క అభావమేదియో యది దాని వ్యతిరేకమగును.

శిష్యుఁడా! నీవుదానికి సాక్షీగానున్నావు. అది యెప్పుడును స్వరూపముగా సత్తగలదియగును. ఇదిఅచ్చట నుండు నీయన్వయ మగును

ఇందుచే నీవుస్థూల దేహముతోఁ గూడిన జాగ్రతావస్థ కంటెను వేఱుగానున్నావు.

పుష్పమాలయందు ప్రవేశించియుండు నూలుపోగువలె దేహముతోఁగూడిన సర్వావస్థలందును ఆత్మయొక్క ప్రవేశము గలదు. అదిఆత్మయొక్క అన్వయమనఁబడును.

పుష్పములవలె నొకదానికొకటియైనను తన యధిష్ఠానమైన ఆత్మతో నైనను దేహముతో గూడిన మూడవస్థలకు గల భేదమేదియో యది దేహముతో గూడిన యవస్థల వ్యతిరేకమనఁబడు చున్నది.

ఇటవ్యతిరేకమనునది అభావమునకును అన్వయమనునది భావమునకునునగును.

56 స్వప్నావస్థావర్ణనము:—

జాగ్రతావస్థయందు శ్రవణమైనను నేత్రమైనను తక్కిన యింద్రియములచే నైనను అనుభవింపబడిన విషయముల జ్ఞానముచేగలుగబడు వాసనలేవిగలవో యవి వెండ్రుకకొనవలె సూక్ష్మమైయి కంఠమందుండు హితఅను నాడియందున్నవి.

వంశాకారరూప వాసనయొక్క శబ్దమొదలగు విషయములును వాని జ్ఞానమునకు కంతురూపములును యే నిద్రకాలమందు గలుగుచున్నవో దానిని స్వప్నావస్థ యనవలెను.

57. స్వప్నావస్థయొక్క సామగ్రి.

స్వప్నావస్థయందు చిదాభాస రూపజీవునకు

౧ కంఠము స్థానము ౨. బలము (శక్తి) జ్ఞానము 3. మధ్యమ, వాక్కు. ౪ సూక్ష్మ (వాసనామయము), భోగము ౫ గుణము రాజసము ౬ తైజసుడను పేరుపొందినయీజీవుఁడు ఈయవస్థకు అభిమాని ఇది స్వప్నసామగ్రి చెప్పఁబడినది.

58 ఇకస్వప్నసంబంధమైన అన్వయవ్యతిరేకములఁజెప్పుచున్నాడు.

౧. జాగ్రత్సుషుప్తులందుండు స్వప్నావస్థ అభావమేదియో యది దానివ్యతిరేకమగును

౨ ఆవ్యతిరేకము యొక్క సాక్షియైన నీవు ఎప్పుడును తన స్వరూపముగా సత్తగలవాడుగా నున్నావు

ఇదియే యచ్చటయుండు నీయన్వయమగును. కావున నీవు దీనికి వేఱుగా నున్నావు.

59. సుషుప్తియవస్థవర్ణనము

ఏయవస్థ యందుండి మేల్కాని "నేనొకటినెఱుగ"

వని నిద్రకాలమందనుభవించిన అజ్ఞాన స్మరణరూప జ్ఞానము కలుగు చున్నదో ఆవిధ గాఢ (లోతైన) నిద్రను సుషుప్తి యనెదరు

60. సుషుప్తి యవస్థ సామగ్రివర్ణనము.

సుషుప్తి యవస్థయందు జీవునికి ౧ హృదయము స్థానము,

౨. బలము (శక్తి) ద్రవ్యరూపము.

ఎందుచే నటక్రియా రూపమును జ్ఞానరూపమును నగు వ్యవహార అభావమున్నదో.

ఎందుచే అజ్ఞానరూప ద్రవ్యమగు వస్తుమాత్రపు ఉనికియున్నదో అందుచేనట ద్రవ్యము శక్తియనఁబడుచున్నది లేక అట అజ్ఞానమందు ద్రవ్యమగు నాకాశము మొదలగు భూతములనుగల్పించుట యొక్క సామర్థ్య రూపశక్తి ఏదియో యది ద్రవ్యశక్తియనఁబడు చున్నది.

౩. వాక్కు పైసంధి (హృదయ మందుండునది.)

౪. ఆనందము భోగము ౫. గుణము తమస్సు.

౬. ప్రాజ్ఞుఁడను పేరుపొందిన జీవుడుసుషుప్తికి అభిమాని యగును. ఇది సుషుప్తియొక్క సామగ్రియగును.

61. ఇప్పుడు సుషుప్తిసంబంధమగు అన్వయవ్యతిరేకములు చెప్పెదము.

౧ జాగ్రస్స్వప్నముల యందున్న సుషుప్తియొక్క అభావ మేదియో యది ఆటదాని వ్యతిరేకమగును.

౨: ఆ వ్యతిరేకమునకు సాక్షియగున నీవు ఎప్పుడును స్వరూపముగా సత్తగలవాఁడుగా నున్నావు. ఇది యచ్చట యందు నీయొక్క అన్వయము.

దీనిచేతనే నీవు సుషుప్త్యవస్థకంటె వేఱుగానున్నావు. జీవుని మూఁడవస్థలకంటె ఆత్మవేఱుచేసి యెఱిగింపఁ బడినది. అట్లే ఈశ్వరుని మూఁడవస్థలనుండి బ్రహ్మమున్ను ఇచ్చట వేఱుచేసి యెఱిగింప బడవలసినదగును. అట్లయినను అదిమూఁడవ యుపదేశమందు తెలిపింపఁబడినందున యిట తెలిపింపఁబడ లేదు.

అవస్థాత్రయ ఆత్మ వివేచనమను ఆఱవ యుపదేశము సమాప్తము.

——:o:——

# ఏడవ యుపదేశము.



## పంచకోశములు ఆత్మవివేచన వర్ణనము.

### 62. శిష్యుఁడు చెప్పుచున్నాఁడు.

స్వామీ! మూడవస్థలు నేనుగాను. ఇవి నావియుగావు, అను తమయభిప్రాయమును తెలిసికొంటిని.

ఇక పంచకోశముల పేర్లును రూపములను గృపయుంచి చెప్పవలయును.

### 63 గురువు చెప్పుచున్నారు.

౧. మొదటిది అన్నమయము, ౨. రెండవది ప్రాణమయము. ౩. మూడవది మనోమయము, ౪. నాల్గవది విజ్ఞానమయము, ౫ ఐదవది ఆనందమయకోశము.

ఇవిపంచ * 82. కోశముల పేర్లనియెఱుంగుము

* 82. కోశమనునది కోశకారమను పురుగుయొక్క ముండ్లచేసైన గూడగును. అట్లు ఆపురుగునకు క్లేశమునకు హేతువయి యుండుటవలన కోశమన బడుచున్నదో అట్లు ఈపంచకోశములును ఆత్మకు ఆవరణమూలమున క్లేశమునకు హేతువయియుండుటచే కోశములనఁబడుచున్నవి. లేక కత్తియొక్క ఒరయును ధనముయొక్క బొక్కసమును క్రమముగా కత్తిని ధనమును మూయునదిగా నున్నందున కోశమనఁ బడుచున్నది. అట్లే యీపంచకోశములును దేనిచేఆత్మను మూయునదిగానున్నవో దానిచేత కోశములగును.

ఎట్లు నీలము, పీతము, (పసుపు) మొదలగు వర్ణములమీద యుంచఁబడిన స్ఫటికము మొదలగునవి ఆయారూపముగాఁ గనఁబడుచున్నదో అందుచేనవి వాని (స్ఫటికమొదలగువాని) ఆవరణములగునో యట్లు పంచకోశములందున్న ఆత్మ ఆయారూపముగా ప్రకాశించుచున్నది. కావున నది (కోశము) దీనికి ఆవరణమగును. విచారముచేయఁగా అదివానికి వేఱుగానున్నది.

ఇక్కడు పంచకోశముల ఆహారములను చెప్పుటతో వాని అనాత్మతయును చెప్పుచున్నాడు.

౧. (౧) మాతాపితరలు భుజించిన యన్నముచేనయిన రజస్సు(తల్లిరుధిరము) చేతను శుక్లము (తండ్రిరేతస్సు) చేతను తల్లి కడుపున నుత్పత్తియగుచున్నది

(౨) పుట్టినపిమ్మటపాలు మొదలగుఅన్నముచే పెరుగుచున్నది.

(3) మరణమానకు పిమ్మట అన్నమగు పృధివి యందు లయించుచున్నది. ఈవిధమయిన స్థూలదేహ మేదికలదో యది అన్నమయకోశమనఁబడు చున్నది,

ఈయన్నమయ కోశమగు పక్షికి ఇది చే (ప్రసిద్ధముగా నుండుటయే) శిరస్సగును: తూర్పు దిక్కునకు ఎదురు ముఖముగానుండు పురుషుని యిది (కుడిభుజము) దక్షిణ (కుడి పక్ష మగును. (రెక్కయగును). ఇది (ఎడమభుజము) ఉత్తర(ఎడమ) పక్షమగును (ఇది మధ్యదేహపు భాగము) అంగముల ఆత్మ (స్వరూప) మగును. ఇది (నాభికిక్రింది అంగము) పుచ్ఛ (తోక) రూప ప్రతిష్ఠ యగును (ఆధారము)

౨. ఐదు కర్మేంద్రియములును ఐదుప్రాణములు నైనపది తత్వములు జేరి ప్రాణమయ కోశమనఁ బడును.

ఈప్రాణమయ కోశమగు పక్షికి ప్రాణమే శిరస్సును వ్యాన ముదక్షిణపక్షమును అపానము ఉత్తర పక్షమును ఆకాశము (సమాన వాయువు) ఆత్మయును, (మధ్యభాగస్వరూపమునగును.) పృథివి పుచ్ఛ(తోక)రూపప్రతిష్ఠయగును. దేనిచే అధ్యాత్మ (దేహమునందుండునది.) రూప ప్రాణునకు పృధివిరూప దేవత స్థితికిహేతువైయుండుటచే ధారణచేయునదిగా నున్నదో దానిచే పృధివి ప్రతిష్ఠ యనఁబడినది.

3. ఐదు జ్ఞానేంద్రియములును మనస్సునునయిన ఆఱుతత్త్వములును చేరి మనోమయ కోశ మనఁబడును.

ఈమనోమయరూపపక్షికి యజుర్వేదమే శిరము. ఋగ్వేదము దక్షిణపక్షమును సామవేదము ఉత్తరపక్షమును ఆదేశము (ఉపనిషద మొదలగు బ్రాహ్మణములభాగము) ఆత్మయునగును అథర్వాంగిరసము (అథర్వ వేదము) పుచ్ఛరూప ప్రతిష్ఠయునగును.

వర్ణోచ్చారణముయొక్క (స్థానము) ప్రయత్నము నాదము స్వరమనువీనిచేనిండిన పదమును వాక్యమును విషయముచేయునదగువాని (స్థానము మొదలగువాని) సంకల్పరూప వాని భావనగల మనస్సు యొక్క వృత్తి యేదిగలదో యది శ్రోత్ర మొదలగు కరణముల మూలముగా యజుర్వేదము యొక్క సంకేతముచే విశిష్టమయి "యజుర్వేద"మని చెప్పఁబడుచున్నది. ఇట్లే ఋగ్వేదమును నున్నది. ఇట్లే సామవేదమును నున్నది. వీనిచే మంత్రములకు మనోరూపత్వ మున్నదిగా మనస్సు యొక్క వృత్తియే ఆవర్తనముచేయ (త్రిప్ప) బడుచున్నది. దీనిచే మానస జపము సంభవించుచున్నది. దీనిచే మనోమయకోశమునకు వేదరూపత్వము తైత్తిరీయ ఉపనిషత్తు నందు చెప్పఁబడుచున్నది.

4. ఐదుజ్ఞానేంద్రియములును బుద్ధియు నయిన నీ యాఱు తత్త్వములు చేరి విజ్ఞానమయ కోశమనఁబడు చున్నది.

ఈవిజ్ఞానమయ కోశరూపపక్షికి శ్రద్ధయే శిరము. ఋతము (సత్యము పలుకుటకు హేతువయిన వృత్తి) దక్షిణపక్షమగును. సత్యము (సమదర్శనము) ఉత్తర పక్షమగును. యోగము (చిత్తము యొక్క యేకాగ్రత) ఆత్మయగును. మహత్తత్త్వము

(సమష్టి బుద్ధి) పుచ్ఛరూప ప్రతిష్ఠయగును. (తోకకు ఆధార ముగానుండు పృథివివలె బుద్ధికి ఆధారమగును) ఇట మనోమయ మునకు వేదరూపత్వమును విజ్ఞాన మయమునకు శ్రద్ధాది రూపత్వమును జెప్పఁబడినది: అది అధికారి యొక్క మనో బుద్ధులచే గలుగునదిగా నుంకుటచే జెప్పఁబడినది.

ఈవిధ ప్రాణము మొదలగు మూఁడు కోశములును లింగ దేహరూప మగును.

(౧) ప్రాణమయము, (౨) మనోమయము. (౩) విజ్ఞాన మయము, అను నీమూఁడుకోశములును లింగదేహ రూపమే యగును. అట్లయినను.

(౧) ప్రాణమయకోశము కేవలము రజోగుణయవస్థయగును

(౨) మనోమయకోశము రజో గుణముతోఁగూడిన సత్వ గుణ యవస్థయగును.

(౩) విజ్ఞానమయకోశము కేవల సత్వగుణ యవస్థయగును. ఇట్లు గుణముల యవస్థలభేదములచే ఒకేలింగ దేహమందు మూఁడుకోశముల కల్పనయున్నది.

౫. ఆత్మయొక్క స్వరూపరూప ఆనందముయొక్క ప్రతి బింబముతోఁగూడిన ప్రియమోద ప్రమోదరూప వృత్తుల, లయమునకు స్థానమయిన కారణదేహమేదియో యది ఆనంద మయకోశమనఁబడు చున్నది.

ఇష్ట విషయముయొక్క దర్శనమువలన కలుగువృత్తిప్రియ ము అగును దానిలాభముచే గలుగు వృత్తి మోదమగును. దానిభోగముచే కలుగు వృత్తి ప్రమోద వృత్తియగును.

ఈవృత్తులు జాగ్రత్ స్వప్నముల పుణ్యకర్మల ఫలమగు

సుఖము యొక్క భోగకాలమందుదయించుచున్నవి. పుణ్యఫల భోగ అభావకాలమందు కలుగు సుషుప్తి యేదియో దానియం దావృత్తులు, తమ కారణమయిన అజ్ఞానమునందు లయించుచున్నవి. ఆ యజ్ఞానము ఆనందమయ కోశమగును.

ఈ యానందమయకోశ రూపపక్షికి ప్రియవృత్తి శిరము. మోదవృత్తి దక్షిణపక్షము, ప్రమోదవృత్తి ఉత్తరపక్షము. ఈవృత్తుల ప్రతిబింబరూప విషయానందము దీని ఆత్మయగును. బింబమగు ఆనందరూప బ్రహ్మము పుచ్ఛరూప ప్రతిష్ఠయగును (ఆధారమగును)

ఇటఅన్నమయ కోశమునకు పక్షము, పుచ్ఛము, మొదలగు వానికి సమానమయిన అవయవములు ప్రసిద్ధమగును. కావున దానిపక్షిత్వము యొక్క రూపకమును ప్రసిద్ధమే యగును. కోశమందు పోయఁబడిన కరగించిన తామ్రపు ప్రతిమవలె ప్రాణమయ మొదలగు కోశములకురూపకము సిద్ధించుచున్నది. కావున కోశములందు పక్షి యొక్క ఆకారమును కల్పించునదేదియో యది బాహ్యవిషయముల ఆసక్తిని (ఆశను) నిషేధించుటకు హేతువైనబుద్ధిని ఆత్మయందు నిల్పుటకొఱకగును. ఉపాసనపు విధానము కొఱకుఁగాదు.

ఇట్లు చెప్పఁబడిన పంచకోశములును, అనిత్యమును, జడమును వికారియును వ్యభిచారియును క్షణికమును నగును

వీని నెఱుఁగు ఆత్మయయిన నీవు అలింగముగా నున్నావు. అనగా నీపంచకోశముల లింగమును లక్షణము లేవియో యవి లేనివాఁడుగా నున్నావు. కావున నీవు నిత్యమును చేతనమును అవికారియు అవ్యభిచారియు, ఎప్పుడునుండు వాఁడును నగుదువు

కావున నీ *౮౩. పంచకోశములు నీవు కావు. అయితే నీవు వీని వేఱుగానుండుటచే పంచకోశాతీతుడవు.

---

* ౮౩. ఇటు ఇది విశేషమగును:—

౧. అన్నముచే కలిగినదియు, అన్నముచే జీవించి యుండునదియు అన్నములేనందున నాశమగునదియును, తోలు, నరము, మాంసము, నెత్తురు, ఎముక పురీష (మలము) అనువాని రాశియు, పుట్టుకకుపూర్వమును మరణమునకు వెనుకయు లేనిదియు, నియమము లేని స్వభావముగలదియు, అనేకరూపములు గలదియు జడమై ఘటమువలెనే కడుపు చేతులు కాళ్ళు మొదలగువాని గలదియు నిత్యమునందుంచదగిన దుఃఖరాశియు, మాంసముచే పూయబడినదియు, నగుచున్న యీస్థూలదేహరూప అన్నమయకోశమేదియో యది ఆత్మకాదగినది గాదు. ఏలయన ఆత్మ దీనికి విలక్షణమయి నిత్యమును, శుద్ధమును ఉత్పత్తి నాశములులేనిదియు, నియమింపఁబడిన స్వభావము గలదియు, ఏకమును, చేతనరూపమును ద్రష్టయును షడ్భావరూప వికారముల నెఱుఁగునదియు, అంగములులేనిదియు, శరీరజీవనమునకు హేతువైనదియు, ఆధారశక్తి గలదియు. (శక్త్యధిష్ఠాన) నిరాకారమును జీవము దానిధర్మము దానికర్మము దానియవస్థయున్నగు వానికిసాక్షియు, నిత్యోపలక్షకమును, జ్ఞాతయు, నై యున్నది

౨. ఎందుచే అన్నముచే నిండింపుటచే అన్నమయకోశము బలము గలదై అన్నిక్రియలందును ప్రవృత్తము (ప్రయుక్తము) గలదగుచున్నదో, అట్లే వాయువుయొక్క వికారము వాయువువలె బయటలోపల పోవుట వచ్చుటయునై యతురేయ యిష్టునకైనను, అనిష్టునకైనను తనకైనను, తక్కిన వారికైనను, ఒక్కటియును తెలియనిదియు నిత్యపరతంత్రమైయున్న నీవిధమైనదియు కర్మేంద్రియములతోఁగూడిన ప్రాణరూప ప్రాణమయకోశమేదియో యది యాత్మయగుటకు తగినదికాదు. ఏలన ఆత్మ దీని విలక్షణజ్ఞాతయయి (ఎఱుగునదియును) లోపలను బయటను పూర్ణమయి నిశ్చలరూపమైయున్నది.

౩. నేను నాదియను వస్తువుల వికల్పమునకు హేతువును పేరు మొదలగు భేదకల్పనతోఁ గూడినదియు అత్యంత బలముగలదియైన ఏది

చెప్పంబడిన అన్నమయము మొదలగు కోశములేవియో యవి అనుభవముయొక్క విషయముగా చేయబడుచున్నవి. వాటికంటె వేఱయిన ఒక ఆత్మ చేయి మొదలగు వాటిమీద నుంచఁబడిన విశ్వరూప (స్ఫటికమునకన్న స్వచ్ఛమయిన) మణివలె అనుభవమునకు విషయము కానేరదు. అట్లయినను నా పంచకోశములు ఏ యనుభవము (చేతనరూప స్వప్రకాశజ్ఞానము)నకు విషయములగుచున్నవో, యా యనుభవమును "లేదు" అని నిషేధించువాఁడెవఁడు? ఒక్కఁడును నిషేధింప శక్తుఁడు కాఁజాలఁడు. అది స్వప్రకాశమైయుండుటచే కలదైయుండియు ఏ జ్ఞాతకును, జ్ఞానమునకును విషయము కాక అనుభవమే ఆత్మయై యున్నది.

---

దానికంటె ముందటికోశములను నాల్గుప్రక్కలను పూరించి వెలయుచున్నదో యావిధమును నైదుజ్ఞానేంద్రియములతో గూడినమనస్సుయేదియో యదిమనోమయకోశమగును. ఈ మనోమయ రూపాగ్ని ఐదు ఇంద్రియరూప హోతృకర్తలచే విషయరూపనేతి ధారచే పెరిగి బహువాసనారూప ఇంధనములచే జ్వాలలు విడిచి మండునదై ప్రపంచమును (ప్రపంచపు జీవులను) మండించుచున్నది. మనస్సునకు వేఱుగా అవిద్య లేదు. భవబంధమునకు హేతువయిన అవిద్య మనస్సగును. అది నష్టమయిన అన్నియు నష్టమగును. అది ప్రకాశించిన యన్నియు ప్రకాశించును. వస్తువులేని స్వప్నమందు తన శక్తిచే భోక్త మొదలగు సకల విశ్వమును మనస్సే సృష్టించుచున్నది. అట్లే జాగ్రతయందును విశేషములేదు. అందుచే నివియన్నియు మనస్సుయొక్క విలాసమగును. సుషుప్తికాలమందు మనస్సులయించినప్పుడు, "ఒకటియు లేదు" యనునది సకల జనులకు ప్రసిద్ధము. కావున నీ పురుషునికి మనోకల్పితమే సంసారమగును. వాస్తవముగా లేదు. ఎట్లు మేఘము వాయువుచే వచ్చుచున్నదో మరల దానిచేతనే పోవుచున్నదో, అట్లే మనస్సుచే బంధము కల్పించబడుచున్నది. దేహము మొదలగు సర్వవిషయములందును, రాగ

64. <u>అట్లయిన స్వామీ నేను ఎప్పుడు మూడు శరీరములకును మూడవస్థలకును పంచకోశములకును వేత్తయున్నానో</u> అప్పుడు నాస్వరూపము ఏది? యని శిష్యుఁడడుగ గురువు చెప్పుచున్నారు.

౧. దేహము మొదలగు అన్నిటిని ఎఱుఁగునదిగా నున్నందున ఏది ద్రష్టగానున్నదో

౨. ఉదాసీనమున్ను (రాగద్వేషరూప అంతఃకరణముల ధర్మములు లేనిదియు) సమీపించియుండు నదియు ఎఱుఁగునదియైన చేతనరూపమునను యుండుట వలనను లేక అంతరమందును దాని వృత్తియందును చేతన మాత్రముగా నుండుట వల్లను ఏదియన్నిటికి సాక్షిగానుంటున్నదో

---

మును కల్పించి దానిచే దారముచే కట్టబడిన పశువువలె పురుషుని కట్టుచున్నది. పిమ్మట దీనియందు విషమువలె తీరసత్వముచే నా మనస్సు దీనిని బంధమునుండి విడిపించుచున్నది. అందుచే నీ జంతువులకు బంధమునకైనను, మోక్షమునకైనను, కారణము మనస్సేయగును. రజోగుణ, తమోగుణములచేత మలినమైన మనస్సు బంధమునకు హేతువగును, రజస్సు తమస్సులులేని శుద్ధమయిన మనస్సు మోక్షమునకు హేతువగును వివేకము వైరాగ్యమను గుణములు అతిశయము (అధికము) చేత శుద్ధత్వమును బొందిన మనస్సు విముక్తికారకగుచున్నది. కావున బుద్ధిమంతులగు ముముక్షువులకు మొదటినుండియే దృఢమయిన యీ రెండుగుణములతో గూడియుండుట తగినదగును.

మనస్సనునది మహావ్యాఘ్రము. అది విషయమయిన వనభూముల విహరించుచున్నది. వానియందు (ముందు చెప్పిన భూములయందు) సాధువులయిన (సదాచారముగలవారయిన) ముముక్షువులు పోవుటకూడదు. మనస్సను నదే? యోయది స్థూలరూపముగాను, సూక్ష్మ (వాసన) రూపముగాను భోక్త

౩. మూడు కాలములందును (జాగ్రము మొదలగు వాటి యందును బాల్యము మొదలగు వాటి యందును చావు మొదలగు వాటి యందును బాధింప బడనిదిగా నుండుటచేత నేది సత్యముగా నున్నదో

---

యొక్క సకలవిషయములను శరీరవర్ణ ఆశ్రమ జాతిభేదములను గుణక్రియ రూపహేతుత్వముగల ప్రయోజనములను నిత్యమును గలిగించుచున్నది. ఆనందముగాక ఈ మనస్సు అసంగ చిద్రూపమయిన యాత్మను విశేషముగా మోహింపజేసి దేహేంద్రియ ప్రాణరూప త్రాళ్లచేకట్టి "నేను నాది" యని నిరంతరము తనకార్యరూపబలము యొక్క ఫలభోగములందు త్రిప్పుచున్నది. అధ్యాసదోషముచే పురుషునకు సంసారము కలుగుచున్నది. అధ్యాసరూపబంధ మును ఇదియే కల్పించియున్నది. కావున రజస్తమోరూపదోషములుగల అవివేకికి జన్మమొదలగు దుఃఖమునకు కారణము ఇదియగును.(మనస్సగును) కావునతత్త్వ మును తెలిసిన పండితులు మనస్సును అవిద్యయందురు. ఎందుచేవాయువుచే మేఘమండలము తిరుగుటవలె విశ్వము తిరుగుచున్నదో, ఆమనస్సుయొక్క శోధన (శుద్ధికరించుట) ముముక్షువుచే జేయదగినది. ఇది బాగ్గిగా ముక్తియందు అఱచేతియందలి పండువలె నగుచున్నది. ఏ పురుషుడు ముక్తి యొక్కటి యందు ప్రీతిచే విషయములందు రాగమునువిడిచి సకల కర్మములను విడిచి చక్కని శ్రద్ధచే శ్రవణాదులందు స్థిరముగనిలుచునో వాడు బుద్ధియొక్క రజో గుణముచేనయిన స్వభావమును నాశముచేయుచున్నాడు ఈవిధ నీ మనోమ యకోశమున్ను పరమాత్మ కానేరదు. ఏలయన ఆద్యంతములుగలదిగానున్నది. పరిణామిత్వముగలదిగానున్నది. దుఃఖస్వరూపముగానున్నది. ద్రష్టయొక్క విషయదృశ్యరూపముగానున్నది. ద్రష్టయెదియో యది దృశ్యరూపత్వముగా కనబడుటలేదు.

౪. పంచజ్ఞానేంద్రియ సహితవృత్తితోగూడిన కర్తరూపబుద్ధి యేది కలదో అది విజ్ఞానమయకోశమగుచున్నది. అది పురుషునికి సంసారమునకు కారణమగుచున్నది. చేతనముయొక్క ప్రతిబింబశక్తినియందు అనుగతమై

౪. మూడు కాలములందును అన్నిటిని ప్రకాశము చేయునదిగా నుండుటచే నేది చిత్తుగా నున్నదో

౫. పరమ ప్రేమకు విషయమై యుండుటచే నేదియానంద రూపమైయున్నదో

౬. నిర్వికల్ప సమాధియందుండు యోగులు తానే తానని యెఱిఁగి దేనిని ధ్యానించుచున్నారో

---

యున్నదో యా విధి విజ్ఞానమను పేరుగలదియు జ్ఞానరూపక్రియఁగలదియునగు ప్రకృతియొక్క వికారమగును. అది నిరంతరము దేహము ఇంద్రియములు మొదలగు వానియందు అత్యంత అభిమానమును జేయుచున్నది. ఈ విజ్ఞానమయకోశము పరమాత్మకానేరదు ఏలయన వికారియు జడమును పరిచ్ఛిన్నమును, దృశ్యమును, వ్యభిచారియును అనిత్యమును నై యుండుటచే.

౫. ఆనంద ప్రతిబింబముచే నీడ్వబడిన యాకారము దేనికి గలదో యావిధ అజ్ఞానముచే వికాసమును బొందినవృత్తి ప్రియము, మోదము, ప్రమోదము అను గుణములుగలదియు కోరినవస్తువును బొందుటచే నుదయించునదియును పుణ్యము యొక్క అనుభవకాలమందు ప్రకాశించునదియునయిన యానందమయకోశమగును. దానియందు పుణ్యవంతులు అయిన దేహధారులుమాత్రము ప్రయత్నము లేకయే తామే యానందరూపులయి చక్కగా నానందమును బొందుచున్నారు ఈ యానందమయకోశమునకు సుషుప్తియందు స్ఫూర్తి (ప్రకాశించుట) అధికమగును. స్వప్నజాగ్రములందు ఇష్టవస్తువును దర్శనలాభ భోగములచే గొంచెముగలుగుచున్నది. ఈ యానందమయకోశము పరమాత్మకానేరదు. ఏలయన ఉపాధితోగూడినదియు ప్రకృతియొక్క వికారమును పుణ్యక్రియాకార్యమును వికారములతోగూడిన శంకాతంకములతో గూడినదియునై యుండుటచే —

పంచకోశములను యుక్తిచేతను, శ్రుతిచేతను, నిషేధింప గాని నిషేధమునకు ఎల్లయగు బోధరూపసాక్షి మిగులుచున్నది. ఏ యొక్క ఈ యాత్మస్వయంజ్యోతియై పంచకోశముల విలక్షణమై మూడవస్థలకు సాక్షియై నిర్వికార

ఆవిధపుబ్రహ్మమున కభిన్నమగు ఆత్మతత్వమే నీయొక్క స్వరూపమగును.౮౪*

ఇటయిది తాత్పర్యమగును:— చెప్పంబడిన నీయాత్మ అవివేక దృష్టిచే జీవుఁడై వెలయుచున్నది. దానికి

౧. నేత్రము, కంఠము, హృదయము అనుమూడును దేశము.

౨. జాగ్రము స్వప్నము సుషుప్తి అనుమూడును కాలము

౩. స్థూలసూక్ష్మకారణమను మూడును వస్తువులు (భోగసామగ్రులు).

౪. ఇవియే మూడు శరీరములు.

౫. విశ్వ, తైజస, ప్రాజ్ఞులను ముగ్గురు జాగ్రత్స్వప్నసుషుప్తి అవస్థల క్రమముగా అభిమానులు.

---

నిరంజనమై యెల్లప్పుడును ఆనందబ్రహ్మరూపమైయున్నదో అది వివేకవంతుఁడగు పురుషునిచే తనయొక్క ఆత్మత్వముగా తెలియఁగదగినదగును.

౮౪* ఇటయిదియా విశేషణములను శ్రీగ్లచే కీర్తించునవి యగును. ఆత్మయొక్క విశేషణము విధేయము నిషేధ్యము అను భేదముచే రెండువిధములగును. వానిలో ఆత్మయొక్క సాక్షాత్స్వరూపమగు విశేషణములేవోయవి విధేయ విశేషణములనఁబడును. ఈవిధమయిన (౧) సత్తు (౨) చిత్తు (౩) ఆనందము (౪) బ్రహ్మము (౫) స్వయంప్రకాశము (౬) కూటస్థము (౭) సాక్షి ౮ దృష్టం ౯ ఉపద్రష్టం ౧౦ ఏకము అనునీ మొదలగునవి యగును ఎట్లుసధవ (సుమంగలి) అను పదము విధవస్త్రీని నిషేధించి సువాసినిస్త్రీని సూటిగా తెలిపించుచున్నదో అట్లు "సత్తు" మొదలగు విశేషణములు దేనిచేత అసత్తు మొదలగు ప్రపంచపు విశేషణములను నిషేధించి సత్తు మొదలగు రూపమగు బ్రహ్మమును సూటిగా తెలిపించునదియై యున్నది. కావున విధేయవిశేషణమనఁబడుచున్నది ప్రపంచ నిషేధమూలమున ఆత్మను బోధించువిశేషణములు ఏవియో యవి నిషేధ్యములనఁబడుచున్నవి. ఈవిధమయినవి (౧) అనంతము (౨) అఖండము (౩) అసంగము (౪) అద్వితీయము (౫) అజన్మము (౬) నిర్వికారము

౬. జాగ్రము మొదలగు మోక్షపర్యంతమగు సంసారమేదియో యది జీవుని కార్యమగును.

౭. అల్పజ్ఞత్వము మొదలగునవి వాని ధర్మములగును.

ఈసర్వసామగ్రితోఁగూడిన బుద్ధి లేక అవిద్యగాని అధిష్ఠానసాక్షియయిన ఆత్మయును నన్నియుచేరి జీవుడనఁబడు చున్నది. ఇది అన్ని సామగ్రులతోఁగూడిన బుద్ధినిగాని అవిద్యనుగాని, మిథ్యయను తెలివిచే విడిచి, మిగిలియుండు బుద్ధ్యుపహిత లేక అవిద్యోపహిత, చేతన రూపసాక్షియైన ఆత్మయేదియో యది జీవుఁడను పదమునకు లక్ష్యమగును. అదియే యాజీవుని నిజరూపమగును.

---

(౭) నిరాకారము (౮) అవ్యక్తము (౯) అవ్యయము (౧౦) అక్షరము అనునవి మొదలగునవి ఎట్లు ఆవిధవయను పదము విధవస్త్రీని నిషేధించి అర్థమందు ఆమెకు విలక్షణమైన సువాసిని (సుమంగలి) ని తెలిపించు నదిగా నున్నదో అట్లే (అనంతము) మొదలగు విశేషణములు దేనిచే అంతము మొదలగు ప్రపంచ ధర్మములనిషేధించి అర్థముచేవాని విలక్షణమయిన బ్రహ్మమును తెలిపించునదియై యున్నదో అందుచేతనిషేధ్య విశేషణము లనఁబడుచున్నవి.

పంచకోశ ఆత్మవివేచన వర్ణనమను నేడవ యుపదేశము

సమాప్తము.

—— :O: ——

# ఎనిమిదవ యుపదేశము.

తత్త్వంపద వాచ్యార్థలక్ష్యార్థముల చెప్పుటతో గానిఐక్య మును నిరూపించుట

## 65. శిష్యుఁడు చెప్పుచున్నాఁడు.

స్వామీ ! జీవుఁడు, ఈశ్వరుఁడు, వీనిఉపాధియయిన జగత్తు అనువాటిస్వరూపభేదమును నేనెఱింగితిని.

ఇప్పుడు తత్త్వమసియను మహావాక్యమునందుండు, తత్పద త్వంపదముల వాచ్యార్థలక్ష్యార్థములఁ జెప్పవలయు, పిమ్మట యీరెంటిలక్ష్యార్థము ల యభేదమునుజెప్పవలయును.

## 66. తత్పదార్థ వర్ణనము ౧.

శ్రీ గురువుగారు చెప్పుచున్నారు

౧ మాయతోఁగూడిన బ్రహ్మరూప ఈశ్వరుఁడు, తత్పద మునకు వాచ్యార్థమగును.

౨. మాయలేని శుద్ధబ్రహ్మము అవాచ్యమయిన (వాక్కు నకు విషయముకాని) తత్పదముయొక్క లక్ష్యార్థము.

## 67. త్వంపదార్థ వర్ణనము. ౨

౧ చిదాభాస సహితబుద్ధితోఁగూడిన కూటస్థచేతనరూప జీవుఁడు త్వంపదముయొక్క వాచ్యార్థమగును.

౨. చిదాభాస సహితబుద్ధిరూప ఉపాధిలేని కేవలకూటస్థ చేతనమేదిగలదో యది, అవాచ్య, త్వంపదముయొక్క లక్ష్యార్థ మగును.

ఇటయిది తాత్పర్యము:—శబ్దమునకు అర్థముతో నుండు సం బంధము శబ్దవృత్తియనఁబడును. ఆ వృత్తి, శక్తి, లక్షణయను భేదములచే రెండువిధములగును.

౧. శబ్దమునకు అర్థముతోనుండు సాక్షాత్సంబంధము (ప్రవృత్తి) ఏదియో యది, శబ్దముయొక్క శక్తి వృత్తియగును. ఆ శక్తి వృత్తిచే, నేయర్థము తెలియఁబడుచున్నదో *85 అది వాచ్యార్థమనఁబడును.

౨ ఆవాచ్యార్థ *86 సంబంధమేదియో యది లక్షణా వృత్తియనఁబడుచున్నది. ఆలక్షణచేత నేయర్థమెఱుంగఁబడుచున్నదో యది *87 లక్ష్యార్థమనఁబడును.

ఆలక్షణ *88 జహల్ (విడిచిన) లక్షణ *89 అజహల్

---

*85 దీనికే శక్యార్థము లేక బోధ్యార్థము లేక విధేయార్థము లేక ముఖ్యార్థమని చెప్పుదురు.

*86. సంయోగము లేక తాదాత్మ్యము మొదలగు, నేవిధమైనను వేఱు అర్థముతో వాచ్యార్థమునకు గల సాక్షాత్సంబంధ మేదియో యది లక్షణయనఁబడును. ఇట యిది అభిప్రాయము:— శబ్దమునకు తన యర్థముతో గల సంబంధము శబ్ద శక్తివృత్తి యగును. శబ్దమునకు తనవాచ్యార్థమూలముగా వేఱొక (వాక్కునకు విషయము కానిదైన) అర్థముతో గల పరంపర సంబంధమేదియో యది శబ్దమునకు లక్షణావృత్తి యగును. ఆలక్షణ యెటువాచ్యార్థము పొసఁగబడదో యట యాశ్రయింపఁదగినది.

*87 వాచ్యార్థసంబంధి లక్ష్యార్థమగును.

*88 ఎచ్చట వాచ్యార్థ మంతయును విడిచి దాని సంబంధియైన వేఱు అర్థముచేకొనఁబడుచున్నదో యట జహల్లక్షణగలదు. ఎట్లు "గంగయందు గొల్లపల్లె" అను వాక్యమునందు గంగ యను పదముయొక్క వాచ్యార్థమయిన దేవనది యొక్క ప్రవాహమున గొల్లపల్లె సంభవింపనందున యిట గంగయను పద వాచ్యార్థము పూర్తిగా (దేవనది ప్రవాహమును) విడిచి దాని సంబంధియైన గట్టురూప వేఱు (అన్య) అర్థము చేకొనఁబడుచున్నది. కావున నిది జహల్లక్షణయగును.

*89 ఎచ్చటవాచ్యార్థమును విడువక దాని సంబంధియగు అన్య (అధిక)

(విడువని) లక్షణ *90 భాగత్యాగ (విడిచివిడువని) లక్షణ యను భేదములచే మూడు విధములు. వానిలో *91 మహా వాక్యమునందు భాగత్యాగమే యుపయోగము.

---

అర్థము చేకొనఁబడుచున్నదో యచ్చట అజహల్లక్షణ గలదు. ఎట్లన "ఎఱుపు పరుగిడుచున్నది" అను వాక్యమున "ఎఱుపు" అను పదముయొక్క వాచ్యార్థమయిన ఎఱుపు గుణమునకు పరుగెత్తుట సంభవింపమిచే దాని సంబంధియగు అశ్వము (గుఱ్ఱము) గుఱ్ఱమనెడు అన్యార్థము చేకొనఁబడుచున్నది. కావుననిది అజహల్లక్షణయగును.

*90 ఎచ్చట వాచ్యార్థము నుండియే విరోధిభాగమును విడిచి అవిరోధి భాగము చేకొనఁబడుచున్నదో యచ్చట భాగత్యాగ లక్షణగలదు. ఎట్లన "వాఁడే యీ దేవదత్తుఁడు" అను వాక్యమున భూతకాలమును దూరదేశమందుండు దేవదత్తుని శరీరమును "వాఁడు" "అను పదమునకు వాచ్యార్థము అగును. వర్తమానకాలమును సమీప దేశమునందుండు దేవదత్తుని శరీరమును "ఈ" అనుపదమునకు వాచ్యార్థము అగును.

సమాన బలముచేత నా రెండు వాచ్యార్థములు ఏకమును దెలుపుచున్నది. అయ్యేకము ఒకదాని కొకటి విరోధముగ రెండు పదార్థములకు సంభవింపదు. కావున దేశకాలరూప విరోధభాగమును విడిచి అవిరోధియయిన దేవదత్తుని శరీరపు ఏకత్వము నిశ్చయింపఁబడుచున్నది. కావున నిది భాగత్యాగ లక్షణ యగును.

*91 సకల వాచ్యభాగములను (జీవేశ్వరుల) విడుచుటచేత చేతనభాగము పోవుటచేత మహావాక్యమునందు జహల్లక్షణ సంభవింపదు. వాచ్యార్థమును వలె ఏకత్వమునకు విరోధముండుటచేత మహావాక్యమున అజహల్లక్షణయును సంభవింపదు. అయితే విరోధియైన వాచ్యభాగమును (ధర్మములతో మాయా అవిద్యలను) విడుచుటచే అవిరోధియైన చేతనభాగము చేకొనఁబడి ఏకత్వపు నిశ్చయము స్ఫురించుటచే మహావాక్యమునందు భాగత్యాగ లక్షణయే సంభవించుచున్నది.

## 68 తత్, త్వమ్, పదముల లక్ష్యార్థ ఐక్యము.

ఇట్లు ఘటాకాశ మహాకాశముల యందుండు ఘటమఠ రూప ఉపాధిభాగమును విడిచి మిగిలియుండు ఘటమఠసంబంధి యగు ఆకాశము ఒక్కటిగానె యున్నదో యట్లు ఈశ్వరుని యందును జీవునియందును గల మాయయును బుద్ధియు నైన ఉపాధిభాగమును విభాగించు సర్వజ్ఞత్వము మొదలగునవి యును అల్పజ్ఞత్వము మొదలగునవియునైన మాయ, అవిద్యల చేతనైన ధర్మము అను వీనితో విడచిన మిగిలియుండు బ్రహ్మము ను, ఆత్మయును, ఒక్కటియే యగును.

౧. తత్పద త్వంపదములకు, ఈశ్వరుడును, జీవుడును, నైన నిద్దఱును క్రమముగా వాచ్యులు.

౨. బ్రహ్మమును, ఆత్మయును, నైన రెండును క్రమముగా లక్ష్యములు. వానియందు భాగత్యాగ లక్షణచే *92 విరోధి యగు వాచ్యభాగమును విడిచి అవిరోధియగు లక్ష్యార్థములు రెండును ఏకమేయగును.

ఇట్లు దీపముయొక్క అగ్ని స్వల్ప ఉపాధిగలదియై యుండు టచే స్వల్పమయి, సూర్యాది అగ్నివిశేషమయి (గొప్ప ఉపాధి గలదియై) యుండుటచే గొప్పదగును. ఇట్లు వానికి ఉపాధివలన గలిగిన భేదముగలదు. అయిన మండెడు ఉష్ణమును ప్రకాశము యొక్క తనరూపము మహాతేజోధర్మములు ఏవియో యవి రెంటియందును నొకటి యగును. (సమమయినది అగును.) కావున సామాన్యరూప మహాతేజస్సు రెంటియందును నొక టియే యగును.

---

*92. ధర్మముతోగూడిన మాయ అవిద్య యను ఉపాధిరూప.

అట్లు వ్యష్టిరూప అల్పఉపాధిగల చేతనము జీవుఁడు. సమష్టిరూప గొప్ప ఉపాధి గల చేతనము ఈశ్వరుఁడు అని యిట్లు వానికి ఉపాధిచేనయిన భేదము కనఁబడుచున్నది. అయినను సత్తుచిత్తు ఆనందరూప బ్రహ్మముయొక్క ధర్మము రెంటియందును ఒక్కటియే యగును. కావున జీవుఁడును ఈశ్వరుఁడును నయిన వీరెంటియందును కలిసియున్న సామాన్య చేతనరూపఉపాధిలేని బ్రహ్మచేతనమేదియో అది జీవుఁడు ఈశ్వరుఁడు రెంటియందును అఖండమయినదగును. (ఒక్కటియే యగును.)

69. ఇప్పుడు అభేదమును ఉపదేశించియు నొకవేళ చక్కని అభేదజ్ఞానము లేనందున శిష్యునిహృదయమున తత్పదముయొక్క అర్థమందు పరోక్షతా భ్రాంతియును త్వంపదముయొక్క అర్థమునందు పరిచ్ఛిన్నతా భ్రాంతియును మిగిలియుండిన యెడల, దానిని నివర్తించు నిమిత్తము శ్రీ గురువుగారు పరస్పరమందు పరస్పరముయొక్క ఏకత్వమును చెప్పునదయిన *93. ఓతప్రోత భావమును ఉపదేశించుచున్నారు.

౧. "అది" (తత్పదముయొక్క లక్ష్యమయిన బ్రహ్మము) "నేను"

౨. "నేను" త్వంపదముయొక్క లక్ష్యఆత్మ "అది" (బ్రహ్మము) అని యిట్లు ఓతప్రోత భావముచే బ్రహ్మము ఆత్మ అనురెంటును ఏకమగును. శిష్యుఁడా! నీవు రెండని తెలియకుము. ఎవఁడు బ్రహ్మమును ఆత్మను రెండని తెలియుచున్నాఁడో! వానికి యొకగురువును చిక్కరు. వాఁడు గురువులేనివాఁడే యగును.

*93. పరస్పరమందు పరస్పరమును చేర్చుటయయిన వ్యధికరణమును ఓతప్రోత మందురు.

70. ఇప్పుడు ముందు చెప్పిన అర్థమందు ప్రమాణరూప సకలశాస్త్రముల సారమును చెప్పుచున్నారము:—

94 శ్లో॥ శ్లోకార్ధేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రంథకోటిభిః ।
బ్రహ్మసత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవ నాపరః ॥

తా॥ కోటి గ్రంథములయందు చెప్పంబడినదేదియో దానిని అర్ధశ్లోకమునందు చెప్పుచున్నాను:- బ్రహ్మము నిత్యము, జగత్తు మిథ్య జీవుఁడు బ్రహ్మమే, వేఱు లేదు.''

ఈ జగత్తుయొక్క సకల వస్తువులయందును, ౧ అస్తి (ఉన్నది) ౨. భాతి (ప్రకాశించుచున్నది) 3. ప్రియము. ౪. నామము (పేరు) ౫. రూపము (ఆకారము) అను నీ యైదంశములున్నవి. వానిలో మొదటి మూడును బ్రహ్మరూపము. వెనుకటి రెండును మాయారూపకములు, వానియందు:-

౧-3 అస్తి, భాతి, ప్రియరూప బ్రహ్మ మేదియో యది అన్నికాలములయందన్నిటియందు సమానముగా అనుస్యూతముగా (కలిసి) యున్నది. కావున అవ్యభిచారి యగును. అందుచేనది సత్యము.

౪-౫ నామరూప మయమయిన మాయికజగము నొకవేళ నొక్కచోటుల యందుండునది గావున వ్యభిచారియగును. ఇందుచేనది మిథ్యయగును.

మిథ్యయయిన జగత్తుయొక్క లోపల యణఁగినది యయిన శుద్ధచేతనమందు ఈశత్వజీవత్వముల ఉపాధిరూప దేహాదులు ఏదియో యవియును స్వప్నమందలి ఏనుగు మొదలగునవలె లేనివియై వ్యక్తమగుచున్నవి. కావున మిథ్యయగును.

94* కోటిగ్రంథముల సారమును అర్ధశ్లోకమున చెప్పుచున్నాను.

ఇందువలన నా యుపాధులచే చేయఁబడిన ఈశజీవభావములున్ను మిథ్యయగుచున్నది.

కావున జీవుడు ఏదియో యది బ్రహ్మము అనునది సర్వ శాస్త్రముల నిశ్చయమైన సారమగును. దానిని చక్కఁగా ధారణచేయుము.

ఇట యిది తాత్పర్యము:- నాల్గు ఉపవేదములును ఆఱు వేదాంగములును పురాణములు, న్యాయము, మీమాంస ధర్మశాస్త్రమును నాల్గువేదముల ఉపాంగములునైన వాని నన్నటికిని వేదార్థములయందే తాత్పర్యముగలదు. నాల్గు వేదముల కర్మ ఉపాసనా కాండములకు చిత్తశుద్ధి మూలమున అద్వైతజ్ఞానమునందు తాత్పర్యమగును. జ్ఞానకాండమగు వేదాంతమునకును దాని యనుసారియగు తక్కిన బ్రహ్మసూత్రము, గీత, మొదలగు సంస్కృత ప్రాకృత గ్రంథములకును సాక్షాత్తు అద్వైత జ్ఞానమునందే తాత్పర్యముగలదు. కావున ముందుజెప్పిన అర్థము సర్వగ్రంథముల సారమగును.

71. శ్లో॥ సత్యవ్రతం సత్యపరం త్రిసత్యం
సత్యస్య యోనిం నిహితం చ సత్యే।
సత్యస్య సత్యం ఋతసత్య నేత్రం
సత్యాత్మకం త్వాం శరణం ప్రపన్నాః ॥

దేనికి వ్రతము (మాయయొక్క వృత్తిరూపసంకల్పము) సత్యముగానున్నదో, దేనియందు పరమశ్రేష్ఠప్రాప్తి సాధనముగా సత్యముగా నున్నదో, సృష్టికి పూర్వమును ప్రళయము నకు వెనుకయును స్థితికాలమందును, నీమూఁడు కాలములయందును, ఏది సత్యముగా (వ్యభిచారము లేకయుండునదిగా) యున్నదో, ఏది సత్య (పంచభూతముల) యోని యో (వివర్తోపాదాన

నున్నదో, దేనికిమూలము మూఁడు (గుణ) రూపమో, దేని రసము (ధర్మార్థకామమోక్షమను) నాల్గు (పురుషార్థ) రూప ముగానున్నదో దేని (జ్ఞానము) ఐదు (ఇంద్రియములు) గా నున్నవో, దేని స్వభావము (జన్మమొదలగు) ఆఱు (వికార రూప) అలుగానున్నవో దేనికట్టు సప్త ధాతురూపమో దేని శాఖలు ఎనిమిది (పంచభూతములు మనసు బుద్ధి యహంకార మను అపర ప్రకృతి)లో దేనితొఱ్ఱలు తొమ్మిది (ద్వారములో దేని ఆకులు (ప్రాణాదినాగాది) దశవాయువులో దేనియందు పక్షులు రెండు జీవేశ్వరరూపములో దేని జన్మకారణము పత్య క్షబ్రహ్మమో దేనిలయస్థానమును పాలనముచేయుటయును సత్త్వగుణో (బ్రహ్మమో) ఆది యీ ప్రసిద్ధమయిన సమష్టి వ్యష్టి ప్రపంచరూప ఆది వృక్షముగును."

౧. ఇట్లు శ్రీ భాగవతము నందుచెప్పిన స్థలమందే దీనిని వృక్షరూపముగాఁ జెప్పియుండుటవలన వృక్షమువలెనే దీని వినాశరూపత్వమున్ను చెప్పఁబడియున్నది. అదియేమిథ్యాత్వ లింగమగును. దానిని (మిథ్యాత్వమును) ఇప్పుడు వ్రాయుచ్చు చున్నారు.

ఎట్లు ఇంద్రజాలరూపమాయచే జేయఁబడిన వృక్షము మూఁడుకాలములందును మిథ్యగానేయున్నదో, యట్లు మా యా శక్తిచేఁజేయబడిన సకలజగత్తు సమూహరూపవృక్షమును మూఁడుకాలములందును మిథ్యయని యెఱుఁగుము.

ఈ జగత్తు (మిథ్యాత్వరూప) అర్థమందే

౨. స్వప్నము గంధర్వనగరము అద్దమందు నగర ప్రతి బింబము మొదలగు మఱియునేక దృష్టాంతరూప ఉపమాన ప్రమాణములుగలవు

"శ్లో॥ దృష్టశ్రుతమసద్బుద్ధ్వా నానుధ్యాయేన్న సంవిశేత్।
సంసృతి త్వాత్మనాశంచ తత్రవిద్వాన్ స ఆత్మదృక్"

దృష్టమయిన ఈలోకముతో శ్రుతమైన స్వర్గాదిలోకములను అసత్తని యెఱింగి దానిని ధ్యానింపను దగదు, అనుభవింపను గూడదు. అదృష్టశ్రుతముల ధ్యాన మొదలగు వానియందు సంసారమును తననాశనమును నెవఁడెఱుఁగు చున్నాఁడో వాఁడాత్మజ్ఞాని యగును." అనునీమొదలగు శ్రీభాగవత వాక్యమున్ను సప్త ప్రమాణములగును. జగత్తు మిథ్యయనుటకున్ను ప్రమాణములు గలవు.

73. పదార్థ శోధన ఐక్యమగు సర్వాత్మత్వము.

ఇప్పుడు జీవ బ్రహ్మల ఏకత్వ దృఢత్వము కొఱకుదానియందు ప్రమాణరూప శాస్త్రవాక్యముల అర్థమును క్రమముగా త్వంపదార్థ శోధన తత్పదార్థశోధన వాక్యార్థసర్వాత్మత్వము పూర్వకముగా శ్రీగురువుగారు చెప్పుచున్నారు.—

మనస్సు మొదలగువాని ద్రష్టగా నుండుటంబట్టి బ్రహ్మము మనస్సు చక్షువు మొదలగు ఇంద్రియములను వానికి వేఱుగా నున్నది. ఏది దేనికి ద్రష్టగా నుంటున్నదో యది దాని భిన్నమగుచున్నది ఎట్లుఘటముయొక్క ద్రష్ట ఘటమునకంటె వేఱుగానుండునో యట్లు మనస్సు ఇంద్రియముల ద్రష్టయగు ఆత్మరూప బ్రహ్మము మనస్సు మొదలగువానికి వేఱగును. లేక "నామనస్సు నానేత్రము" అను మొదలగు అనుభవములచేతను మఱితకు విషయమగు నామనస్సు మొదలగు వానిచేత అహంప్రత్యయమునకు విషయమయిన ఆత్మరూప బ్రహ్మము భిన్నముగా (సత్తయొక్క భేదముగలదిగా) సిద్ధించుచున్నది

ఆత్మకు అభిన్నమయిన బ్రహ్మము మనస్సు మొదలగు వాటికిని మనస్సు మొదలగునవి యగును. ఏలయన

"శ్లో॥ శ్రోత్రస్యశ్రోత్రం మనసో మనోయద్వాచో౽హం వాచ
స ఉ ప్రాణస్య। ప్రాణశ్చక్షుషశ్చక్షురతిముచ్య ధీరాః
ప్రేత్యాస్మాల్లోకాదమృతా భవంతి।

కల్పిత సర్పముయొక్క స్వరూపమైన రజ్జువలె శ్రోత్ర మొదలగువాని స్వరూపమున్ను సమర్థరూపముగా నున్నందున ఏబ్రహ్మము శ్రోత్రమునకు శ్రోత్రముగాను మనస్సునకు మనస్సుగాను వాక్కునకు వాక్కుగను నున్నదో యదియే ప్రాణమునకు ప్రాణముగను చక్షువునకు చక్షువును నగును. వీనిచే ఉపలక్షింపఁబడినదియు చెప్పఁబడనిదియు నైన తక్కిన ఇంద్రియములకును ఇంద్రియము లగును. (సత్తను నిచ్చునది యును ప్రకాశమును జేయునదియు నగును) అని తెలిసి ధీర పురుషుఁడు శ్రోత్ర మొదలగు వానియందు ఆత్మ భావమును విడిచిపెట్టి ఈ [నేను నాదియను తనరూప లేక దేహరూప] లోకమునుండి వేరై అమృతుడు (మరణ రహితుఁడు) అగుచున్నాఁడు అను శ్రుతిచే ఆత్మరూప బ్రహ్మము వాస్తవముగా మనస్సు మొదలగువాని స్వరూపమే యగును.

బ్రహ్మము మనస్సు మొదలగు వానిచే నెఱుఁగబడని దగును. ఏలయన

"శ్లో॥ నతత్రచక్షుర్గచ్ఛతి న వాగ్గచ్ఛతి నోమనో।
న విద్మోన విజానీమో యథైతదను శిష్యా-
దన్యదేవతద్విదితా దథో అవిదితాదధి।
ఇతిశుశ్రుమపూర్వేషాం యే న స్త ద్వ్యాచచక్షిరే।

అటచక్షువు(దీనిచే ఉపలక్షింపబడిన సర్వజ్ఞానేంద్రియ

చుటకైనను సాధ్యపడనిదై యుండుటచేత ప్రత్యక్షము మొదలగు ప్రమాణములకు అగోచరమైనను బ్రహ్మము *97 వృత్తివ్యాప్తి వల్ల నెఱుఁగఁబడుచున్నది.

శాస్త్రముచేతను గురువుచేతను లక్షణావృత్తిచేత ఉపదేశింపఁబడుచున్నది. కావున శ్రుతి చెప్పినదేమనః— అది, విదితముకంటెను (జ్ఞానపు విషయమయిన వ్యాకృతరూప కార్యమునకంటెను) అన్యమేయగును; అవిదితముకంటెను (ఎఱుఁగఁబడని వానికంటెను వేఱయిన అవ్యాకృతరూప కారణముకంటెను.) అన్యమగును. అని ఇట్లు మేము పూర్వాచార్యుల వచనము వినియున్నాము. వారుమాకు బ్రహ్మమును స్పష్టముగా చెప్పిరి." అను శ్రుతిచేతను ఈయర్థము నే యనుసరించిన.

శ్లో॥ నైతన్మనో విశతి వాగుత చక్షురాత్మా ప్రాణేంద్రియాణి చ
యథానలమర్చిషః స్వాః। శబ్దోఽపి బోధకనిషేధతయాత్మ
మూల మర్థోక్త మాహ యదృతే న నిషేధసిద్ధిః॥

ఈ బ్రహ్మమునందు మనస్సు, వాక్కు, చక్షు, అహంకారము. అనునవి ప్రవేశించుటలేదు ప్రాణమును (చెప్పఁబడని శక్తిగల) ఇంద్రియములును ప్రవేశించుటలేదు. ఎట్లు అగ్నియందు

---

గలవై యుండినచో నదియనస్సుచే (చిదాభాసునితో గూడినవృత్తిచే) నెఱుఁగఁబడును. వాక్కు (శబ్దశక్తివృత్తి) చేతను నెఱుఁగఁబడును. బ్రహ్మము జాతి మొదలగునవి లేనిదై యుండుటవల్ల మనస్సునకును (ఫలవ్యాప్తికిని) వాక్కునకును (శక్తివృత్తికిని) విషయమగుటకు దగనిదగును.

*97. సూర్యునికి ఎదురు ముఖముగా నుంచఁబడిన దీపము ప్రకాశము తగ్గగా నేత్రముచే సూర్యుని ప్రకాశము కలుగునదివలె బ్రహ్మాకార వృత్తియందుగల చిదాభాసుడు ప్రకాశము తగ్గగా ఆ వృత్తిమాత్రముచే బ్రహ్మము యొక్క ప్రకాశము (ఆవరణభంగము) కలుగుచున్నది.

దానిజ్వాల ప్రవేశించుట (దాహముచేయుట) లేదో, అట్లే అవియు ప్రవేశించుటలేదు. శబ్ద (వేదమున్ను) "దేనినుండి వాక్కులు నివర్తించుచున్నవో" యని భోధించు తన్ను నిషేధించునదిగానుండుటచే, అర్థముచే ముందుచెప్పిన తనమూలము ను (బ్రహ్మమును) జెప్పుచున్నది. అదిలేక నిషేధసిద్ధికలుగనేరదు (అధిష్ఠానరూప అవధిలేక బాధరూప నిషేధములేని) అను శ్రీ భాగవత ఏకాదశ స్కంధము మూడవఅధ్యాయ వచనముచే బ్రహ్మము మనస్సు మొదలగు వానిచేతను నెఱుఁగఁబడనిదగును.

ఆ యనాది (జన్మములేని దీనిచేతనే మద్వికారము లేని) బ్రహ్మము (నిరతిశయవ్యాపక సచ్చిదానంద ఘనవస్తువు) నీవగుదువని గురువుగారు చెప్పుచున్నారు:— శిష్యుఁడా! నీవున్నావని ఇది ముందుచెప్పిన త్వంపదార్థశోధన దృఢత్వముకొఱకు అనువాదముచేయఁబడినది.

ఇప్పుడు గురువుగారు ప్రపంచ నిషేధ పూర్వకముగా తత్పదార్థముయొక్క శోధనమును వ్రాయుచున్నారు. "ఈ జగత్తంతయు సత్తురూపమే యగును. సద్ధీదం సర్వం సదసత్"

ఈసత్తు అసత్తు (కార్యకారణరూపము) అంతయు సత్తే (పరమార్థ సద్రూపబ్రహ్మమే) యగును. అను శ్రుతియు కల్పితమునకు అధిష్ఠానమునకంటె వేఱయిన సత్తలేని దానిని నిశ్చయించు యుక్తియు నుండుటచే.

ఇవంతయు చిద్రూపమే యగును. "చిద్ధీదం సర్వంప్రకాశతే, ఇవంతయు చిత్తు (బ్రహ్మచేతన) రూపముగా ప్రకాశించుచున్నది." అను శ్రుతియును కల్పితమునకు అధిష్ఠానముయొక్క భిన్నమయిన స్ఫూర్తి (వివరించుట) లేని దానినిశ్చయించుయుక్తియు నుండుటచే.

అంతయు బ్రహ్మమే; "సర్వంఖల్విదంబ్రహ్మ" ఈ కనం బడు జగత్తంతయు నిశ్చయముగా బ్రహ్మమేయగును అను శ్రుతి యుండుటచే, అంతయు ఆత్మయేయగును; ఆత్మైవేదంసర్వం= ఇదంతయు ఆత్మరూపమే యగును. అను శ్రుతియుండుట చేతను.

ఈ మొదలగువానిచే "పురుషుఁడు స్థాణువు" అను వాక్యమునందు ఎట్లుపురుషుని బాధించిస్థాణువును మిగిలించుటయగు "బాధసామానాధికరణ్యము (పురుషుఁడు, స్థాణువుఅను రెండు పదములకు నొకఅర్థము కలిగియుండుట) ఉన్నదో, అట్లేసకల ప్రపంచమును బాధసామానాధికరణ్యము" చే అధిష్ఠాన బ్రహ్మరూపమని యెఱిఁగి జిజ్ఞాసువులారా! సమష్టివ్యష్టిరూప దేహమును దానిగర్వ (అహంకారమమకార హితకారరూప అభిమాన) మునువిడు (మిథ్యయని యెఱిఁగి) వుఁడు; ఇది (నామరూపమును బాధించి అస్తి భాతి ప్రియరూప బ్రహ్మమును మిగులఁజేయుట) విధిముఖశ్రుతుల అర్థమగును. అది, కనిష్ఠ, మధ్య, అధికారులకు తత్పదార్థ శోధనమందు ఉపయోగము గలదగును. లక్షణ మొదలగు క్లేశముల అంగీకారము వలన,

స్థూల సూక్ష్మ. దీర్ఘ. హ్రస్వ, అను రూపముగలది బ్రహ్మముకాదు.

"అస్థూలమనణు మహ్రస్వ మదీర్ఘం, స్థూలములేనిదియు, అణువుకానిదియును, పొడవులేనిదియు, పొట్టిలేనిదియునైయుండుదానిని" అనుట మొదలగు శ్రుతులచేతను,

శబ్ద మొదలగు వానివిలక్షణము బ్రహ్మమగును.

"అశబ్ద మస్పర్శమరూపమవ్యయం తథాఽరసం నిత్యమగంధవచ్చయత్। శబ్దములేనిదియు, స్పర్శములేనిదియు, రూపము లేనిదియు, తక్కువనిండుట లేనిదియు, రసము లేనిదియు,

నిత్యమును గంధము గలిగియుండుట లేనిదియునై యేదియు న్నదో" అను శ్రుతిచేతను

సత్తును (స్థూల కార్యమును) అసత్తును (సూక్ష్మకారణమును) కాదు. వలయున "నేతినేతి ఇట్లుకాదు ఇట్లుకాదు" అను శ్రుతియున్నది.

"అనాది మత్పరంబ్రహ్మ నసత్తన్నాసదుచ్యతే = అనాదిగానుండు పరబ్రహ్మము, సత్తును (కార్యమును) అసత్తును (కారణమును) కానేరదనఁ బడుచున్నది" అను గీతాస్మృతియు నుండుట వలనను.

ఇందు (అనేకముకాని బ్రహ్మమందు) నానాయనుట కొంచమైనను లేదు

"నేహనానాస్తి కించన = ఇందు నానాఅనునది కొంచమైనను లేదు" అను శ్రుతియుండుటచేతను.

జిజ్ఞాసువులారా! ఇట్లు తెలిసి నిజస్వరూపమందు మఱించి యుండుడుగాక! ఇది (నామరూప మొదలగు ప్రపంచమును నిషేధించి, అర్థముచే అస్తిభాతి, ప్రియరూప బ్రహ్మమును సత్యమని యెఱిఁగి మిగిలించుట) నిషేధముఖ శ్రుతులకు అర్థమగును. ఇది లక్షణ మొదలగు క్లేశము లేనిదగుటచే ఉత్తమాధికారికి తత్పదార్థచేతనమందు ఉపయోగి యగును

దీనియందిది దృష్టాంతము:—

ఒకని ఆవులు ఎనుములు మొదలగు ధనమును దొంగ దోచుకొనిపోయెను. అప్పుడు వాఁడు భైరవ దేవునియొకట "ఈ ధనమును సొంతగానికి చేరక యుండిన నేను వీనియందీఎనుములను నీకర్పించుచున్నా"నని ప్రతిజ్ఞచేయుచున్నాఁడు. పిమ్మట సొంతగాఁడు వెదుక నారంభించి వాఁడును భైరవదేవుకు యొకట

అధనము నాకు దొరకిన పీనియందీ ఎనుమును నీకర్పణముచేసె ద''నని ప్రతిజ్ఞచేయుచున్నాఁడు రెండు పక్షములందును ఆనొమకే యెనుముయొక్క మరణము సశ్చయింపఁబడినది.

దార్ష్టాంతము:— అట్లే యిట (వేదమునందు) విధిముఖ ము ను నిషేధముఖములునయిన శ్రుతులకు జ్ఞానరూప భైరవుని కొఱకు నాకు రూపమొదలగు ప్రపంచ స్వరూప ఎనుమును అర్పణముచేసి (బాధించి) దాని అధిష్ఠానమయిన అస్తి (సత్తు) భాతి (చిత్తు) ప్రియ (అనంద) రూపబ్రహ్మమును సత్యమని మెఱిఁగి మిగిలించుటయే తాత్పర్యముగు అర్థమని నిశ్చయింపబడు చున్నది. లేనిచో (ముఖ్యార్థము కానిచో) శ్రుతిసూత్రములచేతను విద్వాంసుల యనుభవముచేతను బొందెడు ద్రష్ట మొదలగు రూపములయొక్కయు భావరూపముయొక్కయు నయిన బ్రహ్మ మునకు దృశ్యాదిభావమును అభావమునుగలుగును. ఇది తత్ప ర్యార్థముచే తనద్భృథత్వముకొఱకు అనువాదము చేయఁబడినది.

ఇప్పుడు గురువుగారు నాల్గువేదములందు గల మహా వాక్యముల అర్థమును సంగ్రహించి చెప్పుచున్నారు:—

౧. "ప్రజ్ఞానం బ్రహ్మ" అను ఋగ్వేదముయొక్క ఐతరే యుపనిషత్తునందుండు మహావాక్యమునకు అర్థము "ప్రజ్ఞానము (ప్రత్యక్చైతన్య) మేదియో అది "బ్రహ్మమను నగును. (ప్రత్యక్ = లోపల)

౨. "అహం బ్రహ్మాఽస్మి" అను యజుర్వేద బృహదారణ్యకోపనిషత్తునందుండు మహావాక్య అర్థము "నేను (ప్రత్యగాత్మ) బ్రహ్మము" అనునదగును.

3. "తత్త్వమసి" అను సామవేద ఛాందోగ్యోపనిషత్తు నందుండుమహావాక్యమునకు అర్థము "అది (బ్రహ్మము) నీవు

(ఆత్మా)" అను నదగును.

४. "అయం ఆత్మాబ్రహ్మ" అను అథర్వ వేదమందలి మాండూక్యో పనిషత్తునందుండు మహావాక్యమునకు అర్థము "జ్ఞానమునకు విషయము కాక నిత్యాపరోక్షముగానున్న) ఆత్మ(బ్రహ్మము (అన్నిటికంటె నెక్కువ వ్యాపకమయిన సచ్చి దానందఘనము)" అను నదగును.

కావున బ్రహ్మమునకు వేఱుగా నేను లేనని యెఱుంగు ము. ఈనాల్గు మహావాక్యముల యందుండు "ప్రజ్ఞానం, అహం, త్వం, ఆత్మా, అను పదములకు వాచ్యార్థము జీవుఁడును, లక్ష్యార్థము కూటస్థరూప సాక్షియునగును. బ్రహ్మ, బ్రహ్మము, తత్, బ్రహ్మము, అను నాల్గు పదములకును వాచ్యార్థము ఈశ్వరుఁడును (*98. శబళబ్రహ్మము) లక్ష్యార్థము శుద్ధ బ్రహ్మమును నగును. వానియందుండు వాచ్యార్థమునకు ఐక్యము సంభవింపమిచేనిట లక్ష్యార్థములకు ఐక్యము చేకొనఁబడియున్నది. నాల్గు మహావాక్యముల అర్థము శ్రీపంచదశి ఐదవ మహావాక్య వివేకమందు విస్తారముగా వర్ణింపఁబడియున్నది. ఇప్పుడు,

శ్లో॥ అహమేవ చ సర్వేషు, భూతేషు చ నభోయథా।
మయిసర్వాణి భూతాని, జానన్నితి న జాయతే॥

అను ఉపదేశసాహస్రియగు గ్రంథమునగల భాష్య కారులవచనానుసారముగ సర్వాత్మత్వమును చెప్పుచున్నాఁడు చిదాత్మయగు నేనే ఆకాశమువలె సకల భూతములందును కలిసియున్నాను. (ఆకాశమందు వాయువు మొదలగువాని

*98. శబళబ్రహ్మము = మాయతోఁగూడిన బ్రహ్మము.

వలె) నాయందన్నియు అధ్యస్తముగానున్నవి యని యెఱుఁగు వానికి జన్మములేదు

ఈ యర్థమందు ప్రమాణము:—

శ్లో॥ సర్వభూతేషుచాత్మానం సర్వభూతానిచాత్మని ।
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్రసమదర్శనః ॥

యోగముతోఁ గూడిన మనస్సుగలవాఁడును, అన్నిచోట్లను సమదర్శనముగలవాఁడును నెవఁడో వాఁడు సర్వభూతములందును ఆత్మను ఆత్మయొద్ద సర్వభూతములను జూచుచున్నాడు. అను గీతావచనమున్న,

శ్లో॥ సర్వభూతేషు యః పశ్యేద్భగవద్భావమాత్మనః ।
భూతాని భగవత్యాత్మన్యేష భాగవతోత్తమః ॥

ఎవఁడు సర్వభూతములందును ఆత్మయొక్క భగవద్భావమును జూచుచున్నాఁడో భగవద్రూపత్వమందలి భూతములను గనుచున్నాఁడో వాడు భాగవతు (భక్తు) లందుత్తమ (జ్ఞానియందు భక్తు)డగును. అను భాగవత ఏకాదశస్కంధమునందలి రెండవ యధ్యాయముయొక్క వచనమున్నది. ఇట్లు ఓతప్రోత భావరూప సర్వాత్మత్వము చెప్పబడియున్నది.

77. ఇప్పుడు ప్రమేయమునందుండు సంశయముయొక్క నివృత్తికొఱకు వేదాంతమున అవశ్యముగా నెఱుఁగదగిన ప్రమేయము (పదార్థము)లను శిష్యుఁడు ప్రశ్నించుచున్నాఁడు.

స్వామీ! (ఈ గ్రంథమున) చెప్పఁబడినవియును, జెప్పబడనివియును, నయిన పదార్థములనుచేర్చి చెప్పునదగు సంగ్రహమును జెప్పవలయును. దానివలన నాకు ప్రమేయమునందుండు సంశయము తీరును. ప్రమాణగత సంశయమో ఈశ్వరరూపముగ మతింపఁబడిన తమయొక్క వేదమునకు సమమయిన

వచనములను పూర్ణ విశ్వాసముతో వినుటచేతను, నాకు (ఉత్తమాధికారికి) నష్టమగును. దీనిచేతనే నాకు నిజస్వరూపము నిశ్చయింపబడినదగును: [ఇది శిష్యుని లక్షణావళి (లక్షణముల వరుసను) ఎఱుఁగు నిమిత్తము ప్రశ్నించినదగును.]

(శ్రీ) గురువుగారు చెప్పుచున్నారు.

లక్షణావళి ఈ క్రిందుగలవి:—

౧. అసాధారణ ధర్మములను లక్షణమందురు. ఒకటియందుండునదయిన ధర్మమును అసాధారణ ధర్మమందురు.

౨. అవ్యాప్తి అతివ్యాప్తి అసంభవమను మూఁడు దోషములును లేని లక్షణమును సల్లక్షణమందురు. (మంచి లక్షణమందురు.)

3. పై జెప్పిన మూఁడు దోషములందు నేదేనియొక దోషముతో గూడిన లక్షణము అసల్లక్షణ (చెడు లక్షణ మందురు.

౪. ఎప్పుడు నుండునదయి యేది వ్యావర్తకము (వేఱు చేసి తెలిపించునదై) అగుచున్నదో దానిని స్వరూపలక్షణ మందురు.

౫. ఒక కాలమునందుండునదై వ్యావర్తకము చేయునదేదియో దానిని తటస్థలక్షణమందురు. దీనినే ఉపలక్షణమనియు చెప్పుదురు.

౧. లక్ష్యముయొక్క ఏకదేశమందు లక్షణముండుటను అవ్యాప్తియందురు.

ఎట్లు కపిలత్వము (ఒకే పింగలవర్ణముతోఁగూడి యుండుట) ఆవుయొక్క లక్షణమగును. ఆ కపిలత్వము ఆవురూప లక్ష్యముయొక్క ఏకదేశమందేయున్నది. ఆవుమాత్రమందు

లేదు. కావున ఈ లక్షణము అవ్యాప్తిరూప దోషముఁగూడిన దగును.

౨. లక్ష్యమందు పూర్తిగవ్యాపించి లక్ష్యము కానిదాని యందును లక్షణముండుటను అతి వ్యాప్తియందురు

ఎట్లు:— "కొమ్ము కలిగియుండుట" ఆవు లక్షణమగును. అదిలక్ష్యమగు ఆవు సంతతియందు నుండి లక్ష్యము గానిమెనుము మొదలగువానియందు నున్నది. కావునసీయావు లక్షణము అతివ్యాప్తి రూపదోషముతోఁ గూడినదగును.

3. లక్ష్యమును విడిచి అలక్ష్యమందే లక్షణముండుట అసంభవమందురు.

ఎట్లు "ఒంటి గిట్టగలది ఆవు" అనునది ఆవు లక్షణమగును అదిలక్ష్యమగు ఆవును విడిచి లక్ష్యము గానిగుఱ్ఱము నందున్నది కావున ఈలక్షణము అసంభవ దోషముతోఁగూడిన దగును.

౧ వస్తువునందు అవస్తువును (వస్తువు కాని దానిని చెప్పుట అధ్యారోపమందురు.

అధిష్ఠాన శేషమును అపవాద మందురు.

శుద్ధ బ్రహ్మమును వస్తువందురు.

౨. అజ్ఞానమును దానికార్యమగు స్థూలసూక్ష్మ మొదలగ ప్రపంచమును అవస్తువందురు.

౧. ఆవరణ విక్షేపశక్తులు గల అనాదిభావ రూపమున అజ్ఞానమందురు. అదియేమాయ, అవిద్య, ప్రకృతి, ప్రధానము శక్తి, అవ్యక్తము, అక్షరము, మొదలగు పేర్లచేతఁ జెప్ప బడుచున్నది.

౨. అస్తి, భాతి, (ఉన్నది ప్రకాశించు చున్నది) అః

వ్యవహారమునకు (చెప్పుటకనంబడుటకు) యోగ్యమగు వస్తువు లందు నాస్తి, నభాతి, (లేదు కాన్పించుట లేదు) అనువిపరీత వ్యవహారమును సంపాదించుట ఆవరణమగును.

౧. నాస్తి (లేదు) అను వ్యవహారమునహేతువు అసత్వా పాదక (అసత్తును సపాదించు) ఆవరణమగును.

౨. నభాతి (కనంబడదు) అనువ్యవహారమునకు హేతువు అభానా పాదక (కనంబడదని) సంపాదించు ఆవరణమగును.

3. స్థూలసూక్ష్మ మొదలగు ప్రపంచమును దానిజ్ఞానమును విక్షేపమందురు.

౧. ఆవరణమునకు హేతువగుశక్తిని ఆవరణశక్తియందురు.

౨. విక్షేపమునకు హేతువగుశక్తిని విక్షేపశక్తియందురు

౧. శుద్ధచేతనమును మూసిపుచ్చు అజ్ఞానమును మూలాజ్ఞానమందురు.

౨. రజ్జుమొదలగు ఉపహిత చేతనమును మూసిపుచ్చు అజ్ఞానమును తూలాజ్ఞానమందురు. దీనినే అవస్థాజ్ఞానమనియు చెప్పుదురు.

౧. భ్రాంతి జ్ఞానమును దాని విషయమును కార్యజ్ఞానమందురు.

౨. భ్రాంతికిహేతువగు అజ్ఞానమును కారణాజ్ఞానమందురు.

౧. అధ్యాసమును భ్రాంతియందురు. అధిష్ఠాన విషమ (విపరీతమయిన) సత్తగల అవభాసమును లేక తన అభావాధికరణ(ఆశ్రయ) మందు అవభాసమును అధ్యాసయందురు జ్ఞానమునుదాని విషయమును అవభాసమందురు.

౧. భ్రాంతిజ్ఞానమును జ్ఞానాధ్యాసమందురు.ఒకటియందు వేఱొకదాని జ్ఞానమును భ్రాంతిజ్ఞానమందురు· అదియే విపర్య

యమును విపరీత భావనయును నగును.

౨. భ్రాంతిజ్ఞానము యొక్క విషయమును అధ్యాస మందురు. [అది ౧ సంసర్గాధ్యాసము ౨. స్వరూపాధ్యాసము అను భేదములచే రెండు విధములు]

౧. కల్పితతాదాత్మ్య సంబంధమును సంసర్గాధ్యాసమందురు. అదియే సంబంధాధ్యాసమును నగును [[illegible] సత్యాత్మయొక్క అనాత్మ యందుంచును.

౨. సంబంధి యొక్క అధ్యాసమును స్వరూపాధ్యాస మందురు. అదియే అన్యతరాధ్యాస మనియు [illegible]. [ఈవిధముగా మిథ్యయగు అనాత్మయొక్క అత్మయందు [illegible]

౧. కల్పిత భేదముతో వాస్తవ అభేదమును [illegible] తాదాత్మ్య సంబంధ మందురు.

౨ పరస్పరముసందు పరస్పరము యొక్క అధ్యాసమును అన్యోన్యాధ్యాసమందురు.

[ఈవిధముగా ఆత్మానాత్మలకు ఎక్కడను [illegible] అధ్యాసముండును.]

౧. వేనియందు బ్రహ్మజ్ఞానము లేక బాధ (మిథ్యాత్వ నిశ్చయము) కలుగుటలేదో బ్రహ్మజ్ఞానమునకు పిమ్మట [illegible] అధిష్ఠానమునకంటె వేఱయిన సత్తాస్ఫూర్తి [illegible] లేకో ఆవిధమాయయును దానికార్యమును వ్యావహారికమందురు. వాని సత్తను వ్యావహారికసత్తయందురు

౨ ఎవనికి బ్రహ్మజ్ఞానము లేకరజ్జుమొదలగు వాని జ్ఞానము చేతనే బాధకలుగు చున్నదో ఆవిధ స్థూలాజ్ఞానమును వాని కార్యమగు రజ్జుసర్పమొదలగునవియు ప్రాతిభాసిక మందురు. వానిసత్తను ప్రాతిభాసిక సత్తయందురు.

3. దేనికి మూఁడుకాలములందును బాధకలుగుట లేదో ఆవిధ ఉత్పత్తి నాశము లేనిదై యుండుటచేనిత్య (సత్య) మగున చేతనమేదియో యది పారమార్థిక మగును. దాని సత్తను (ఉండుటను) పారమార్థిక సత్తయందురు.

[ఇట మంత్రి మొదలగు వారియొద్ద ఎట్లురాజుయొక్క సత్తయో అనుస్యూతమయియున్నదో వారికి స్వతంత్ర సత్తలేశ మయినను లేకయున్నదో యట్లు వ్యావహారిక ప్రాతిభాసిక పదార్థములందును ఒక చేతన సత్తయేఅనుస్యూతమయి "ఘట మున్నది పటమున్నది" యని యున్నదను వ్యవహారమునకు హేతువయి కనఁబడుచున్నది. దానికి స్వతంత్రసత్తయో లేశ మాత్రమునులేదు. దీనియందు నాట్యశాలాదీపము దృష్టాంతము చెప్పఁబడియున్నది ]

౧. వ్యావృత్తిని అవచ్ఛేదమందురు- ఇతరమయిన వాని నుండి వేఱుచేసి తెలిపించుటను వ్యావృత్తియందురు.

౨. అవచ్ఛేదముగలదానిని అవచ్ఛిన్నమందురు. దీనినే అవచ్ఛేద్యము వ్యావృత్తము వ్యావృత్తి వ్యావర్తనీయము అనియు చెప్పుదురు.

౩. వేఱుపఱచి తెలిపించుదానిని వ్యావర్తకమందురు. దానినే అవచ్ఛేదకమనియు చెప్పుదురు. [ ఈవిధమగునవి విశేషణము. ఉపాధి ఉపలక్షణము, ఉపరంజక, మనునవి యగును.]

౧. కార్యమందు సంబంధముగల వర్తమాన వ్యావర్తకమును విశేషణమందురు.

[ఎట్లు "జలముచేత నిండింపఁబడినఘటము" జలాకాశముయొక్క పోకడ మొదలగు కార్యములయందు సంబంధియై

మను జనులయొక్క ప్రవృత్తియగు కార్యమునందు సంబంధము లేనిదై (ముందు జెప్పిన ఘటమున్నను, లేకున్నను ముందు జెప్పిన కార్యముండుటవలన) తక్కిన (ఘటాకాశ మొదలగు) ఆకాశములనుండి దానిని (మహాకాశమును) వేఱుపఱచి తెలిపించునదియగును. దీనిచేతనే దానియందది ఒకచోటను నొకకాలమందును నున్నది. కావున దాని (మహాకాశము) యొక్క ఉపలక్షణమగును.

ఎట్లు:- "అంతఃకరణము" అంతఃకరణ అనవచ్ఛిన్న చేతనము ఈశ్వరసాక్షి (శుద్ధబ్రహ్మ)యగునను జనుల ప్రవృత్తి రూపకార్యమందు సంబంధము లేనిదై (జీవన్ముక్తియందు అంతఃకరణమున్నను లేక విదేహముక్తియందు అది లేకయున్నను, చెప్పఁబడిన వ్యవహారముండుటచే) తక్కిన (జీవుడు మొదలగు) చేతనములనుండి దానిని వేఱుపఱచి తెలిపించునదియగును. దీనిచేతనే యది దానియందు కొన్నిచోట్లయందును, కొన్ని కాలములయందును నున్నది. కావున దానికి (ఈశ్వరసాక్షికి) అది (అంతఃకరణము) ఉపలక్షణమగును.

౮. స్వభావముగా పొందబడిన ధర్మరూప వ్యావర్తకమును ఉపరంజకమందురు. దానినే స్వరూపలక్షణమనియుఁ జెప్పుదురు.

ఎట్లు:- ఆకాశనిరవయవత్వము విభు (వ్యాపక)త్వము ఛేదింపఁబడమి మొదలగు ధర్మము లేవియో యవి దానికి స్వభావముగ సిద్ధించిన వ్యావర్తకధర్మములగును. కావున ఉపరంజకమగును.

ఎట్లు:- బ్రహ్మముయొక్క సత్యత్వము జ్ఞానము ఆనంత్వము మొదలగు ధర్మములు దాని స్వభావముగ సిద్ధించి

యున్న వ్యావర్తక ధర్మములగును. కావున ఉపరంజకమగును.

౧ విశేషణముగలదానిని విశిష్టమందురు.

౨. ఉపాధిగలదానిని ఉపహితమందురు.

౩. ఉపలక్షణముగలదానిని ఉపలక్షితమందురు.

౪. ఉపరంజకముగలదానిని ఉపరంజితమందురు.

౧, సదసత్తులకు విలక్షణమైనదానిని అనిర్వచనీయ మందురు, దానినే మిథ్యయనియు నందురు. మూఁడుకాలములందును బాధింపఁబడనిదానిని సత్తందురు. స్వరూపములేని దానిని(శూన్యమును) అసత్తందురు. బాధయోగ్యస్వరూపము గల దానిని సదసద్విలక్షణమందురు.

౧. మిథ్యాత్వమునేనియు మిథ్యాత్వము నిశ్చయము నైనను లేక మూఁడుకాలముల అభావమునునైనను మూఁడు కాలఅభావనిశ్చయమునైనను బాధమందురు. దానినే అత్యంత నివృత్తియనియు చెప్పుదురు.

౧. మిథ్యాత్వమునేనియు మూఁడుకాలములయందు లేని దానినైనను, విషయరూప బాధయందురు. దానినే నిత్య వృత్తియనియు చెప్పుదురు.

౨. మిథ్యాత్వపు నిశ్చయమునునైనను మూఁడుకాలముల లేనిదాని నిశ్చయమునైనను, విషయరూప బాధమందురు. దానినే నిత్యనివృత్తియొక్క నివృత్తియనియుఁ జెప్పుదురు.

౨. ఉపాదానకారణమందు కార్యము విలయమగుటను (లేక ప్రతియోగియొక్క ప్రతీతిపూర్వక కార్యవిలయమును) నాశమందురు. దానినే ప్రధ్వంసాభావమనియుఁ జెప్పుదురు.

౧. ఉపాదానమునకు సమానమగు సత్తనుగల అన్యథా (వేఱు)స్వరూపమును పరిణామమందురు. దానినే వికారమనియు

చెప్పుదురు.

౨. అధిష్ఠానమునకంటె భిన్నమగు సత్తగల ప్రత్యేక స్వరూపమును వివర్తమందురు. దానినే కల్పితకార్యమనియుం జెప్పుదురు.

౧. కార్యమునందును నియమింపఁబడిన అవ్యవహితపూర్వమందున్నదానిని కారణమందురు.

౧. అంతరాయము (మఱుపు)గలదానిని వ్యవహితమంద

౨. అంతరాయములేనిదానిని అవ్యవహితమందురు.

౧. ఉత్పత్తిమాత్రపు కారణమును నిమిత్తకారణమంద

౨. ఉత్పత్తి స్థితిలయముల కారణమును ఉపాదానకా మందురు.

౧. పరిణామరూపకార్యపు కారణమును పరిణామి దానమందురు.

౨. వివర్తరూపకార్యపు కారణమును వివర్త ఉపా మందురు. దానినే అధిష్ఠానమనియుం జెప్పుదురు.

౧. ఏది భ్రాంతికాలమందును భ్రాంతియొక్క నివృత్తిమందును కనఁబడుచున్నదో దానిని సామాన్య అంశమం దానినే ఆధారమనియుం జెప్పుదురు

౨. ఏది భ్రాంతికాలమందు కనఁబడుటలేదో ఏదికన వలన భ్రాంతి తీరుచున్నదో దానిని విశేష అంశమం దానిని అధిష్ఠానమనియుం జెప్పుదురు.

3. ఏది అజ్ఞానకాలమందు (స్ఫురించు) కనఁబడుచు జ్ఞానకాలమందు కనఁబడుటలేదో దానిని కల్పితవిశేష మందురు, దానినే అధ్యస్తమనియుం జెప్పుదురు.

౧. కేవల అజ్ఞానముచే స్ఫురించు భ్రాంతిని నిర

భ్రాంతియందురు. ఈవిధమగునది సర్పము మొదలగునవగును.

౨. ఉపాధితోఁగూడిన అజ్ఞానముచేత స్ఫురించు భ్రాంతిని సోపాధిక భ్రాంతియందురు. ఈవిధమగునది, అద్దమునందలి ప్రతిబింబము జగత్తు, మొదలగునవియగును. కార్యసమకాలమందుండునదియగు (బింబముయొక్క సన్నిధియు, ప్రారబ్ధ మొదలగునవియునయిన) నిమిత్తకారణమును నిట ఉపాధియందురు.

బాధమును బొందినదానిని బాధితమందురు. బాధితముయొక్క అనువృత్తిని బాధితానువృత్తియందురు. పిమ్మట స్ఫురించుదానిని అనువృత్తియందురు.

౧. అదియుండిన అదియుండుట అన్వయమగును. లేక అనువృత్తి: మాలయందు నూలువలె అనుస్యూతమగుటను అన్వయమందురు.

౨. అది (కారణము) లేకయుండ, అది (కార్యము) లేకయుండుట, వ్యతిరేకము లేక వ్యావృత్తిని (భేదజ్ఞానమును) వ్యతిరేకమందురు.

౧. ఉన్నదను జ్ఞానమునకు హేతువగు అజ్ఞాన అంతఃకరణముల పరిణామమును వృత్తియందురు.

౧. యథార్థ అనుభవమును ప్రమయందురు.

౨. ప్రమకంటె వేఱగున జ్ఞానమును అప్రమయందురు.

౧. ఉద్బూత (లేచిన) సంస్కారమాత్రముచే, కనఁబడు జ్ఞానమును స్మృతియందురు.

౨. స్మృతికంటె అన్యమయిన జ్ఞానమును అనుభవమందురు.

౧. రెండుపక్షములను గలిగినజ్ఞానమును సంశయమందురు.

౨. సంశయముకంటె వేఱయిన జ్ఞానమును నిశ్చయమం దురు.

౧. విపరీత నిశ్చయమును విపర్యయమందురు,

౨. యథార్థ నిశ్చయమును మంచిజ్ఞానము (తేటయగు జ్ఞానమందురు.)

౧. ప్రమయొక్క కారణమును ప్రమాణమందురు.

౧. వ్యాపారమునకు వేఱయిన అసాధారణ కారణము కరణమందురు.

౧. కారణము నందుండి కలిగి కార్యమును కలిగించునది ఏదియో దానిని వ్యాపార మందురు.

౧. సకలకార్యముల కారణమును సాధారణ కారణమం దురు [ఈవిధమగునవి ఈశ్వరుఁడు అతని జ్ఞానము ఇచ్ఛప్రయ త్నము, అదృష్టము, ప్రాగభావము ప్రతిబంధాభావమును, కాలము దిక్కు అను తొమ్మిది యగును.

౨. ఏదేని నొకకార్యకారణమును అసాధారణ కారణమం దురు. [ఈవిధమగునవి ఘటము మొదలగు వాని కారణమయిన కపాలము మొదలగునవి.

౧. సకల అనర్థములును వీడి పరమానంద మొందుటను మోక్షమందురు.

౧. అజ్ఞానమును దానికార్యమును అనర్థమందురు దానినే బంధమనియు దుఃఖమనియుఁ జెప్పుదురు.

౨. పరమ ప్రేమయొక్క విషయమును పరమానంద మందురు, అన్నిటికంటె అధికమయిన ప్రేమను (ప్రియమును) పరమ ప్రేమయందురు. దానినేనిరతిశయ ప్రేమయనియుఁ జెప్పు దురు.

౧. దేహాది ప్రపంచము కనపడుచుండగా బ్రహ్మస్వరూపముగానిలుచుటను జీవన్ముక్తియందురు.

౧ నిరావరణ పరిపూరణ వృత్తితో గూడిన ఆనందమును జీవన్ముక్తియొక్క విలక్షణానంద మందురు.

౨. ప్రపంచము (కనంబడుట) లేని బ్రహ్మస్వరూపమగు నున స్థితిని విదేహ ముక్తియందురు.

౧. నిష్ప్రపంచ బ్రహ్మాత్మలయొక్క ఏకత్వ జ్ఞానమును తత్వ జ్ఞానమందురు.

ఆత్మానాత్మల భేదజ్ఞానమును వివేకజ్ఞానమందురు.

౨. విడుచు ఇచ్ఛను లేక ఇచ్ఛ లేకుండుటయు వైరాగ్య మందురు.

3. ఆఱుసాధనములను పొందుటను షట్సంపత్తియందురు.

౧. బైటి విషయములయందుండి మనస్సును అడ్డగించుటను శమమందురు.

౨. బయటి విషయముల నుండి ఇంద్రియములను అడ్డగించుటను దమమందురు.

3. వమనమును వలె విడిచినపిమ్మట మరల వచ్చిన విషయమును విడుచుటనుపరతియందురు.

౪ ద్వంద్వ (శీతోష్ణ మొదలగు) ధర్మముల సహించు స్వభావమును తితిక్షయందురు.

౫. శాస్త్రవాక్యము లందును గురువాక్యమునందును గల విశ్వాసమును శ్రద్ధయందురు.

౬. స్వరూపమందు చిత్తము ఏకాగ్రమగుటను సమాధానమందురు.

౪. మోక్షేచ్ఛను ముముక్షుత్వ మందురు.

౪. పూజ్యబుద్ధితోఁగూడ గలుగు ప్రీతిని (స్నేహము) భక్తియందురు [ఈవిధప్రీతి ఈశ్వరుఁడు గురువు మొదలగువా యందు గలుగునది]

౫. షట్లింగరూపయుక్తులచే వేదాంత తాత్పర్యము నిశ్చయించుటను శ్రవణమందురు.

౬. భేదమునకు బాధకమును అభేదమునకు సాధకమున నగుయుక్తులచేత అద్వైత బ్రహ్మమును చింతించుటను మననమందురు.

౭. అనాత్మాకారవృత్తులను అడ్డగించుట పూర్వకముగ ఆత్మాకారవృత్తుల ప్రవాహమును నిదిధ్యాసమందురు.

౮. వ్యష్టిసమష్టి ప్రపంచమందుండి బ్రహ్మమును అవివేకించుటను పదార్థశోధనయందురు

౯. బ్రహ్మాత్మయొక్క ఏకత్వమును నెఱిగించువాక్యమును మహావాక్యమందురు.

౧౦. తత్ త్వం, త్వం తత్ (అది నీవు, నీవు యాది) పరస్పరమందు పరస్పరముయొక్క ఐక్యమును అన్వయమందురు. దానినే ఓతప్రోతభావమనియుఁ వ్యతిహారమనియుఁ జెప్పుదురు.

౧. సకల అనాత్మాకారవృత్తుల నిరోధమగునట్లాత్మాకారవృత్తియందుండు అహంప్రత్యయమును సాక్షాత్కారమందురు. అదియే "నేను బ్రహ్మ"మను జ్ఞానము. దానినే అపరోక్షజ్ఞానమనియు తత్త్వజ్ఞానమనియుఁ జెప్పుదురు.

౨. బ్రహ్మమున్నదను జ్ఞానమును పరోక్షజ్ఞానమనియుఁ

౧. శబ్దమునకు అర్థముతోఁగల సంబంధమును శక్తియందురు.

౧. శబ్దమునందు అర్థముయొక్క జ్ఞానమును గలిగించు సామర్థ్యమును (కలిగించుచూపసంబంధమును) శక్తివృత్తియందురు.

౨. శక్తియొక్క సంబంధమును లక్షణయందురు.

౧. శక్తివృత్తిచేత కనఁబడునదైన అర్థమును శక్యార్థ మందురు. దానినే వాచ్యార్థమనియుఁ జెప్పుదురు.

౨. లక్షణావృత్తిచే స్ఫురించునదియైన అర్థమును లక్ష్యార్థ మందురు. దానినే శక్యసంబంధియనియుఁ జెప్పుదురు.

౧. త్వంపదముయొక్క వాచ్యము జీవుఁడు

౨. తత్ పదముయొక్క వాచ్యము ఈశ్వరుఁడు.

౧ త్వంపదముయొక్క లక్ష్యము కూటస్థుఁడు అదియే జీవసాక్షి.

౨. తత్ పదముయొక్క లక్ష్యము శుద్ధబ్రహ్మము. అదియే ఈశ్వరసాక్షి.

౧. అంతఃకరణ విశిష్టచేతనము జీవుఁడు.

౨. అంతఃకరణ ఉపహితచేతనము సాక్షియగును. లేక ఉదాసీనమై సవికాసముండుండుకొని యొంటిఁగా నిదియయిన చేతనము సాక్షియగును లేక అంతఃకరణమందును దానివృత్తియందును గల చేతన మాత్రము సాక్షియగును.

౧. మాయావిశిష్టచేతనము ఈశ్వరుఁడు.

౨. మాయా ఉపహితచేతనము ఈశ్వరసాక్షియగును అదియే శుద్ధబ్రహ్మము.

౧. మూఁడుకాలములందును బాధింపబడనిదానిని సత్తందురు.

౨. ఉత్పత్తినాశము లేనిదానిని నిత్యమందురు.

౩. అలుప్త (చేటులేని) ప్రకాశమును చిత్తందురు.

౪. పరమ ప్రీతికొఱకు విషయమును ఆనందమందురు.

౫. అన్నిటికంటె అధికవ్యాపకమును బ్రహ్మమందురు.

౬. తన ప్రకాశమందు అన్యప్రకాశముయొక్క అపేక్ష లేనిదై అన్నిటిని ప్రకాశింపఁజేయువానిని స్వప్రకాశమందురు దానినే స్వప్రకాశమనియు, స్వయంప్రకాశమనియుఁ జెప్పుదురు.

౭. కూటమును (కరమల పట్టడమును) వలెనుండు దానిని లేక కూటము (కపటరూపమాయయొక్క పరిణామమయిన అంతఃకరణము)నందు ఉండు దానిని కూటస్థుడందురు; లేక కూట(నిశ్చల)త్వముగా నిలుచుదానిని కూటస్థుఁడందురు.

౮. అంతఃకరణమందును, దాని వృత్తులయందునుండు చేతనమాత్రమును సాక్షియందురు.

౯. చూచువానిని లేక దృష్టికర్తను ద్రష్టయందురు.

౧౦. ఎఱుఁగువానిని లేక జ్ఞానముయొక్క కర్తను జ్ఞాతయందురు.

౧౧. సమీపమందుండి చూచువానిని ఉపద్రష్టయందురు.

౧౨. ఉపలబ్ధియొక్క కర్తను (జ్ఞానముయొక్క) ఉపలబ్ధయందురు [ఎట్లు.- సూర్యుడు ప్రకాశమునుచేయుచున్నాఁడను నదిఉపచారమాత్రమాయట్లు ఆత్మదృష్టిని లేక జ్ఞానమును లేక ఉపలబ్ధిని చేయుచున్నాడనునది ఉపచారమాత్రమగును. లేక చక్షు అంతఃకరణములయొక్క వృత్తిభేదముచే రెండువిధముల అనిత్య దృష్టిగలదు. చేతనరూపము నిత్యదృష్టియగును వాని కంటె ప్రతిబింబరూపము ప్రకాశమును జేయు సూర్యునివలె అనిత్యదృష్టికి ఆశ్రయమగుటచే ఉపచారముగా దృష్టియొక్క కర్తఆత్మ యనఁబడుచున్నది. రాహువుయొక్క శిరస్సువలె

నిత్యదృష్టియే ఆత్మయొక్క స్వరూపమేయగును. ఇట్లు ఉపలబ్ధి మొదలగువాని యొక్క కర్తృత్వము నందును తెలియఁదగినది.

౧౩. అన్నిరూపములను సర్వాత్మ యందురు [ఇవి ఆత్మ యొక్క విధేయ విశేషణము లగును]

౧౪. దేశకాలవస్తువులచేనైన యీ (పరిచ్ఛేదము) లేని దానిని అనంతమందురు. దానినే అపరిచిన్నము, భూమ, వ్యాపకము విభు అని చెప్పుదురు.

౧౫. జీవేశ్వరులు మొదలగు పంచభేదములు లేక సజాతీయాది మూఁడు భేదములులేని దానిని అఖండమందురు.

౧౬, సంబంధము (సంఘము)లేని దానిని అసంగమందురు

౧౭. ద్వైతములేని దానిని అద్వైతమందురు.

౧౮. అవయవ (అంగము) లేనిదానిని నిరవయవమందురు

౧౯. జన్మము లేనిదానిని అజన్మమనియు అజమనియుఁ జెప్పుదురు.

౨౦. మరణము లేనిదానిని అమరమందురు దానినే అవినాశియనియు అమృతమనియు చెప్పుదురు

౨౧ జర (ముసలితనము) లేని దానిని అజరమందురు.

౨౨ క్రియలేని దానిని అక్రియ మనియు నిష్క్రియ మనియుఁ జెప్పుదురు.

౨౩. షట్ (ఆఱు) వికారములు లేని దానిని నిర్వికారమందురు. అది నే అక్రియయు కూటస్థుఁడును నగును.

౨౪. స్థూలమొదలగు (నాల్గు) రూపములు లేని దానిని నిరాకారమందురు.

౨౫. మనస్సు ఇంద్రియములకు గోచర (విషయ)ము కాని దానిని అవ్యక్తమందురు.

౨౬. ప్రమాణమునకు విషయముకానిదానిని అప్రమేయమందురు.

౨౭. తఱుగుట పెఱుగుట లేనిదానిని అవ్యయమందురు.

౨౮. క్షరణ (క్షయ)ము లేనిదానిని అక్షరమనియు అక్షయమనియు చెప్పుదురు. (క్షయము తగ్గుట) [ఇవి ఆత్మయొక్క నిషేధ విశేషణములు]

ఈరీతిని లక్షణావళి చెప్పబడినది

75. ఇప్పుడు తమయుపదేశమును సమాప్తి చేయువారై శ్రీగురుస్వాములు తమ శిష్యునికి జ్ఞానము దృఢమగుటను సూచన చేయుచున్నారు.

శిష్యుడా! నీవు నాయీ వేదోక్తమయిన యుపదేశమును వింటివి. అందుచే శబ్దముయొక్క స్వభావముచేత నీచిత్తమందు దృఢముగా (సంశయవిపరీత భావనము లేనిదిగా) నైనను లేక అదృఢముగా (సంశయ విపరీత భావనలతోఁ గూడినదిగా) నైనను అపరోక్ష జ్ఞానము అవశ్యము కలిగియుండు ననునది నాకు అనుమాన ప్రమాణముచేత నిశ్చయమయినది ఎలన:—

౧. శబ్దమునకు స్వభావమిది యగును. దేశముయొక్క అంతరాయముగల (మఱుపుగల) లేక కాలముయొక్క అంతరాయముగల వస్తువుయొక్క జ్ఞానము, శక్తి లక్షణలజ్ఞానముగల పురుషునికి శబ్దముచేత పరోక్షముగానే గలుగుచున్నది. అపరోక్షముగా గలుగుట లేదు.

ఎట్లు దేశకాలముల అంతరాయముగల స్వర్గముయొక్క జ్ఞానమును, ఇంద్రాదిదేవతల జ్ఞానమును, శాస్త్రరూప శబ్దముచే పరోక్షముగానే కలుగుచున్నది. అపరోక్షముగా గలుగుట లేదు.

౨. దేశకాలముల అంతరాయములేనిదిగా నుండుటచే సమీప దేశమందును వర్తమానకాలమునందును గల వస్తుజ్ఞానము శబ్దముచే పరోక్షము అపరోక్షమను రెండువిధములుగాఁగలుగుచున్నది

ఎట్లు దశను (పదియవవాఁ)డున్నాఁడు, మఱచిన కంఠపు ఆభరణమున్నది. అని ఉన్నదను రూపముచే శబ్దముచే తెలిపింపఁబడిన అంతరాయములేని దశమునియొక్క జ్ఞానమున్ను, కంఠముయొక్క ఆభరణజ్ఞానమున్ను, వినువానికి పరోక్షముగా గలుగుచున్నది. అట్లే "సత్యజ్ఞానానందరూప బ్రహ్మమున్నది" అని అవాంతరవాక్యముచే ఉన్నదనురూపముచే నెఱిగింపఁబడిన శ్రోతయొక్క స్వరూపముగానుండుటచే అంతరాయములేని బ్రహ్మమేదికాని దానిజ్ఞానము వినువానికి పరోక్షముగానే కలుగుచున్నది. అపరోక్షముగా గలుగుటలేదు. ఈవిధముగా జ్ఞేయవస్తువు స్వరూపమును నెఱిగించుపదములేనివాక్యముచే అంతరాయములేని వస్తువుయొక్క జ్ఞానమున్ను శక్తి లక్షణల జ్ఞానముగల పురుషునికి నియమముగా పరోక్షముగానే కలుగుచున్నది.

ఎట్లన:—నీవు పదియువవాఁడవు. ఇదికంఠాభరణము. అని వస్తువుయొక్క స్వరూపమును నెఱిఁగించు పదముతోఁగూడిన వాక్యముచేఁ దెలిపింపఁబడిన పదియువవాఁడు కంఠాభరణము అనువాని జ్ఞానము శబ్దముయొక్క శక్తి, లక్షణల జ్ఞానముగల పురుషునికి అపరోక్షముగాఁ గలుగుచున్నది. పరోక్షముగాఁ గలుగుటలేదు, అట్లే శ్రోతయొక్క (వినువాని) స్వరూపమును నెఱిగించు "త్వం" మొదలగు పదముతోఁగూడిన "తత్త్వమసి" మొదలగు మహావాక్యములచే నెఱిగింపఁబడిన శ్రోతయొక్క

స్వరూపముగానుండుటచే అంతరాయములేని బ్రహ్మమేదియో దాని జ్ఞానము శబ్దముయొక్క శక్తియు లక్షణయు నయిన వృత్తియొక్క (శబ్దమునకు అర్థముతోనుండు సంబంధము యొక్క) *98 జ్ఞానముగల పురుషునికి నియమముగా దృఢముగానైనను అదృఢముగానైనను కలుగుచున్నది.

౧. అత్యంతశుద్ధ అంతఃకరణముగల ఉత్తమ అధికారికన్నచో ముందుజెప్పిన శబ్దముచే దృఢజ్ఞానమే కలుగుచున్నది. అతనికి అపరోక్షజ్ఞానముదయించిన పిమ్మట సంశయము మొదలగువానిని నివర్తించుకొనుటకు శ్రవణమననాదిరూప ప్రయత్నము చేయవలసినది లేదు.

౨. ఏపురుషుని అంతఃకరణము అత్యంతము శుద్ధముగాక కొంచెము మలములేక విక్షేప మొదలగు దోషములతో గూడినదై యున్నదో, వాఁడు మధ్యము, లేక కనిష్ఠ అధికారియగును. వానికి ముందుచెప్పిన మహావాక్యరూపశబ్దముచే అంతరాయములేని వస్తువుయొక్క జ్ఞానమున్ను అదృఢ అపరోక్షముగాఁగలుగుచున్నది. వానికి అపరోక్షజ్ఞానముదయించిన పిమ్మటయున్ను, సంశయాదుల నివారణకొఱకు శ్రవణమననాదిరూప ప్రయత్నములు చేయఁదగ్గవి.

ఈయర్థము ప్రసంగముచేఁజెప్పబడినది.

శిష్యుఁడా! నీవు శాస్త్రాభ్యాసమూలమునను, ముందు

---

*98. ఇటయిది అభిప్రాయము:— శబ్దముయొక్క శక్తిలక్షణలజ్ఞానము లేక శబ్దార్థముయొక్క జ్ఞానము కలుగుచేని దేశాంతరమందు వసించు పురుషునికి వేఱుదేశభాషయొక్క జ్ఞానము చదువుటలేకయే కలుగవలయును; కలుగుటలేదు. కావున పదార్థముల జ్ఞానమునందు శక్తి లక్షణల జ్ఞానము అపేక్షింపఁబడునదగును.

చెప్పినవిధముననూ, శబ్దముయొక్క (తత్పదత్వంపదములయొక్క) శక్తివృత్తి లక్షణావృత్తుల జ్ఞానముగలవాఁడవుగానున్నావు. శ్రుతి, యుక్తి, నా (గురువు) వాక్యము, నీయనుభవము, అను ప్రమాణములచే, నీకుఁదెలియదగిన బ్రహ్మముయొక్క వేఱు కాని ఆత్మ ప ప్రమేయమేదియో, యది సర్వాత్మయైయుండుటచే నొకదానికి దూరమనియు సమీపమనియు చెప్పఁబడుటలేదు. అయితే అన్నిటికి తానే తానైయుండుటచే అన్నిటికిని అత్యంతసమీపముగానున్నది.

౧. ఆయత్యంత సమీపమందున్న బ్రహ్మరూప ఆత్మయొక్క ఉపదేశమును నేను "తత్త్వమసి" అను మొదలగు మహావాక్యములచే చేసియున్నాను.

౨. నేను నిన్నడుగదగిన బ్రహ్మాత్మల యేకత్వరూప తత్త్వముయొక్క అజ్ఞానముచే చేసిన ప్రశ్ననుండి ఉపరమించితివని గాంచుచున్నాను.

3 నీకు ముముక్షుత్వమునకు పిమ్మట అపేక్షింపఁబడు ఆత్మయొక్క అభిన్నమును విస్మరణమునొందిన కంఠభూషణము వలె నిత్యప్రాప్తియు నయిన ఏబ్రహ్మముయొక్క ప్రాప్తియుండినదో యదే దానిజ్ఞానమూలమున సిద్ధించినది. కావున బుద్ధియొక్క చంచలతకు హేతువయిన రజోగుణజన్యమగు ఇచ్ఛావృత్తియొక్క నివృత్తిమూలమున అంతర్ముఖమయిన బుద్ధివృత్తియందు ప్రతిబింబమును నొందిన స్వరూపానందముయొక్క అనుభవసూచనను జేయునదియయిన ముఖముయొక్క ప్రసన్నత కలిగియున్నది. దానిన్ని చూచుచున్నాను.

కావున ముందుచెప్పిన లింగము (గుర్తు)లచే నీకు అవశ్యము బ్రహ్మాత్మయొక్క ఐక్యముయొక్క అపరోక్ష

జ్ఞానము ఉదయించియున్నదని నాకునిశ్చయముగుచున్నది. ఏన నాజ్ఞానము దృఢముగానున్నది. లేక అదృఢముగానున్నదను నిశ్చయము నాకుఁగలుగలేదు. ఏలయన,

౧. అంతఃకరణమున్ను దానివృత్తియున్ను సూక్ష్మపంచభూతముల కార్యమగును. కావున ఇంద్రియరూప ప్రత్యక్షప్రమాణమునకు విషయములు కావు. అయితే అవి (అంతఃకరణమును దానివృత్తియు) సాక్షికి (అంతఃకరణమందును దానివృత్తులయందునుగల చేతనమాత్రమునకు) విషయమగును.

౨. తత్త్వజ్ఞానమున్ను అంతఃకరణముయొక్క వృత్తిరూపమగును. కావునఅది ఇంద్రియములకువిషయము కాదు. ఇందుచే ప్రత్యక్షత్వము చేత నీయొక్కజ్ఞానము యొక్క దృఢతనైనను అదృఢత నైనను నెఱుఁగజాలను,

౩. లేక జ్ఞానియొక్క స్వస్వరూపమందు గతి (ప్రవేశము) రూపజ్ఞానమేదియో యది మనుష్యునిచే నెఱుఁగఁదగినదయిన ఆకాశమునందు విహరించుపక్షియొక్క గతి, క్షణకాలముండు నదియయిన మెఱుపుయొక్క గతి సుఖదుఃఖ మొదలగు ధర్మములచేత ముఖముయొక్క వాడుబాటునకును ప్రకాశమునకును, హేతువయిన మనస్సుగతి యనువానికి విలక్షణమగును. సాధారణమనుష్యునిచే అలక్ష్యముగా (ఎఱుఁగదగనిదిగా) యుండుటచే,

౪. యోగిచే లక్ష్యమగు జలప్రవాహమునందు ఎదిరించిపోవునదియగు చిన్నచేపగతియేదియో దానికంటెను, ముందు చెప్పినజ్ఞానిగతి విలక్షణమగును. సర్వజ్ఞుఁడగు సిద్ధయోగిచేతను అలక్ష్యముగానుండుటచే,

౫. తనకంటెను అధికుఁడైన వేఱొక సిద్ధయోగిచే నెఱుఁగ

దగినదై యుండుటచే దుర్లక్ష్యమగును (దుఃఖముచే నెఱుఁగ దగినదైయుండును.) సర్వజ్ఞసిద్ధయోగియొక్క గతికంటెను, ముందు చెప్పిన జ్ఞానియొక్క గతి, విలక్షణమయినది; మహాయోగిచేతను అలక్ష్యముగానుండుటచే, కావున జ్ఞానమార్గము నెఱుఁగని అజ్ఞులచేతనో జ్ఞానముయొక్క గతి పూర్తిగ అలక్ష్యమగును.

౬. జ్ఞానమార్గమును గనిన వేఱొకవివేకి యెవఁడో వాఁడు తక్కిన జ్ఞానియొక్క నిష్ఠను, తనస్వరూపమునకు భిన్నముగా జూచునేని ద్వైతమును జూచువాఁడగుటచే నతఁడు అజ్ఞానియగును. దానిని (ముందుచెప్పిననిష్ఠను) వాఁడు (వేఱువివేకి) తన స్వరూప అభిన్నముగా జూచునేని యది (తన యాత్మకంటె వేఱు కాని దానినిగాఁ జూచుట) తన నిష్ఠయేయగును. దానినే చూచుచున్నాఁడు తక్కిన జ్ఞాని నిష్ఠ (గతి) ను జూచుట లేదు కావున వేఱువివేకిచేతను జ్ఞానియొక్క గతి ప్రత్యక్షముచేతఁ దెలియుటకరుదగును. కావున అపరోక్షత్వముచేత నీ జ్ఞాననిష్ఠయొక్క దృఢత్వమునునైనను అదృఢత్వమునునైనను నేనెఱుఁగజాలను.

౭. బహుకాలసహవాసముచేత వచనమొదలగు లింగములచేత నెఱుఁగింపఁబడిన,

౧. గుణాతీతత్వము.

౨. సమీపమందుండు మృత్యువుయొక్క జ్ఞానముచే భయము లేమి.

౩. ఇష్టానిష్టములందు హర్షశోకంబులు లేమి. అను నీ మొదలగు జ్ఞానియొక్క *99. స్వసంవేద్యలక్షణములచేత వేఱొక

*99. ఏలక్షణము భాగవతము ఏకాదశస్కంధమునఁ జెప్పిన మైత్రి, కృప గలిగియుండుట మొదలగు (30) పరసంవేద్య (పరులచే నెఱుఁగనగు) లక్షణ

తెలిసినవానిచే అనుమానముచే నెఱుఁగదగినది జ్ఞానియొక్క గతియగును. అయితే యుపదేశమునకు పిమ్మట నీవును నాకును చిరకాలము పర్యంతము సహవాసము (కూడయుండుట) కలుగుటలేదు కావున నీకుఁగలిగిన జ్ఞానమేదియో యది దృఢము లేక అదృఢము అనుదానిని అనుమానముచేతను నేనెఱుఁగఁ జాలను.

౭. ముముక్షువునకు (౧) పూర్వపుణ్యముచేతను, (౨) లోకమునకు తాను బ్రహ్మవిత్తగుటయొక్క ప్రసిద్ధిచేతను, (3) వాసభ్రమనివృత్తిమూలముగా శాంతినికలిగించు వచనములచేతను "వీతజ్ఞాని" యనుభావనకలుగుచున్నది.

౧. కావున శిష్యుఁడా! నేను నీకు దీనినెఱింగించుచున్నాను. నీకు సంశయ విపర్యయ రూపదోషములేని దృఢజ్ఞానము కలిగియుండెనేని, నీవు కృతకృత్యు (చేయవలసినదానిని చేసినవా)డవును. ప్రాప్యప్రాప్త (పొందవలసినదానిని పొందినవా)డవును నగుదువు. కావున నీకాదోషముల నివృత్తికొఱకు శ్రవణమనన మొదలగు నే ప్రయత్నమును జేయవలసినది లేదు.

౨ నీకు సంశయవిపర్యయరూపదోషముతోఁ గూడిన "నేను బ్రహ్మ" మను నిశ్చయరూప అదృఢ (మంద) బోధముకలిగి యుండినట్లయిన, అప్పుడు నీకు శ్రవణాదులు మూఁడును చేయఁదగినవియగును.

౧. వాటిముందును నీకు ఉపనిషత్తురూపు లేక దాని అనుసారియయిన అన్ని సంస్కృతలేక ప్రాకృతభాషల గ్రంథరూప వేదాంతశాస్త్రములు బ్రహ్మాత్మ ఐక్యమును ప్రతిపాదించు

---

ముఖవలె పరులకు నెఱుఁగరానిదో అయితే జ్ఞానియగు తనకే నెఱుగవచ్చునో యది జ్ఞానిస్వసంవేద్య (తనచే నెఱుఁగఁబడు)లక్షణమగును.

చున్నవా? లేక వేఱు అర్థమును ప్రతిపాదించుచున్నవా? అను రూపముగు కేవలప్రమాణగత సంశయముకలుగునేని అప్పుడు నీకు శ్రవణమాత్రము చేయవలసినదగును.

ఉపనిషత్తు అభ్యాసరూప లేక దానిని యనుసరించు తక్కిన సంస్కృత లేక ప్రాకృత భాషాగ్రంథముల అభ్యాస రూప విచారమయిన సాధన (గురుముఖముగా వాక్యపు శ్రవణరూప అంగిమొక్క వేఱయిన అంగ) శ్రవణమేదియో దాని మూలమున.

౧. ఉపక్రమ ఉపసంహార (ఆరంభము సమాప్తి,)

౨. అభ్యాసము (అడుగడుగునకు చెప్పుట)

౩. అపూర్వత (శ్రుతికి వేఱయిన ప్రమాణములకు విషయము కానందుననైనను స్వప్రకాశత్వముచేనయినను అద్వైత వస్తువుయొక్క అలౌకికత్వము )

౪. ఫలము (అనర్థనివృత్తియు పరమానంద ప్రాప్తియు నైన మోక్షము.)

౫. అర్థవాదము (భేదజ్ఞాననిందయు అభేదజ్ఞానస్తుతియు)

౬. ఉపపత్తి (అద్వైతజ్ఞానమున కనుకూలమయిన దృష్టాంత రూపయుక్తి) అనునవి తాత్పర్యమును నిశ్చయించు అఱులింగ రూపయుక్తులగును. ఈ యాఱు లింగరూపయుక్తులచేత వేదాంత (ఉపనిషత్తుల) తాత్పర్యమును నిశ్చయించుట శ్రవణ మనఁబడుచున్నది. అది నీకు కర్తవ్యమగును. దీనిచే (శ్రవణముచే) ముందు చెప్పిన ప్రమాణగతసంశయ నివృత్తికలుగు చున్నది.

౨. ఉపనిషత్తుల విచారము చేసనైనను లేక దానిని అనుసరించు తక్కిన సంస్కృత ప్రాకృత గ్రంథముల విచారముచే

నైనను లేక నిజముగలుగు గురువువాక్యమునందుగల దృఢ విశ్వాసముచేనైనను ఉపనిషత్తురూప ప్రమాణముచే నెఱుంగదగు బ్రహ్మాత్మైక్యరూప ప్రమేయమేది కలదో యది ఉపనిషత్తుల యందు అవశ్యము నిరూపణము చేయబడియున్నది. అను నిశ్చయమువలన నీకు ప్రమాణగతసంశయముగలుగక బ్రహ్మమయిన పరమేశ్వరుఁడు.

౧ సర్వజ్ఞత్వము మొదలగు గుణములతోఁ గూడినవాఁడు.

౨ (౧) అవిద్య, (౨) అస్మిత, (౩) రాగము, (౪) ద్వేషము, (౫) అభినివేశము అను నైదు క్లేశములు లేనివాఁడు.

౩ ఎక్కడను పూర్ణుఁడు.

౪. నాయుపాసకుఁడు. (ఉపాసింపఁబడువాఁడు).

జీవుఁడైన నేను.:—

౧. అల్పజ్ఞత్వము మొదలగు గుణములతోఁ గూడినవాఁడను

౨. అవిద్య మొదలగు పంచక్లేశములతోఁ గూడినవాఁడను.

౩ దేహసంబంధియైయుండుటవలన పరిచ్ఛిన్నుఁడను.

౪. దాని ఉపాధి అను నీవిధ అసంభవముచే బ్రహ్మాత్మైక్యరూప వేదాంతపు ప్రమేయమేదిగలదో యది నాబుద్ధియందు వచ్చుటలేదు. కావున "బ్రహ్మాత్మైక్యము సత్యమా?" అను కేవల ప్రమేయసంశయము కలిగినట్లయిన నీకు,

౧ రజ్జుసర్పము, శుక్తిరజతము, అద్దమందుండునగర ప్రతిబింబము అను నీ మొదలగు దృష్టాంతరూపమున్ను.

౨. (౧) భేదములేని ఆత్మయందు బ్రహ్మభేదమున్నదా?

౨. లేక భేదముతోఁగూడిన ఆత్మయందు బ్రహ్మభేదమున్నదా?

౩, పేరు జాతి మొదలగు ద్వైతరూప వికల్పములేని ఆత్మ

యందు వికల్పమున్నదా? లేక వికల్పముతోఁగూడిన దాని యందు వికల్పమున్నదా? అను రెండుచోట్లను.

౧. మొదటి పక్షమందు వ్యాఘాత దోషముగలదు.

౨. రెండవ పక్షమందు ఆత్మాశ్రయము, అన్యోన్యాశ్రయము, చక్రికగ, అనవస్థ, మొదలగు దోషములు గలుగుచున్నవి. అనుసదగు.

ఇవి మొదలగు భేదముల బాధకయుక్తుల చేతను.

౪. ఘటాకాశమునకును మహాకాశమునకును స్వరూపము చేత ఎప్పుడును భేదముగలదో, అట్లే నిరుపాధిక బ్రహ్మము నకును, ఆత్మకును, స్వరూపముచే నెప్పుడు నభేదముగలదు అను మొదలగు అభేదసాధక యుక్తులచేతను.

అద్వైతబ్రహ్మ (బ్రహ్మాత్మయొక్క అభేద) చింతించు రూపమననము చేయుదగినదగును.

3. నీకు ముందుచెప్పిన రెండువిధ సంశయములు కలిగిన ట్లయిన నీవు ముందుచెప్పిన విధముగ శ్రవణమననములు రెంటిని చేయవలెను.

౪. నీకేవిధమయిన సంశయమునులేక జ్ఞానమునకుముందు సగుణబ్రహ్మ పూర్ణ ఉపాసనచేకలుగు చిత్తముయొక్క ఏకాగ్రతలేనందున "నేనుజీవుఁడనై యున్నాను, బ్రహ్మమునకును, నాకును, గలభేదము సత్యము, దేహము మొదలగు జగత్తు సత్యము" అనురీతిగా గలుగు ప్రతిక్షణమున్ను లేచునదియైన బుద్ధిరూప కేవల విపరీతభావన (రజ్జుయందు సర్పనిశ్చయమువలె ఆత్మయొక్క యథార్థస్వరూపముకన్న విపరీతమయిన నిశ్చయము) కలుగునేని, అప్పుడు నీవు విజాతీయ ప్రత్యయముల (అనాత్మాకారవృత్తుల) నివర్తితోఁగూడిన సజాతీయప్రత్యయ

(ఆత్మాకార వృత్తుల) ప్రవాహరూప నిదిధ్యాసనమును (సవికల్పసమాధిని) జేయువలయును.

౫. నీకు రెండువిధ సంశయములును విపరీతభావనయును కలుగునేని, అప్పుడు నీవు ముందుచెప్పిన శ్రవణమనన, నిదిధ్యాసనమను మూటినిన్నీ చేయువలయును, అంజనముచే, నేత్రరోగ నివర్తిమూలముగా, సూర్యుని సాక్షాత్కారమున్ను కలుగుటంబోలె, నాశ్రవణాది సాధనములచే నిదిధ్యాస పరిపాకావస్థరూప ధ్యాతధ్యానమను వానియందు మఱపుగలిగి అద్వితీయస్వప్రకాశ ప్రత్యగభిన్న బ్రహ్మరూప ధ్యేయాకార (ధ్యానింపఁబడు వస్తురూప) వృత్తియొక్క స్థితిమయమగు క్షణిక (క్షణము నిలుపుండునదైన) సమాధిరూప సాక్షాత్కార (దృఢఅపరోక్ష జ్ఞానము) కలుగును. అందుచే అదేక్షణమందు కార్యముతోఁగూడిన అవిద్య నివృత్తియు మూఁడు కాలములందు లేని నిశ్చయరూప బాధయున్ను పరమానంద రూప బ్రహ్మపు ఆవిర్భావమునయిన జీవన్ముక్తి కలుగును.

కావున ఇప్పుఁడు నీవు శ్రవణమననములచే నుదయమయిన జ్ఞానమును దృఢముచేయుము. పిమ్మట

౧. నీకు ఉత్తమ ప్రారబ్ధము గలదేని నీజీవన్ముక్తి విలక్షణానంద అనుభవము కొఱకు విద్వత్సన్న్యాస రూప నివృత్తిని చేకొనుటతో నిర్వికల్ప సమాధియొక్క అధిక అభ్యాసము కలుగును.

౨. నీకు మధ్యమ ప్రారబ్ధముయుండునేని స్నానము సంధ్య దేవపూజ సాధుసేవ, గురుభక్తి శాస్త్రాధ్యయనము, అనునీ మొదలగు శాస్త్రములందు చెప్పఁబడిన వ్యవహారములు కలుగును.

3. నీకు కనిష్ఠ ప్రారబ్ధముండునేని కృషి (పైరు చేయుట) వర్తకము, సేవకము, కుటుంబ సంరక్షణ, రాజ్యపాలన, అను నీ మొదలగు క్లేశరూప కనిష్ఠమైన లౌకిక వ్యవహారములు గలుగును అయితే:—

ఎండమావులజలదృశ్యముచే పృథివి తడియక యుండు లాగు బాధితమగు ప్రపంచపుఅనువృత్తి (పిమ్మట దృశ్యము)చే దేహము కదువఅకు ప్రారబ్ధానుసారము కనఁబడు నీ వ్యవహారములచే నీకొకహానియు లాభమును లేదు.

శిష్యుఁడా! నీవు దృఢజ్ఞానముచే ముందుండిన భేదవాది, కడుపు సాకుపామరుఁడు అనువారి సంఘమును, స్త్రీని, స్త్రీల సంఘమును గల విషయ పురుషుల సంగమును విడిచిపెట్టుము. ఏలయన వారిసంగమేదియో యది ఉదయమయిన మందబోధమును నాశము చేయునదగును.

ఒకరాజు, పుత్రులు మొదలగువాటి కోరికతో వాయుదేవునికి యాగము చేయుట కొఱకు శాస్త్రము నందు చెప్పియుండు లక్షణములుగల మేకయను నొకపశువు కావలసియుండెను. అందుకొఱకాతఁడొక వేదవేదాంగములెఱింగిన బ్రాహ్మణునిబంపెను. ఆబ్రాహ్మణుఁడొక దేశాంతరమందున్న మేకల మందనుండి శాస్త్రములందు జెప్పియుండు లక్షణములు గల మేక నొకదానిని [నూఱు రూప్యములు మతింపుగల దానిని] ధనమిచ్చి తీసికొని రాజునగరమునకు వచ్చుచుండెను.

అప్పుడు త్రోవయందు నలుగురు దొంగలు చేరి యిది రాజుయొక్క మేకయని తెలిసికొని యొకని కొకఁడు సంకేతములు చేసికొని దాని నపహరించుట కొఱకు నాబ్రాహ్మణునికి నొక్కొక క్రోశ (రెండు మైళ్ల) దూరమునకు నలుగురు

కట్టెలు కొట్టుట మొదలగు వేర్వేరు పనులు చేయుచునుండిరి అప్పుడొక దొంగయున్న చోటికి ఆ బ్రాహ్మణుడు రాగానే వా "డీపశువు మేక కాదు వెఱ్ఱికుక్క" యనిచెప్పెను దానిని వినినయాతనికి సందేహము కలుగలేదు పిమ్మట రెండవ దొంగయున్న చోటికి రాగావాడు నాలాగే చెప్పెను. దాని విని నాతనికి సందేహము కలుగెను పిమ్మట మూడవ వాడున్న చోటికి రాగావాడును నట్లే చెప్పెను. దాని విని "ఈపశువు వెఱ్ఱికుక్కయే"యని విపరీత నిశ్చయ మా బ్రాహ్మణునికి గలిగెను అప్పుడాతడా మేకను త్రాడువిడిచిపోయెను. ఆపశువు మాత్రము స్నేహ వ శ ము న నాతని వెనుక పోయెను. పిమ్మట నాల్గువ దొంగ సమీపముగా పోవునపుడు వాడును మిక్కిలి భయమును కలిగించు మాటలుచెప్పి యట్లే చెప్పెను. అప్పుడా బ్రాహ్మణుడు భయపడి ఆమేక మెడకుకట్టి యున్న త్రాటింబట్టి నొక వృక్షమునకు గట్టివైచి వేగముగా రాజు దగ్గఱ పోయిచేరెను. ఆపశువునా నలుగురు దొంగలుచేరి తీసి కొనిపోయిరి. రాజు ఈ సంగతి దెలిసికొని మరల నాపశువును దెప్పించి తనకార్యమును ముగించుకొనెను.

అట్లు.— గురురూప రాజు మోక్షమను కార్యసిద్ధి కొఱకు ముముక్షురూప బ్రాహ్మణుని శాస్త్రమందు చెప్పి యుండు సచ్చిదానందలక్షణములతో గూడిన ఆత్మరూప పశువును విచారించి నిశ్చయము చేయుటయనెడు ప్రాప్తికొఱకు శాస్త్రయుక్తులచే విచారము చేయుటయను దేశాంతరమున కంపెను. అప్పుడాముముక్షువగు బ్రాహ్మణుడు బ్రహ్మమున కభిన్నమగు ఆత్మమొక్క నిశ్చయరూపఆ పశువును పొందెను ఆయిన భేదవాది మొదలగు జనసముదాయ రూప దొంగల

సంగముచేత సంశయములు దేహము మొదలగు అనాత్మలనేను నాదియను విపరీతభావనలను బొందుచున్నాఁడు అతనికిసకల గురురూపరాజుయొక్క సంగము కలుగునేని ఆవిపరీతభావన నివృత్తియగును. లేనిచో ఆత్మయగు తనువను బోగొట్టుకొని జననమరణమును సంసారమును పశ్చాత్తాపమును అనుభవించును. కావున భేదవాది మొదలగు వారిసంగరూపకళంక దృఢజ్ఞానమునకు ముందుగనే నివర్తింపఁదగినదగును.

దృఢజ్ఞానమునకు పిమ్మటయును జీవన్ముక్తి యొక్క విశేషసుఖము కొఱకు ముందుచెప్పిన జనులసంగము విడువదగిన దగును.

శ్లో॥ నిస్సంగతాముక్తిపదం యతీనాం
సంగాదశేషాః ప్రభవంతిదోషాః।
ఆరూఢయోగోఽపినిపాత్యతేఽధః
సంగేనయోగీకిముతాల్పసిద్ధిః॥

ప్రయత్నముగల పురుషులకు సంగాభావ (జనులతో రాగద్వేషమొదలగునవిలేకుండుటయగునుదాసీనత్వ)ము ముక్తిపదమగును. సంగముచే సకల దోషములు కలుగుచున్నవి. యోగారూఢపురుషుఁడును సంగముచే జారిపడుచున్నాఁడనగా అల్పసిద్ధిగల పురుషుఁడు (అపక్వయోగి) సంగముచే జారిపడుచున్నాఁడనుటలో నేమి చెప్పవలసియున్నది అని వేఱు శాస్త్రమందుచెప్పఁబడియున్నది. ఈయర్థమందికననేక ప్రమాణములున్నవి. అవివిస్తర భీతిచే నిటవ్రాయఁబడ లేదు ఆస్తిక అధికారులకు విశేషప్రమాణముల అపేక్షయు నుండదు. ఎటులన:—

శ్లో॥ బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి - బ్రహ్మవిత్తు బ్రహ్మమును

తెలిసినవాడు) బ్రహ్మమే యగుచున్నాఁడు" అను శ్రుతిచే వాసికో (మిక్కిలి విశ్వాసముగల యధికారికో) బ్రహ్మజ్ఞానులగు పురుషుల సకల (సంస్కృతలేక ప్రాకృతభాషల) వాక్యములును భేదభ్రాంతిని ఛేదించునవియై యుండుటచే వేదరూపముగాగాన్పించుచున్నది. దీనిచేతను నీగ్రంథమున కొన్నిచోట్ల శ్రుతిమొదలగు ప్రమాణములు విశేషముగా వ్రాయఁబడలేదు. కావున జ్ఞానముగలిగిన పిమ్మటను కుశంకనుండి దూరస్థుఁడై యుండుటయే తగినదగును.

సంగదోషమును నాశముచేయు సత్పురుషుల సంగము చేయగా నిస్సంగత్వము కలుగుచున్నది కావున వాసనాక్షయము మొదలగు ఫలమునకు హేతువుగా నుండుటచే నాసాధుసంగ మెప్పుడును చేయవలసినదగును.

76. ౧ వైరాగ్యము ౨ జ్ఞానము ౩ ఉపరతి అనుమూటిని ౧ హేతు, ౨ స్వరూపము, ౩ ఫలము ౪ అవధి అనువాని నెఱిఁగి వానిని హృదయమున ధారణచేయుము. ఈమూటిని నొక్కటిగా చేకొనుట జీవించు నరునికి అవధిలేని సుఖమగును. అనఁగా జీవన్ముక్తియొక్క విలక్షణానందమునకు హేతువగును.

౧. (౧) ఈలోకవిషయములందును పరలోకవిషయములందును అనిత్యత్వబుద్ధి దోషదృష్టి (వివేకము) వైరాగ్యమునకు హేతువగును.

(౨) జిహాస (విడుచుటకొఱకగు యిచ్ఛ) వైరాగ్యస్వరూపమగును.

(౩) విడిచినపిమ్మట యీభోగ్య (విషయ) ములందు కలుగు ఉపరతివైరాగ్యఫలము అగును.

(౪) అన్నిటికంటెను మేలయిన బ్రహ్మలోకమునుగూడ

తృణమువలె (తుచ్ఛముగా) చూచుట [అప్పుడు ఈలోక మొదలగువానిని తృణమువలె చూచుటయందు చెప్పవలసిన దేమి.] ఇది వైరాగ్యావధియగును

ఇవి విరాగహేతువు మొదలగునవియని యెఱుంగుము.

౨. (౧) గురుముఖముగా మహావాక్య ఉపదేశమును శాస్త్రవిచారమునగు రెండువిధముల శ్రవణాది (శ్రవణ, మనన, నిదిధ్యాసనమను) మూడును జ్ఞానమునకు హేతువు లగును.

(౨) మిథ్యనున్న (సకల అనాత్మవస్తువులను) తత్త్వమును (ప్రత్యగభిన్న బ్రహ్మమునున్న) వివేకించుట అనగా నిష్ప్రపంచ ఆత్మకంటె (తనకంటె) వేఱుకాని బ్రహ్మనిశ్చయము తత్త్వజ్ఞాన స్వరూపమగును.

(౩) ఇంకను గ్రంథి (ముడి) ఉదయముకాని అనగా కారణ (అవిద్య) కార్యము (జన్మాది) లతోఁగూడిన అన్యోన్యాధ్యాసరూపచిత్ జడగ్రంథియొక్క అత్యంత నివృత్తి (పరమానంద ప్రాప్తిరూపమోక్షము) తత్త్వజ్ఞానఫలమగును.

(౪) దేహమునందువలె అనగా (అజ్ఞానదశయందు) దేహమునందు ఆత్మబుద్ధిఉండునదివలె దాని (దేహమునందు ఆత్మజ్ఞాన) బాధకమయిన ఒకే (బ్రహ్మమునకభిన్నమయిన) ఆత్మయందు బుద్ధిగలిగెనేని అది తత్త్వజ్ఞానావధియగును.

౩. (౧) యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధారణ, ధ్యాన, సవికల్పసమాధి అను నెనిమిదియు ఉపరతికి హేతువులగును.

(౨) చిత్తనిరోధరూపయోగము (నిర్వికల్పసమాధి) ఉపరతియొక్క స్వరూపమగును.

(3) వ్యవహార విస్మృతి (మఱపు) ఉపరతియొక్క ఫలమగును.

(४) సుషుప్తివలె కలిగిన అది ఉపరతి అవధి (ఎల్ల) స్వరూపమగును.

౧. వైరాగ్యము జ్ఞానమునకు హేతువు. (౨) జ్ఞానము ఉపరతికి హేతువు. (3) ఉపరతి శాంతికి హేతువు. (४) శాంతి సుఖమునకు హేతువు.

౧. వైరాగ్యముచే వాసన నశించుచున్నది.

౨. జ్ఞానముచే అజ్ఞానము పొడగుచున్నది.

(3) ఉపరతిచే మనస్సు నశించుచున్నది. అనగా బ్రహ్మాభ్యాసఫలముచే రజోగుణతమోగుణములు తిరస్కరింపబడగా సత్వగుణ ఆవిర్భావము (బయలుపడుట) కలుగుచున్నది.

ఇట మనస్సను శబ్దముచే రజోగుణ తమోగుణములచే సత్వగుణముగల మనస్సుయొక్క స్థూలత్వము చేకొనఁబడుచున్నది. మనోనాశమను శబ్దముచే ముందు చెప్పిన మనస్సుస్థూలత్వనాశము చేకొనఁబడుచున్నది.

ఈవిధముగా వాసనాక్షయము, అజ్ఞానక్షయము, మనోనాశము అనుమూఁడున్ను సిద్ధింపగా మూఁడుదేహముల అభిమాన నివృత్తియయ్యెను.

ఇట యిది వివేకము:—

౧, స్థూలదేహాభిమానము నివర్తించుటచే సకలవాసనలును క్షయించుచున్నవి.

౨. సూక్ష్మదేహాభిమాననివృత్తిచే మనోనాశము కలుగుచున్నది.

(3) కారణదేహ నివృత్తిచే అజ్ఞాననాశము సిద్ధమగు

చున్నది. దీనిచే జ్ఞానికి వివేకబలముచేతనే వాసనాక్షయము మొదలగువాని సిద్ధి సహజముగా గలుగుచున్నది. అదియే మరల అభ్యాసబలముచే పెంపదగినదగును.

77. ఈవిధముగా నివృత్తిప్రాప్తిగలిగిన జ్ఞానికి జీవన్ముక్తి యొక్క విలక్షణానందముకొఱకు వాసనాక్షయమనోనాశముల విశేష అభ్యాసరూపకర్తవ్యమునుజెప్పి, యిప్పుడు ప్రవృత్తి యొక్క ప్రాప్తిగలజ్ఞానికి బయటివ్యవహారములందు దోషదృష్టి మిథ్యాత్వబుద్ధిచేఁ గనబడు దృఢవైరాగ్యముచే లోపల నిర్మోహముగా (అహంకార మమకార రూపమోహము లేక) నుండుట తగినదియనుటను నుపదేశించుటకొఱకు మోహ జిత్తుని కథను శ్రీగురువుగారు చెప్పుచున్నారు:-

ఒకరాజుయొక్కకుటుంబమంతయు (రాజు, రాణి, రాజ పుత్త్రుడు, పుత్త్రునిభార్య, దాసి అను వీరు) జ్ఞానము గల వారగుటచే మోహజిత్తులై (మోహమును జయించినవారై) యుండిరి అనునదియొక యుదాహరణము. ఈ మోహములేని మాట వినగానే కొంచెమైనను మోహముకలుగదు.

మోహజిత్తుకథ:-

ఒకజ్ఞానముగల రాజకులమంతయు, మోహమునుజయిం చినవారైయుండిరి. ఒకసమయమున నొకవనమందలి సింహము రాజనగరిజనులను ప్రతిదినమునువచ్చి చంపనారంభించెను. దానింజంపు నిమిత్తము అనేకులతో రాజకుమారుఁడు గుఱ్ఱము మీదనెక్కి యడవికి పోయెను. ఆ సింహము కంటఁబడగానే యందఱిని వెనుకవిడిచి రాజకుమారుడొక్కఁడే సింహమువెం టఁబోయెను. సాయంకాలమునకాసింహము మహారణ్యమున కరగెను. అప్పుడా రాజకుమారుఁడట గంగాసమీపముననుండిన

యొకయోగి యాశ్రమమునుజూచి సమీపమునకుఁబోయి యాయోగీశ్వరునికి సాష్టాంగ నమస్కారముచేసెను. వానిం జూచి యోగి నీవెవఁడవని యడుగ, రాజకుమారుఁడను మోహజిత్తనఁగా యోగి యాశ్చర్యపడెను. దానింజూచి రాజకుమారుఁడు మరల యోగీశ్వరా! నేను మాత్రము మోహజిత్తు కాను. నాకులమంతయు మోహజిత్తేయనిచెప్పెను: దానినివిని యోగీశ్వరుఁడు మిక్కిలి యాశ్చర్యముపడి రాజకుమారా! మీకులమంతయు మోహజిత్తను మాటనేనెట్లు తెలియుదు ననియడుగ, రాజకుమారుఁడు చెప్పుచున్నాడు:— ఎఱుపువర్ణముగల పండ్లఛాయగల నావస్త్రములను గుఱ్ఱము, నగలు మొదలగువానితో శస్త్రములను, తాము రాజనగరమునకు గొని పోయి పరీక్షింప వచ్చుననెను. అప్పుడా యోగి యట్లు సకల సామగ్రులను తీసికొని రాజనగరమునకుఁ బోయెను.

అట మొట్టమొదట దాసికి రాజకుమారుని సామగ్రులను జూపి

తే గీ॥ "రాజపుత్త్రుని వార్తయో రమణివినుము।
యేను సెప్పెదు నయ్యారె యంతక్రూర।
సింహ మొక్కటి నాతనిఁ జీల్చిచంపె।
శవమునున్నది నాయింట సత్యమిదియ॥"

యని యోగి చెప్పఁగా వినిన యాదాసి.—

తే గీ॥ "దాసినేగాను నతనికి నతడునాకు।
నేలికయుగాడు వినుము యో యోగితిలక।
సంద్రమును దాటుటయెగాని చక్కఁజూడ;
యోడవలని ఫలంబు వేఱొండుగలదె॥ "

అనిబదులుచెప్పెను. పిమ్మటనా యోగి "రాజాశ్రయముండుట

వల్ల నీదాసికి శోకము గలుగలేదు. వానిభార్యకు మోహ పూర్వక శోకము గలుగు"నని తలచియామెకు సర్వసామగ్రు లనుజూపి.—

తే గీ॥ "సుందరీనీదుప్రాణనాథుండు నొక్క
సింహాచేఁజంపఁబడెను ప్రసిద్ధముగను।
వింటివేమందు నాశౌర్యవీర వరుదు।
నినువిడిచెనెట్లు మనుదు నీవింకనకట!॥ "

అనిచెప్పెను. దానిని విన్నయా రాజకుమారుని పత్ని:—

తే గీ॥ తాపసశ్రేష్ఠ నీదగుతపము విడిచి
మమతచేనగు శోకంబు మానవేల।
అతనికిని నాకుగల్గు సంబంధమింత
కాలమీభవమునగాదె గలిగియుండె॥

అనియుత్తరమిచ్చెను. అదివిన్నయా యోగి " వేఱుతల్లికూతు రగు యీరాజకుమారుని భార్యకు తదితర రాజసుఖములుండు టంబట్టి మోహపూర్వక శోకము గలుగ లేదు" అయినను నాతనితల్లికి అవశ్యము మోహపూర్వక శోకము గలుగునని తలచివాని తల్లిదగ్గఱకుఁబోయి సకల సామగ్రులంజూపి:—

తే గీ॥ "తల్లిరోవినుమమ్మ నీతనయు నొడలు
నొక్క మృగరాజు చీల్చెను నక్కజముగ।
నశివ, యాతనిమరణంబు నాటఁగోలె।
యేమిసెప్పుదు నన్నంబునేనునొల్ల॥"

అనిచెప్పెను. దానివిన్నయా రాజ కొమరుని తల్లి:—

కం॥ విటువిశతంబులుగల యొక
ప్రకటితవృత్తమున నిశల బరగుఖగంబుల్।
పటుతరముగ వేఁగిన నం

ద్దొకటియు నిలకెచటికేని దోరుంగాదే॥

అనియుత్తరమిచ్చెను. అదివిన్నయాయోగి తల్లికి దనపతియుం టంబట్టి మోహపూర్వకశోకంబుకలుగ లేదనియు రాజుకన్నకో జరావస్థయందు యౌవనుఁడగు పుత్త్రుని మరణము అవశ్యము మోహపూర్వక శోకము గలిగించుననియు దలంచి రాజుదగ్గ ఱకుఁబోయి సకల సామ్రాజ్యములంజూపి:—

తే గీ॥ వినుము రాజేంద్ర దయకల్గ విన్నపంబు
చెప్పనోరాడదు మనంబు సృక్కుచున్న
దయ్య యో నీదునందను నతులమహిని
జంపె మృగరాజు నాయుంట శవముగలదు॥

అనిచెప్పెను. దానిని విన్నయారాజు:—

తే గీ॥ యోగివర! యేలనీయోగయొక్కువీడి
వ్యర్థముగ శోకసంతప్త హృదయుఁడయితి
పోదురెట్లయిన నొకవిధంబున తటాక
తీరమునసుండు పాంథులు తెరువుపట్టి॥

అనియుత్తరమిచ్చెను.

ఇట్లా యోగీశ్వరుఁడు "కశ్శోకః కో మోహః ఏకత్వమను పశ్యతః —ఐక్యమును నెడతెగక చూచుజ్ఞానికి అటశోకమెక్కడిది మోహమెక్కడిది" అనుఈశావాస్యశ్రుతికి ననుగుణముగ వారిశోక (ఆవరణము) మోహ, (విక్షేపము) లేకుండుటనను భవించి [దాసి రాజపుత్త్రునిభార్య రాజుభార్యఅనువారు ముందొక సమయమున రాజుచేతను రాజకుమారుని చేతను పరీక్షకొఱకు విడువఁబడినపుడు శోకములేక యుండిన విధముననే యుండిరి, అనుమాటనున్నవిని ఆతఁడు (దాసిమొదలగు వారి) మొదట పూర్వము కల్పింపబడిన దోషారోపమునువిడిచి] దీని

తిరిగెను. అతనిధర్మపత్ని "నేను కొంతకాలమువఱకు శైవవ్రత మొకటిగలిగియున్నాను. అదిముగియుచఱకు పురుషసంగము కూడదు. క్రొత్తగావచ్చినవారికి లేవనక భోజనాదుల నిచ్చుచుం డవలయును నను సంకల్పముగలదు. అనిచెప్పగాఁ బది విని అట్లే చేయుమని యంగీకరించెను. ఒకనాఁడామె భర్తయగు బ్రాహ్మ ణుఁడటకు బిక్షకువచ్చెను. అప్పుడాయిరువురకు పతిపత్నీత్వము లు స్మరణకువచ్చెను. అప్పుడాస్త్రీ భర్తకుపాకసామగ్రులనిచ్చి నగరమునకు బయటనుండు శివాలయమందుండుమని గుర్తించి పంపి తన వ్రతసమాప్తి తలంచిరాజునకు విందుచేయించి, రాత్రి యందు విషముకలిపిన అన్నముపెట్టి వానిఁజంపి వానియాభరణ వస్త్ర, ఆయుధములు, మొదలగు వానింధరియించి గుఱ్ఱమెక్కి శివాలయమునకు వచ్చెను. ఆటపాముచే కఱవఁబడిన భర్తను జూచి యాతనిభుజముమీఁద తీసికొని యేటిగట్టునకుపోయి యా ప్రేతమును అగ్గిపెట్టి చెత్తచేమలువేసి కాల్చి భూమియందు పూడ్చి స్నానముచేసెను. అప్పుడు నలుగురు దొంగలటకువచ్చి యున్నిసామగ్రులతో నామెను దేశాంతరము కొనిపోయిరి. ఒకేపురుషుని సంగమామెచే కోరఁబడినదను సంకేతముచే నా మెను వారొకవేశ్యకు విక్రయముచేసిరి. అప్పుడామె దైవయో గమువల్ల వేశ్యయాయెను. ఒకకాలమున నామెకొడుకు వ్యా పారమునకా నగరమునకు వచ్చెను. ఆమె యజమానురాలైన ముసలివేశ్యకు కావలసినధనమిచ్చి తనతల్లియగు వేశ్యదగ్గఱకుం బోయెను. అప్పుడామె స్తనములనుండి పాలుకారెను. దానిచే వాఁడామె తనతల్లియని నిశ్చయించి యామెకు సాష్టాంగనమ స్కారముచేసి తనయిల్లుచేరెను. పిమ్మట పుత్రుఁడు భర్తగా వచ్చుటఁజూచి యామెపశ్చాత్తాపముచే నేటిగట్టున వానిచేనిడు

అను శ్లోకమునకు అర్థము చెప్పుచున్నాఁడు:- ఉదార పురుషునికి ద్రవ్యముతృణము. ధనాశ లేనందున. శూరునికిమరణము తృణముతోసమానము. శరీరమందాశ లేనందున. విరక్తునకు భార్యతృణము. స్త్రీలయందిచ్ఛ లేనందున. నిస్పృహునకు (నిజస్వరూపమందు నిలకడగలజ్ఞానికి) జగము (సకల ప్రపంచరూపబంధము దానిచేఁ గుర్తింపఁబడిన మోక్షము) తృణమగును. లోకమంతటియందును కోరిక లేనందున, జ్ఞానిఅతిశయ నిస్పృహత్వమును సూచించుటకు వానిసీశ్లోకమందు నిస్పృహుఁడను పేరుచే చెప్పఁబడియున్నది.

80. ౧. శిష్యుఁడా! చెప్పఁబడిన యీవిధ గురూపదేశము విని ఆవిన్నయర్థమును గ్రంథవిచారపూర్వకముగా వేదాంత అద్వైతమందు తాత్పర్యనిశ్చయరూప శ్రవణమును చేసి,

౨. శ్రుతియనుసరించిన ప్రత్యక్షప్రమాణ ఉపజీవియైన (ఆశ్రితమైన) అనుమాన, ఉపమాన (దృష్టాంత) అర్థాపత్తి అనుపలబ్ధి ప్రమాణరూప జీవబ్రహ్మలభేదమును బాధించునవియు అభేదమును సాధించునవియు నయిన యుక్తులచేత అద్వైతబ్రహ్మచింతనరూపమననముచేసి,

౩. అనాత్మయందు మిథ్యాత్వబుద్ధిచేత అనాత్మాకారవృత్తుల తిరస్కారపూర్వకమయిన బ్రహ్మాభిన్న ఆత్మాకారవృత్తుల ప్రవాహరూప నిదిధ్యాసనము చేసి, అనగా మూర్తిమొదలగువాని ధ్యానమందు యెట్లు గుణ్యము మొదలగువాని నిరోధమును పోలఁ చిత్తనిరోధముకలుగుచున్నదో, యట్లు నిదిధ్యాసనమందుచిత్తనిరోధాపేక్ష లేదు. అయితే కథ వినుటయొక్క ప్రసంగముచేతను విచార ప్రసంగముచేతను ఆకలినిపోగొట్టు భోజనమువలె బుద్ధి వినోదమునకు హేతువగు నాట్యదర్శనమువలె

ఆసనము మొదలగువాని నియమములేక నడచియును తిరిగియును, స్వరూపాకారవృత్తియొక్క అభ్యాసమూలమున నిదిధ్యాసనము సిద్ధించుచున్నది. కావున ఆవిధ నిదిధ్యాసనముచేసి,

౮. సకల అనాత్మాకార వృత్తులును, సహజముగా నిరోధముకాగా బ్రహ్మాకారమగు చిత్తవృత్తియందు అహంప్రత్యయస్ఫురణరూప సాక్షాత్కారమేదియో దానిని సంపాదించి,

౯. అవిద్యారూపకారణాధ్యాసతో అహంకార మొదలగువాని అధ్యాసరూపబంధ పరమార్థ దృష్టిచేత మూడుకాలములు లేనినిశ్చయరూపమును వ్యవహారదృష్టిచేత మిథ్యాత్వము నిశ్చయరూపమును నగు ప్రతిపాదనము చేయఁబడినది.

ఇదియే సర్వానర్థ నివృత్తి యగుచున్నది. అర్థముచే పరమానందరూప బ్రహ్మ ఆవిర్భావమును బొందెను. కావున వానికి జీవన్ముక్తి సిద్ధించెను.

తత్త్వంపదవాచ్యార్థ, లక్ష్యార్థములఁ జెప్పుటతో
దానియైక్యమును నిరూపించుటయును,
నెనిమిదవ యుపదేశము
సమాప్తము.

---

# తొమ్మిదవ యుపదేశము.



శిష్యుని యనుభవమును జెప్పుట, ఇంటికి వెళ్లుట, సన్న్యాసముతో సౌగమును జేకొనుట అనువానినిచెప్పుటతో గ్రంథముయొక్క ఉపసంహారము.

81. ఇప్పుడు శిష్యుఁడు తన అనుభవమును గురువునొద్ద చెప్పువాఁడై, మొదట గురువుగారియొక్క దేశమును *100 అనువదించుచున్నాఁడు.

శిష్యుఁడు చెప్పుచున్నాడు.— స్వామీ! తాము నాకు "తత్త్వమసి" యను మహావాక్యము నుపదేశించితిరి. దానిచే నేనునాస్వరూపము నెఱింగితిని. దానియందేమాత్రము సంశయము లేదు.

82. ఇప్పుడుశిష్యుఁడు తనయనుభవమును జెప్పుచున్నాడు:-

౧. స్వామీ! నేను దేశకాలవస్తువులచే పరిచ్ఛేదములేనివాఁడనై యుండుటచే పూర్ణుఁడనై యున్నాను. (అనంతుఁడనై యున్నాను.)

౨. మిథ్యయైన ఉపాధిచేనయిన విలక్షణధర్మములు లేకయుండుటచే నిర్విశేషరూపమైయుండుటచే ఆకాశమువలె ఏకరసముగానున్నాను.

3. సజాతీయ (సమజాతికలిగియుండుటతోను) సంబంధము, విజాతీయ (అన్యజాతి గలిగియుండుటతోనున్న) సంబంధము స్వగత (తన అవయవములతోనున్న) సంబంధమను సంగమును

*100. ముందుచెప్పిన యర్థమును మరియొకచెప్పుట అనువదించుటయగును.

శే: దేహాదులందున్న అహంకారమున్ను ఇల్లు మొదలగువాని యందుండు మమతయునగు సంగమును.

౪. జన్మము, అస్తిత్వము (ముందు లేనిదై పిమ్మట యుండు నది) పెరుగుటలు, తిరుగుట, (మారుట) తరుగుట, నాశము, అను నారువికారములగు నివిలేని అసంగుడను నిర్వికార (కూటస్థుడు) నైయున్నాను.

౫. మఱియు సజాతీయ స్వగతభేదము లేనివాడనై యుండు టచేనైనను లేకపోయిన, అవిద్య, దానికార్యమగు నామరూప మను ఉపాధులచే కల్పింపబడిన ౧ జీవేశ్వరభేదము, ౨ జీవుల పరస్పరభేదము, 3 జీవజడముల భేదము, ౪ జడజడముల భేదము ౫ జడఈశ్వరభేదము, అను నైదుభేదరూపవస్తు పరిచ్ఛేదము లేనివాడనై యుండుటచేతనైనను నేను అఖండుడనై యున్నాను.

౬. మఱియు నేను నిజసుఖ (ఆనంద) రూపముగానున్నాను ఈవిచారము నాకు దృఢమయియున్నది.

83. శిష్యుడు పూర్వము జ్ఞానమందలి ఆశ కాలమున గురు వునొద్ద తనస్వరూపమునకు వేఱుగా యీశ్వరత్వమును అంగీక రించియుంటిని. పిమ్మట జ్ఞానకాలమున అతనియొద్ద తనస్వరూ పమునకభిన్నమగు బ్రహ్మత్వమును నిశ్చయము చేసియున్నాను. అనుటను నిప్పుడు ప్రకటన చేయుచున్నాడు:—

స్వామీ! తామొక్కడను పరిపూర్ణమయిన అద్వైత ఆత్మారాముడై యున్నారు. పిమ్మట ఆదియందును, అంతమం దును మధ్యను ఏకమైయున్నారు తామే సుఖస్వరూప బ్రహ్మ మైయున్నారు.

84. ౧. స్వామీ! మునుపు అజ్ఞానదశయందు నాకీలోక

వ్యవహారముకొఱకు, కృషి, వాణిజ్యము మొదలగునవి చేయవలసియుండెను.

౨. లేక పరలోకముకొఱకు సకామకర్మము సకామ ఉపాసన మొదలగునవియుఁ జేయవలసియుండెడివి.

౩ చిత్తశుద్ధి యేకాగ్రతల కొఱకు నిష్కామకర్మము నిష్కామ ఉపాసనయునగు కర్తవ్యముండెడిది.

౪. వేదాంతశ్రవణ మొదలగువాని యధికారముకొఱకు వివేకము వైరాగ్యము మొదలగు సాధనసమూహము చేయవలసియుండెడిది.

౫. అపరోక్ష జ్ఞానోత్పత్తికొఱకు గురుముఖమూలమున తత్త్వమసి మొదలగు మహావాక్యముల అర్థోపదేశరూప అంగి (సార్థక) శ్రవణము చేయవలసియుండెను.

౬. సంశయ విపరీతభావనరూప జ్ఞాన అదృఢత్వమునకు హేతువయినదోషముల నివృత్తికొఱకు శ్రవణమనన నిదిధ్యాసనములు చేయవలసియుండెను.

౭. తత్పదార్థమునందు పరోక్షత్వ భ్రాంతిని త్వంపద అర్థమునందు పరిచ్ఛిన్నత్వపు భ్రాంతిని నివృత్తిచేయు నిమిత్తము "బ్రహ్మము నేను, నేను బ్రహ్మము" అనునదైన ఓతప్రోత భావము (వ్యధికారము) చేయవలసియుండెను.

౮. మోక్షముకొఱకు ముందు చెప్పిన సాధనములచే దృఢ అపరోక్షజ్ఞానమును సంపాదించుట చేయవలసియుండెను.

ఆ యన్నికృత్యములును నిపుడు దృఢ అపరోక్షజ్ఞానము సిద్ధిబొందగా చేయఁబడినవాయెను.

కోరినయూరును పోయిచేరిన పథికునకు (త్రోవఁబోవు వాడు) త్రోవయందున్న ననేకనడచుట మొదలగు ప్రయత్న

రూపకర్తవ్యముండినది లేదు. అట్లే నాకును జ్ఞానప్రాప్తిచే నీ లోకపరలోకములయందిచ్ఛాభంగముకాగా సకలసాధనముల పూర్ణత్వమును ముక్తియు సిద్ధించెను. కావున మోక్షముకొఱకైనను జ్ఞానముకొఱకైనను జేయవలసిన దొక్కటియులేదు.

శాస్త్రవిధి నిషేధరూప ఆజ్ఞచే నేసాధనము చేయఁబడు చున్నదో, యది కర్తవ్యమనఁబడుచున్నది.

విధి నిషేధముచు చేకొనుట లేక తనయిచ్ఛచే నే వేదాంత విచారము మొదలగు సాధనములు చేయుబడుచున్నవో యవి కర్తవ్యముకాదు. కావున

ఇప్పుడు విధినిషేధరూప ఆజ్ఞ యొక్క అంగీకారము లేక తన యిచ్ఛచే బ్రహ్మవిచారము మొదలగు శాస్త్రముల చెప్పఁబడినవే యాచరణ (నడవడు) లను నేను జేయుదునో, యవియు కర్తవ్యములుకావు. కావున నేను వేనిని జేయవలసియుండెనో, యవియన్నియును జేయఁబడెను. దీనిచే నేను కృతకృత్యుఁడనైతిని.

పూర్వము, ౧. ఐహిక (ఈలోక) సుఖము, ౨ పారలౌకికసుఖము, ౩. లేక చిత్తశుద్ధి, ౪. లేక ఏకాగ్రత అర్థము ౫. లేక దృఢ అపరోక్షజ్ఞాన అర్థము. ౬. సంచిత ఆగామి కర్మము. జన్మ మొదలగు కార్యములతో అవిద్యనివృత్తియు పరమానందరూప బ్రహ్మము యొక్క ప్రాప్తియునగు అర్థము. అను నివి నాకు పొందవలసినవియైయుండెను. అవన్నియు నిప్పుడు జ్ఞానప్రాప్తిచేఁ బొందబడినవ యెను. కావున నిప్పుడు నాకిష్టమయిన యూరునుజేరిన పురుషునివలె బొందవలసిన దేదియు లేదు దీనిచేతనే నేను ప్రాప్తప్రాప్యుఁడ (కృతార్థుఁడ) నయితిని.

కావున తమదయచే నిప్పుడు నాకొకసాధనమును చేయ వలసినదిలేదు. ఏక దేవతారూపముచే నయినను లేక భగవంతుని ప్రక్కలయందుండువారి రూపములుచేనైనను, లేక నిత్యప్రాప్తమగు బ్రహ్మరూపముచేనైనను, లేక వేరురూపముచేనైనను ఒక్కటియు కావలసినదిలేదు అది "విషయములచే నే తృప్తికలుగుచున్నదో, యదిసాంకుశమగును. (అడ్డుగలదగును) ఈ అపరోక్షజ్ఞానముచేగలిగిన తృప్తినిరంకుశమగును (అడ్డులేనిదగును) కావున నేదిచేయతగినదై యుండినదో, యదిచేయబడినది. ఏది పొందదగినదిగా నుండినదో యదిపొందఁబడినది. అని యిట్లు జ్ఞాని తృప్తిని పొందుచున్నాఁడు. (౧) వీనికి (జ్ఞానికి) పూర్వము (అజ్ఞానకాలమందు) ఈ లోకపరలోకసంబంధమైన భోగములసమూహము సిద్ధించుటకై ముక్తిసిద్ధించుటకును బహు కృత్యములు (కర్తవ్యములు) నుండెను. అవన్నియు నిప్పుడు (జ్ఞానముదయించిన పిమ్మట) చేయఁబడినవి" (౨)అనునదియగును.

౮౫. ముందుచెప్పిన ప్రకారము కృతకృత్యత్వముచేతను, ప్రాప్తప్రాప్యత్వముచేతను తృప్తుడైన విద్వాంసుఁడైనశిష్యుఁడు తన మనసుచే నెట్లు (పైజెప్పిన విధముచే) మతించుచున్నాడో అట్లే గురువునొద్ద మాటలమూలమున నివేదించుచున్నాడు.

౧. దేవా! నేను తన ఆత్మను *101 పేరు, జాతి మొదలగు వానిని నెఱుఁగుటవలె అనాయాసముగా నెప్పుడును అప

*101 అజ్ఞానియగు పురుషుఁడు దృఢముగా నభ్యసింపబడిన తన శరీరము యొక్క పేరు, జాతి మొదలగువానిని విచారములేక యెఱుఁగుచున్నాఁడు. స్వప్నమందును మఱచుటలేదు. దానివలె దేహమందు ఆత్మజ్ఞానమును బాధించి నాకు ఆత్మయందు దృఢ అపరోక్షజ్ఞానము కలది అనునది యర్థమగును. ఇది జ్ఞాని అవధి చెప్పఁబడినది.

క్షోభముగా నెఱుఁగుచున్నాను. గావున నాజ్ఞానముచే నేను కృతార్థుఁడనై తిని. ధన్యుఁడనై తిని.

౨. సార్వభౌముఁడు మొదలు హిరణ్యగర్భరూప బ్రహ్మ పర్యంతముగల సంసారసుఖ మేదియో యది దేనిలేశ (ఆభాస) ముగానున్నదో యా నిత్యబ్రహ్మానందము నాకు బహిరంగ ముగా దెలియుచున్నది. గావున ఆ బ్రహ్మానందపు చక్కని స్ఫురణచేత నేను ధన్యుఁడనై తిని.

౩. సంసారసంబంధమైన దుఃఖమును నేనిప్పుడు చూడనం దున ఆ సంసారదుఃఖ దర్శనము నాకు లేనందున నేనుధన్యుఁడ నై యున్నాను.

౪. పర్వతగుహాయందున్న బహుకాలపు చీకటి దండముచే గొట్టుట మొదలగు కోటిప్రయత్నములచే పరుగెత్తుటలేదు. అయినను దీపముండిన తక్షణమే పరుగిడుచున్నది. అట్లు ఆత్మ యొక్క అజ్ఞానము, కర్మ, ఉపాసన మొదలగు కోటియుపాయ ములచేతను బోవుటలేదు. అయినను "సకల జగమున్ను నేనును బ్రహ్మము" అను నాకారముగల దృఢ అపరోక్షజ్ఞానముచే తక్షణమే పరుగెత్తును.

ఆ యజ్ఞాన (నాశము) నాకు జ్ఞానముచే సిద్ధించినది. కావున నా యజ్ఞానముపోగా నేను ధన్యుఁడనై తిని.

౫. విధినిషేధరూపశాస్త్ర వచనముచే గలిగిన విహిత (శుభ) కర్మము లపుణ్యరూపాక అపూర్వము మూలమునస్వర్గము మొదలగు నిష్టఫల ప్రాప్తియొక్క సంభావన (జరుగుట)రూప గుణబుద్ధియు నిషిద్ధకర్మమందు పాపరూప అపూర్వము మూల మున నరకము మొదలగు అనిష్టఫలప్రాప్తియొక్క సంభావనా రూపదోషబుద్ధియు నయిన యీరెండు బుద్ధులచేతను విహిత

కర్మమున ప్రవర్తించియు నిషిద్ధకర్మము నుండి నివృత్తిపొందు టయు నయిన ఏక్రియగలుగు చున్నదో అది కర్తవ్య మనఁబడు చున్నది. తనయిచ్ఛచే నేలౌకిక వైదికకర్మలు చేయఁబడుచున్నవో అవి కర్తవ్యములు కావు. ముందు జెప్పిన విధమగు కర్తవ్యము ముందు (84-వ ప్రసంగమందు) జెప్పఁబడిన విధమున నాకునివృత్తియైనందున కర్తవ్యము తీరినందున నేను ధన్యుడనైతిని.

౬. ఎట్లు పృథివియందంతయుఁగల వాపీకూప తటాకాదులందు స్నానపానాది ప్రయోజనము గలుగుచున్నదో అంత ప్రయోజనమున్ను శుద్ధోదక (మధురజల) సముద్రమునందు సిద్ధించుచున్నది. ఎట్లు పదిబంగారునాణెములు మొదలు ఏబది నాణెములవరకు దొరకుటవలన పైగాపైగాగలుగు ఆనందము అంతయు నూఱునాణెములు దొరకుటవలన సిద్ధించుచున్నదో అట్లే అనేకవిధసకామ కర్మఉపాసనాది సాధనములచేఁ బొందఁబడు స్వర్గవైకుంఠము బ్రహ్మలోకము మొదలగు ప్రయోజనముల పొందుటచేతనే తారతమ్య సుఖములు కలుగుచున్నవో అవియన్నియు బ్రహ్మానంద ప్రతిబింబములై యుండుట వలన దానియందు అణగియుండునవి యగును. కావున ఆబ్రహ్మానందము పరమ ప్రయోజనమగును. అది దేనిచే నాకుతనస్వరూపముగా బ్రహ్మానందమును నెఱుగుటచేతనే సిద్ధించినదో దానిచే నాబ్రహ్మానందరూపప్రాప్తియొక్క సిద్ధిచే నేనుధన్యుఁడనయితిని

౭. రాజు మొదలు బ్రహ్మలోక పర్యంతము గల విషయములచే కలుగు తృప్తితనకంటె అధిక మయిన వేఱువిషయ ఇచ్ఛారూప అంకురముతో గూడినదిగా నుండుటచే సాంకుర తృప్తియగును. ఆనందరూప బ్రహ్మమున కభిన్నమయిన ఆత్మ జ్ఞానముచేఁ గలుగు తృప్తి ముందుచెప్పిన అంకురము లేనిదై

యుండుటచే నదినిరంకుశ తృప్తియగును. అందుచే నాతృప్తిఉప మానము లేనిదగును. కావున నానిరుపమాన నిరంకుశ తృప్తి లాభముచే నేను అధికముకు ధన్యుండనై యున్నాను.

౮. జ్ఞానమునకు హేతువయిన నిష్కామ కర్మచే కలుగు సంస్కార రూపమనాపుణ్యము దేనిచే దృఢముగా ఫలించి యున్నదో అందుచేనది అతిశయ మగును.

౯. ఈపుణ్యసంబంధముచే నేనందఱికంటెను శ్రేష్ఠుండనై యున్నాను.

౧౦. ఈవేదాంత శాస్త్రమున్ను గురువున్ను జ్ఞానమున్ను నిరతిశయమగును.

౧౧. జ్ఞానముచే బయలు వడిన బ్రహ్మానందము నిరవధి (ఎల్లలేనిది) యగును.

86. ఇక్కడను శ్రుతియందు చెప్పిన హృదయగ్రంథి సంశయ గ్రంథి కర్మగ్రంథి అను భేదములచే మూండు విధగ్రంథులుగలవు వానికి జ్ఞానముచే నివృత్తిని శిష్యుండు చెప్పుచున్నాండు.

౧. దేవా! ఎప్పుడు (ప్రతిక్షణమందు) నేను పరబ్రహ్మదర్శన మందు సమర్థుండైతినో అప్పుడు నాబుద్ధినాత్మల తాదాత్మ్య అధ్యాసరూప హృదయగ్రంథి (చిజ్జడగ్రంథియు దానిజ్ఞానమగు విపరీత భావనయును) భేదింప బడినవి. (నాశముచేయంబడినవి)

బుద్ధి (అహంకార) చిదాత్మల తాదాత్మ్య అధ్యాస రూపహృదయ గ్రంథియేదిదో యది వేఱుకార్యరూపహృద యగ్రంథులకు కారణమగును. అది దేనిచేతీరినదో దానిచేకార్య రూప హృదయగ్రంథియు తీరినది "నాకిదికలుగు గాత, నాకిది కలుగంగాక" యనుఇచ్ఛావృత్తియేదిదో యదిశ్రుతి యందుం జెప్పంబడిన "కామ" శబ్దవాచ్యమగును దానికి (ఇచ్ఛావృత్తికి)

*102 ఆశ, తృష్ణ, కామన, వాంఛ, లోభము, దీనత్వము, మొదలగు భేదములు గలవు. ఆ ఇచ్ఛావృత్తులు కార్యరూప హృదయగ్రంథులగును. అవియు నాశమయినవి, కావున ఇప్పుడు అహంకారధర్మమగు కామ మొదలగు వృత్తులుదయమయినవి వాటియందు చిదాత్మను ప్రవేశింపక (వానిని చిదాత్మధర్మములుగా చేకొనక) కామము మొదలగు ధర్మముల అహంకారమును చిదాత్మకు వేఱగు మిథ్యారూప మనఁదెలిసి ప్రారబ్ధదోషముచే నేను కోటివస్తువులను ఇచ్ఛించుచున్నాను ఇచ్ఛించినను నాకు బాధకము లేదు.

౨. నా సకల సంశయములును దీరినవి "ఇదిరజ్జువా లేక సర్పమా అను రెండుపక్షముల (యథార్థ అయథార్థమను రెండు పక్షముల విషయముచేయు)జ్ఞానము సంశయమనఁబడుచున్నది. ఆసంశయము ఆత్మయందుండునది అనాత్మయందుండునది అను భేదములచే రెండు విధములు. వానియందు అనాత్మయందుండు సంశయముఉండును లేకపోవును. దానినివృత్తి ఆవశ్యము లేదు.

౧. ఆత్మయందుండు సంశయమేదియో యది ౧ ప్రమాణగత సంశయము ౨ ప్రమేయగత సంశయము అనుభేదములచే

*102 పరులచే రాబోవుకాలమునఁ బొందదగిన వస్తువుయొక్క యిచ్ఛయేదియో యది ఆశయగును. పొందినయర్థము వృద్ధిపొందవలెనను ఇచ్ఛతృష్ణయగును. పొందిన యర్థమును అనుభవింపవలెనను యిచ్ఛ కామమగును. దీనినే కామమందురు. వర్తమానకాలమున పొందదగిన యర్థమునందు యిచ్ఛయేదియో యది వాంఛయగును. దొరికిన ధనము మొదలగువానిని సెలవుసేయక యుండవలెనను ఇచ్ఛలోభపర్యాయము కృపణత్వముఅగును. ఇతరులచే వర్తమానకాలమందు పొందదగని వస్తువును పొందవలయునను ఇచ్ఛదీనత్వము. దీనినే లోభమనియు చెప్పుదురు. ఇవన్నియు ఒకేయిచ్ఛయొక్క భేదములగును.

రెండువిధములు.

౧. ఉపనిషద్రూపవేదాంత వాక్యము భేదమును ప్రతి పాదించునదా?

౨. లేక అద్వైతమును ప్రతిపాదించునదా?

3. లేక వేఱుఅర్థము చెప్పునదా? అను ఆకారము గల ఆఱులింగ రూపయుక్తులచే వేదాంత తాత్పర్యము నిశ్చయ రూపశ్రవణము చేయుటకు పూర్వమే ఏయే సంశయములుగు చున్నదో యది ప్రమాణగత సంశయము.

౨. వేదాంతరూప ప్రమాణముచే తెలియదగిన మోక్షము మొదలగు పదార్థము లేవిగలవో యవియన్నియు ప్రమేయము నంబడుచున్నవి. వానిస్వరూపమునందు నే సంశయముగలదో యది ప్రమేయగత సంశయమనబడుచున్నది. ఆ ప్రమేయగత సంశయము విషయభేదముచే ననేక విధములు.

(అ) "సర్వదుఃఖనివృత్తియు పరమానందరూప బ్రహ్మ ప్రాప్తియునగు:-

[౧] ఇదియే *103. మోక్షమగునా?

[౨] లేక *104. తక్కిన మూడు విధదుఃఖములనాశమా?

[౩] లేక *105. ఇరువదొక్కటి దుఃఖములనాశమా?

[౪] లేక *106. పంచక్లేశములనాశమా?

[౫] లేక *107. స్వర్గవైకుంఠ మొదలగు విషయసుఖపు లాభమోక్షమా?

ఈ విధముగా మోక్షస్వరూపమందు సంశయములు

---

*103. ఇది సిద్ధాంతపక్షము. *104 ఇదిసాంఖ్యమతము. *105 ఇది న్యాయమతము. *106 ఇదియోగమతము. *107 ఇదికర్మిష్ఠుల లేకఉపాసకుల మతము.

గలవు. అవిప్రయోజనరూప ప్రమేయగత సంశయములగును.

(ఆ) సకల అనర్థముల నివృత్తియు పరమానందప్రాప్తియు మోక్షమనుకొన్న:—

[౧] ఆమోక్షమునకు సాక్షాత్తుసాధనము *108 కర్మమా?

[౨] లేక *109 ఉపాసనయా?

[౩] లేక *110 కర్మఉపాసనలతోఁగూడిన జ్ఞానమా?

[౪] లేక *111 కేవల జ్ఞానమా?

[౫] కేవలజ్ఞానమన్న *112 భేదజ్ఞానమా లేక *113 అభేద జ్ఞానమా?

అను నీమొదలగు సంశయములు మోక్షసాధనమందున్నవి. అవిసాధనరూప ప్రమేయగత సంశయములగును.

(ఇ) మోక్షముయొక్క సాధనము అభేదజ్ఞానమేయనిన

[౧] ఆయపరోక్షజ్ఞానముఖ్య (సాక్షాత్తు) అంతరంగసాధనము కర్మోపాసనలా?

లేకవివేకము మొదలగు నాలుగా? లేక శ్రవణాదులు మూఁడా? లేకపదార్థశోధనయా? లేకమహావాక్యఉపదేశమా?

[౨] జ్ఞానబహిరంగసాధనము శ్రవణాదులా? లేక వివేకము మొదలగునవియా? లేక కర్మమొదలగునవియా?

ఇవి మొదలగు సర్వసంశయములు జ్ఞానసాధన నిర్ణయమందున్నవి. అవిసాధనరూప ప్రమేయగత సంశయమగును.

(ఈ) అపరోక్షజ్ఞానముఖ్య అంతరంగసాధనము మహావాక్య

---

*108 ఇదిమీమాంసకుల (కర్మిష్ఠుల) యొక్కమతము. *109 ఇది ఉపాసకులమతము. *110 ఇదిసముచ్చయవాదులమతము. *111 ఇదిసాంఖ్యులు నైయాయికులు మొదలగువారిమతము. *112 ఇదిసాంఖ్యులు మొదలగుభేదవాదులమతము. *113 ఇదిసిద్ధాంతపక్షము.

ఉపదేశమనియు వివేకాది యెనిమిదిని అణచిన (పరంపర) అంతరంగసాధనమనియు, యజ్ఞాదికర్మలు బహిరంగసాధనము లనియు ననిన,

[౧] అజ్ఞానవిషయము*114 భేదమా? లేక *115 అభేదమా?

[౨] అభేదమనిన ఆత్మకును బ్రహ్మమునకును *116 అభేదమా? లేక అంతఃకరణ విశిష్టచేతనరూపజీవునకును విరాట్టు లేక హిరణ్యగర్భుఁడు లేక అంతర్యామియను ఈశ్వరునకును *117 అభేదమా?

ఇవిమొదలగు సంశయములు జ్ఞానముయొక్క విషయమందున్నవి. అవియు ప్రమేయగత సంశయములగును.

(ఉ) ఆత్మకును బ్రహ్మమునకును గల అభేదమే జ్ఞానవిషయమన్నచో,

[౧] ముందుచెప్పిన ఆత్మస్థూలదేహముకంటె †118 భిన్నమా? లేక †119 అభిన్నమా?

[౨] భిన్నమయినను నది †120 జడమా? లేక †121 చేతనమా? లేక †122 జడచేతనములు రెండునా?

[3] చేతనమనినను అది †123 కర్తాభోక్తయా? లేక †124 అకర్తా అభోక్తయా?

---

*114 ఇది సాంఖ్యులు నైయ్యాయికులు మొదలగు భేదవాదులమతము.
*115 ఇది వేదాంతసిద్ధాంతము *116 ఇది ఉపనిషత్తుల సిద్ధాంతము.
*117 ఇది అహంగ్రహ ఉపాసకులమతము.

†118 ఇదిసకల ఆస్తికులమతము. †119 ఇది చార్వాకలోకాయతుల (దేహాత్మవాదుల) మతము. †120 ఇది నైయ్యాయిక ప్రభాకరులమతము. †121 ఇది సిద్ధాంతపక్షమును సాంఖ్యమతమును యోగమతమును నగును. †122 ఇదిభట్టులమతము. †123 ఇదిన్యాయమతము. †124 ఇదిసాంఖ్య

[౪] అకర్తా అభోక్తాయుంటేను అదిదేహాదుల అహంకార మమకారరూప †125 సంగముగలదియా? లేక † 26 అసంగమా?

[౫] అసంగమైనను అది †127 అణుపరిమాణమా? (రోమముయొక్క వేయింటనొకభాగసూక్ష్మమా?) లేక †128 మధ్యమపరిమాణమా? (దేహమంతయా?) లేక †129 మహత్పరిమాణమా (పరిపూర్ణమా?)

[౬] మహత్పరిమాణము గలదయినచో, దానికి తత్పదార్థముతో †130 భేదమున్నదా? లేక †131 అభేదమున్నదా? ఇవిమొదలగు సంశయములు త్వంపదార్థమందుగలవు. అవియు ప్రమేయగత సంశయములగును.

(ఊ) ముందుచెప్పిన ఆత్మతత్పదఅర్థముతో అభిన్నమయినను

[౧] ఆయాత్మ తత్పదవాచ్యార్థరూప †132 ఈశ్వరునికన్న అభిన్నమా? లేక యా ఈశ్వరభావమునకు అధిష్ఠానమయిన తత్పదలక్ష్యార్థరూప †133 శుద్ధబ్రహ్మము తో అభిన్నమా?

(౨) లక్ష్యార్థముతో అభిన్నమయినను, జగమునకుకారణము †134 ప్రధానాదులా? లేక తత్పదవాచ్యార్థమయిన †135 ఈశ్వరుడా?

[౩] ఈశ్వరుఁడైనను ఆ యీశ్వరుఁడేక దేశమందుండు

---

వేదాంతమతము. †125 ఇది ఉపాసకులు మొదలగువారిమతము. †126 ఇది సిద్ధాంతిసాంఖ్యులమతము. †127 ఇది కొన్ని నైయ్యాయిక ఉపాసకులమతము. †128 ఇదినవీన నైయ్యాయికుల దిగంబరులమతము. †129 ఇది సిద్ధాంతము, సాంఖ్యము, యోగము, న్యాయము, వైశేషికము, ప్రభాకరము, భట్టము అవవానిమతము †130 ఇది నైయ్యాయికులు మొదలగు భేదవాదులమతము. †131 ఇదిసిద్ధాంతపక్షము, †132 ఇది అహంగ్రహ ఉపాసకులమతము. †133 ఇదిసిద్ధాంతపక్షము. †134 ఇదిసాంఖ్యులు మొదలగువారిమతము. †135 ఇది

వాఁడగుటచే †136 పరిచ్ఛిన్నుఁడా? లేక †137 వ్యాపకుఁడా?

[౮] వ్యాపకుఁడైనను గోలోకమొదలగు చోట్ల †138 లీలావిగ్రహముగొనినవాఁడై వ్యాపకుఁడా? లేక †139 ఏకరసవ్యాపకుఁడా?

[౯] ఏకరసవ్యాపకుఁడైనను ఆ జగమునకు †140 ఉపాదానకారణుడా?

లేక నిమిత్త †141 కారణుఁడా? లేక సాలెపురుగువలె స్వప్నమునకు హేతువైన సాక్షివలెను †142 అభిన్ననిమిత్తోపాదానకారణుఁడా?

(౬) అభిన్ననిమిత్తోపాదానకారణుఁడయినను:—

అతఁడు జీవులకర్మాపేక్షలేనివాఁడై సృష్టిని †143 చేయువాఁడై యుండుటచే విషమముగాఁజేయుట మొదలగు దోషముతోఁగూడినవాఁడా?

లేక కర్మయొక్క అపేక్షగలవాఁడై యుండుటచే, సృష్టి

---

వేదాంతులు నైయాయికులమతము †136 ఇదికొన్ని ఉపాసకులమతము. †137 న్యాయయోగ వేదాంతులమతము. †138 ఇది వల్లభాచార్యులమతము. వల్లభమతమందు ఈశ్వరుఁడు (అంతర్యామి) నానాగాను జీవునివలెనే పొదియు (ఉత్పత్తియు) పరిచ్ఛిన్న (అణురూపు)ముగా కొనియున్నారు. అయినను ఇటు ఈశ్వరశబ్దముచే, వారుచేకొనియుండు పరబ్రహ్మము (పూర్ణపురుషోత్తముఁడు) చేకొనఁబడును.

†139 ఇది సిద్ధాంతపక్షము.

†140 ఇదియొక ఉపాసకులమతము.

†141 ఇదిన్యాయము యోగము మొదలగువానిమతము.

†142 ఇదిసిద్ధాంతపక్షమున్ను వల్లభుఁడు మొదలగువారిమతము.

†143 ఇదిభక్తజనులమతము.

యొక్క †144 కర్తయగుటచే, విషమత్వము, దయాళుత్వము లేమిరూపదోషములు లేనివాఁడై యున్నాఁడా?

[౭] కర్మాపేక్షరూపకర్తగానుండుటచే విషమముగాచేయు దోషము లేనివాఁడైనను

ఆయీశ్వరుఁడు పరమార్థముగా మాయాశక్తి దాని ధర్మములగు సర్వజ్ఞత్వము మొదలగునవి కర్మయగు సృష్టి మొదలగునవి యను †145 కల్పనలతో గూడినవాఁడా?

లేక †146 ఆకల్పనలులేనివాఁడా?

[౮] అవిలేనివాఁడైనను అతఁడు ముందుచెప్పిన ఆత్మకంటె †147 భిన్నుఁడా? లేక †148 అభిన్నుఁడా? ఇవి మొదలగు సంశయములు తత్పదార్థమందున్నవి. అవియు ప్రమేయగత సంశయములగును.

(౨) ఏతత్పదార్థలక్ష్యార్థమగు శుద్ధబ్రహ్మము త్వంపద లక్ష్యార్థమగు ఆత్మతో అభిన్నమయినను,

[౧] ఆబ్రహ్మాత్మయొక్క ఏకత్వమేదియో యది †149 మోక్షకాలమందుండునదియా? లేక †150 ఎప్పుడును నుండునదియా?

[౨] ఎప్పుడును ఏకత్వముగలదైనను ఆ యేకత్వము సచ్చిదానందరూప †151 ఐశ్వర్యములేనిదియా? లేక †152 ఐశ్వర్యముతో గూడినదా?

---

†144 ఇది వేదాంతులమతము. †145 ఇది ఉపాసకులు మొదలగువారిమతము. †146 ఇది సిద్ధాంతపక్షమున్ను, యోగమతమునగును. †147 ఇది యోగమతము. †148 ఇది సిద్ధాంతపక్షము. †149 ఇది భక్తప్రపంచ (ప్రాచీనవృత్తికారుల) మతము. †150 ఇది సిద్ధాంతపక్షము. †151 ఈ పక్షము ఏకభేదవాదికిన్ని ఇష్టముగలదికాదు. †152 ఈపక్షము సకల అభేదవాదు (వైదికులు) లకు

[౩] సచ్చిదానందైశ్వర్యముతోఁగూడినదైనను ఆసచ్చిదానందము మొదలగునవి †153 గుణరూపములా: లేక బ్రహ్మాత్మ యొక్క †154 స్వరూపమా?

[౪] స్వరూపమయినను వానికొకదానికొకటి భేదము చెప్పుటకలుగుచున్నది. ఆభేదము వాస్తవమా? లేక కల్పితమా? ఇవిమొదలగు సంశయములు తత్పదార్థమున కభిన్నమయిన త్వంపదార్థమందున్నవి. అవియు ప్రమేయగతసంశయములగును

పైఁజెప్పిన వానిచే శ్రవణమననములచే క్రమముగా నివృత్తిబొందదగినవగు ప్రమాణగత ప్రమేయగత సంశయము లేవితెరా యవియన్నియు బ్రహ్మసాక్షాత్కారము కాగానే క్షీణించుచున్నవి.

ముందుచెప్పిన రెండువిధసంశయములును శ్రవణమననములచే నశించు జ్ఞానముచే వానినివృత్తి సంభవింపకపోయినను శ్రవణ మననములచే నివృత్తిచెందిన సంశయములకు అవిద్యారూప కారణ ముండుటవలన మరల యవి ఉత్పత్తి యగుచున్నవి. జ్ఞానము కలిగినపిమ్మట అవిద్యనాశమగుటవలన ఆసంశయములు మరల ఉత్పత్తి యగుటలేదు. కావున జ్ఞానము చేతను సంశయముల నివృత్తి చెప్పుట సంభవించు చున్నది. సంశయ నివృత్తియందు ఉపయోగమగు ననేక శాస్త్రముల వాక్యములగు ప్రమాణములును ఉక్తులును గలవు.

నాజన్మ మొదలగు దుఃఖములకు కారణమగు కర్మ లేవియో యవియన్నియు జ్ఞానాగ్నిచే నష్టమయినవి.

ఇటయిదితాత్పర్యము.—(౧) సంచితము (౨) ప్రారబ్ధము

నిష్టమయినది. †153 ఇది నైయాయికులు మొదలగు ఆత్మజడత్వవాదులమతము †154 ఇది సిద్ధాంతి మొదలగు వారిమతము.

(3) ఆగామి యనుభేదములచేఁ కర్మములు మూడువిధములు.

[౧] వ్యవసాయముచేయు వాఁడు మొదటిసంవత్సరమున పండిన ధాన్యముల పాత్రల చేర్చి పెట్టును.

[౨] దానినుండియాహారముకొఱకు కొంచెము ధాన్యము తీసి కుదిటియందుంచును. దానినుండి యెత్తి భుజించుటకును చేలయందు విత్తుటకు నుపయోగించును.

[3] మరలచేనియందుపండిన ధాన్యముల గరిసెలయందుఁ బోయును.

[౧] అట్లే జన్మాంతరముల ఆగామి కర్మములేవియో యవి అంతఃకరణ ఉపహిత సాక్షియందుండు అజ్ఞాన ఆవరణ శక్తిరూప గరిసెలయందున్నవి. ఆకర్మములు సంచితమనఁబడు చున్నవి.

[౨] వానినుండి సమయభేదములచే పరిపక్వమయిన నొక కర్మ ఈశ్వరేచ్ఛ వలన నీవర్తమాన శరీరమారంభమై సుఖ దుఃఖములచే భోగరూప ఫలము నిచ్చుచున్నది. అజ్ఞానవిక్షేప శక్తిరూప ఆశ్రయమందున్నది. ఆకర్మము ప్రారబ్ధమనఁ బడు చున్నది.

[3] ప్రారబ్ధకర్మచే నయిన భోగమును ననుభవించుచు వర్తమాన భావికాలముల భోగముల సంపాదించు నిమిత్తము ఈవర్తమానదేహమునందు ఏకర్మముకలుగుచున్నదో అదియు గాక ప్రారబ్ధ రూపసంస్కారము లేక రాగద్వేషాది శుభాశు భవాసనారూప సంస్కారము దేనిఉత్పత్తియందు నిమిత్తమో

(అ) భ్రమజతాదాత్మ్యము (అహంకారమునకు సాక్షితో నుండు తాదాత్మ్యము.

(ఆ) సహజతాదాత్మ్యము (అహంకారమునకుచిదాభాసుని తోడి తాదాత్మ్యము.

(ఇ) కర్మజతాదాత్మ్యము (అహంకారమునకు స్థూలదేహముతో గల తాదాత్మ్యము) అను భేదములచే అహంకార తాదాత్మ్యములు మూఁడువిధములు. వానియందుండు మొదటిది భ్రమజతాదాత్మ్యము ఏదియో దానియందు (దానియాశ్రిత మయి) యేది నెలకొనియున్నదో ఆవిధకర్మము ఆగామియనఁబడును

ముందుచెప్పిన మూఁడువిధముల కర్మలలో జ్ఞానులకు

[౧] సకలసంచితకర్మలును జ్ఞానాగ్నిచే నాశమగుచున్నవి. ఏలయన తనయాశ్రయమయిన అజ్ఞాన ఆవరణశక్తియేదియో యదినాశమయినది, కావున ఆశ్రయము లేనందున సకలసంచిత కర్మలకును నాశము కలుగుచున్నది.

[౨] ప్రారబ్ధభోగము ముగియుగానే (ఈవర్తమాన శరీరమునకుఅంతముకలుగగానే) విదేహమోక్ష ఆరంభ కాలమున స్థూలసూక్ష్మ శరీరరూపముగా పరిణామమును బొందియుండినదియు తత్త్వజ్ఞానముచే మునుపు (జీవన్ముక్తిదశయందు) బాధింపబడి (మిథ్యాత్వ నిశ్చయ రూపబాధవిషయముగా) నుండినదగు అజ్ఞానవిక్షేపశక్తి (అవిద్యాలేశము) ఏదియోయది తత్త్వజ్ఞానముచేలేక మరణసంబంధి యయిన మూర్ఛకలుగగా తత్త్వజ్ఞాన సంస్కారముచే నాశనమయినది. అనగా కాగినయినుము నందు నీటిబిందువు మసుగునదివలె చేతనముండగ అణగినది.

ఆ తన ఆశ్రయనాశముచే నీశ్వర సంకల్పమునకు విషయమయిన దాని యాశ్రితమయిన ప్రారబ్ధ కర్మము నాశమగుచున్నది.

[3] అహంకారమునకు సాక్షిచేతనముతోఁగల తాదాత్మ్య (భేదముండఁగా అభేదముకనంబడుట) రూపభ్రమజ (మున్ముందు అధ్యాస రూపభ్రాంతియొక్క సంస్కారముచే నయిన) తాదాత్మ్యమేదియో యారూప హృదయగ్రంథి నాశము కాగా దాని నాశ్రితమయిన జ్ఞానమునకు మున్నైనను వెనుకైనను ఈ వర్తమాన జన్మమునఁ జేయఁబడు ఆగామి కర్మము లేవియో యవి జలముచే నంటని తామరాకువలె విద్వాంసుని అంటుటలేదు. అయితే యావిద్వాంసుని శుభాశుభకర్మములకు భక్తులును నిందితులును క్రమముగా *154 భాగము గలవార గుచున్నారు.

కావున నిటముందు "జ్ఞానాగ్నిచే సకల కర్మములు నాశమగుచున్న"వని చెప్పఁబడినవి.

అట సర్వ కర్మమను శబ్దముచే అనేకవిధ జన్మాంతరముల చేయఁబడిన అపక్వమయిన సంచిత కర్మములే చేకొనఁబడును.

కావున:-శ్లో॥ భిద్యతే హృదయగ్రంథి శ్ఛిద్యంతే సర్వసంశయాః
క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే॥

---

*154. ఇటయిది విశేషము. జ్ఞానియొక్క ద్రవ్యము, గృహము, క్షేత్ర మఠము పుస్తకములు అనువానికి పుత్రుఁడును శిష్యుఁడును భాగస్థులగుదురు. వాని జ్ఞానమునకు జిజ్ఞాసులు భాగస్థులగుదురు వాని శుభకర్మములకు సకామ భక్తులు భాగస్థులగుదురు వాని అశుభకర్మలకు నిందకులు భాగస్థు లగుదురు వాని మంచినడతలకు పుణ్యాత్ములగు నుదాసీనులు భాగస్థులు వారిపాపమును నివర్తించు శుద్ధదృష్టి పాత్రమునకు పాపముగల ఉదాసీనులు జ్ఞానమందు (రాగద్వేషములు లేనిపాపులు) భాగస్థులగుదురు. అనగా వానిమంచినడత లచే పుణ్యముగల ఉదాసీనులు చూచి మంచినడతల నడతురు పాపులగు ఉదాసీనులు పాపములేని వారగుదురు,

ఆ పరాపరము (అన్నిటి కంటెను మేలైన బ్రహ్మము) ను కనుగొనగానే (అపరోక్షము చేయగానే) ఈజ్ఞాని హృదయ గ్రంథి (అహంకారగ్రంథి) భేదింపఁబడుచున్నది. వీని సకల సంశయములును ఛేదింపఁబడుచున్నవి. వీని సకల కర్మలును క్షీణించుచున్న" వను శ్రుత్యర్థమును శిష్యుఁడు చెప్పెను.

87 ఇప్పుడు శిష్యుఁడు

"మాయామేఘోజగన్నీరం వర్షత్వేవయథాతథా।
చిదాకాశస్యనోహానిర్నో వాలాభ ఇతిస్థితిః"

అను పంచదశి కూటస్థ దీపమందుండు శ్లోకమునఁజెప్పఁబడిన విద్వాంసుల జీవన్ముక్తిదశయందలి స్థితిని తనచిత్తమునకు తెచ్చుకొని చెప్పుచున్నాఁడు.

స్వామీ! జ్ఞానముచే బాధింపఁబడిన మాయయను మేఘము తన విక్షేపశక్తిచేఁగలిగిన జగద్రూప జలమును అన్నివిధముల (కావలసినట్లు వర్షింపనిమ్ము) అయితే ఎందుచేనేను దీనికి ఆధార (అధిష్ఠాన) చిదాకాశ రూపముగా నున్నానో ఆకారణముచే నీజగముచే నాకౌక లాభమునునష్టమును లేదు.

88. ఇప్పుడు శిష్యుఁడు.

శ్లో॥ తుచ్ఛాఽనిర్వచనీయాచ వాస్తవీచేత్యసౌ।త్రిధా।
జ్ఞేయామాయాత్రిభిర్బోధైః శ్రౌతయౌక్తికలౌకికైః॥

౧. శ్రౌతము (ఈబ్రహ్మమునందు నానాయనునదికొంచెమైననులేదు. "ఇట్లుకాదు, ఇట్లుగాదు" అనునది మొదలగు శ్రుతి వాక్యములచే గలిగిన మూఁడుకాలములలేని నిశ్చయరూప విద్వాంసుల చిత్తమందు ఆరూఢమయినది.)

౨. యౌక్తికము (రజ్జుసర్పము, శుక్తిరజతము, స్వప్నజగత్తు, మొదలగు దృష్టాంతములును అనుమానాది రూపమునగు

యుక్తులచేనయిన వేదాంతయుక్తుల సమర్థులగు పండితులచిత్త మున ఆరూఢమయినది.)

3. లౌకికము (విచారములేక పామరవిషయుల చిత్తమున స్వభావముగాపొందబడినది) అనుభేదములచే మూడువిధము లగును. వానిచే నీ జగత్తగు కార్యముతోగూడిన మాయ యనునది

౧. తుచ్ఛము. ౨. అనిర్వచనీయ (సదసద్విలక్షణముగా నుండుటచే బాధయోగ్య స్వరూపముగలది.)

3. వాస్తవి (సత్యమయినది) అనుభేదముచే మూడువిధ ముల నెఱుఁగదగినది. అనుపంచదశి చిత్రదీపమందుండు వాక్య ముచేఁజెప్పఁబడిన మాయయొక్క మూడువిధ స్వభావముల విపరీతక్రమముగా తనచిత్తమందుదయించిన స్వానుభవమును జెప్పుచున్నాడు:-

వేదాంతశాస్త్రముల అభ్యాసమునకు పూర్వము అజ్ఞా నరూప కారణముతో జగత్తు సత్యమనియుంటిని. అదివేదాంత శాస్త్ర అభ్యాసముచే (శ్రవణమననములచే) స్వప్నజగమునకు సమానమని విచారించి మిథ్యగా (అనిర్వచనీయముగా) సిద్ధిం పఁజేసితిని అటుపిమ్మట అపరోక్ష జ్ఞానముకలుగగా నిషేధ ముఖశ్రుతియనుసారముగా శశవిషాణము (కుందేలుకొమ్ము) వలె అసారమైయుండుటచే అసత్తు (తుచ్ఛము) అనిసిద్ధించినది

ఈ యర్థము వేఱుశాస్త్రములందును జెప్పఁబడియున్నది:-

శ్లో॥ శాస్త్రేణ నశ్యేత్పరమార్థబుద్ధిః
కార్యక్షమానశ్యతిచాపరోక్షమ్।
ప్రారబ్ధనాశే ప్రతిభాసనాశో
హ్యేవంత్రమాన్నశ్యతి చాత్మమాయయా॥

ప్రారమార్థికము, వ్యావహారికము, ప్రాతిభాసికము, అను భేదములచే జగము మూడువిధములు కనబడుటగలదు. వానిలో,

౧. వేదాంతశాస్త్రముల అభ్యాసముచే, కార్యముతోఁ గూడిన మాయయందు పూర్వము అజ్ఞానకాలమందుండిన, పరమార్థబుద్ధి (సత్యత్వజ్ఞానము) ఏది యో యదినష్టమగుచున్నది

౨. ఇది యనిర్వచనీయముగా నుండుటచే వ్యావహారికముగా నెఱుఁగఁబడియున్న మాయయందు *155 కార్యమును గలిగించుటయందు సామర్థ్యముగలదనియుండిన బుద్ధియేదియో యది అద్వైతతత్త్వ అపరోక్షజ్ఞానముచే నష్టమగుచున్నది.

౩. జ్ఞాతమగు సద్దమందుగల ప్రతిబింబము బాధితానువృత్తిచే కనఁబడుటవలె నీకార్యముతోఁ గూడిన మాయ (దేహము పదువటకు జ్ఞానికి) కనఁబడుచున్నది.

అది ప్రారబ్ధము నాశముకాగానే నష్టమగుచున్నది, ఇట్లు క్రమముగా ఆత్మయొక్క మాయ (అజ్ఞానము) నాశమగుచున్నది. ఇది శాస్త్రాంతరవచనముచేఁజెప్పఁబడినయర్థమగును.

89. ఇప్పుడు శిష్యుఁడు.

నవిరోధోనచోత్పత్తిర్నబద్ధోనచ సాధకః ।
నముముక్షుర్నవైముక్త ఇత్యేషాపరమార్థతా॥

---

*155 నిద్రనుండి లేచుటకుముందు స్వప్నద్రష్టకు ఘటము మొదలగు పదార్థముల సఫలక్రియనుగలిగించుట కనఁబడునట్లు అపరోక్షజ్ఞానమునకుముందు శాస్త్రముచే మిథ్యయని తెలిసిన పదార్థములందును మిథ్యయగు ఘటముచే మిథ్యాజలమును తెచ్చుటయు మిథ్యయగు పుణ్యపాపములచే మిథ్యయగు స్వర్గనరకములు గలుగుచున్నవి" అనియిట్లు ఏసఫలక్రియను గలిగించుట కనఁబడుచున్నదోయది కార్యమును గలిగించుటలో సామర్థ్యముగలదగును.

అను మాండూక్యోప నిషత్తుకు గౌడపాదాచార్యులచే చేయుబడినకారికయొక్క అర్థమును చిత్తమందారూఢముచేసి పరమార్థత్వమును జెప్పుచున్నాఁడు.—

స్వామీ! జగమునకు తనకారణమయిన అజ్ఞానమందు తిరోభావరూపనిరోధ (ప్రళయ) మును లేదు. తన ఉపాదానమగు అజ్ఞానమునుండి యావిర్భవించిన ఉత్పత్తి (సృష్టి) యును లేదు. బద్ధుఁడు (సంసారిజీవుడు) ను లేదు. సాధక మోక్షసాధనములతోఁగూడినవాడు) ను లేదు. ముముక్షువు (బంధము నుండి విడబడుటకుగోరువాఁడు) ను లేదు. ముక్త బంధమునుండి విడువఁబడినవాఁడు) ను లేదు.

దీనియభిప్రాయము:- ఎందుచే సకల యీ లౌకికవైదిక వ్యవహారములున్ను, కామాలదోషముతోఁగూడిన దృష్టికి విషయమగు శంఖముయొక్క పీతత్వమువలెను, నిద్రాదోషముతోఁగూడిన దృష్టికి విషయమగు స్వప్నమువలెను, అవిద్యయొక్క (అవిద్యతోగూడిన దృష్టికి) విషయమగునో దానిచే ఉత్పత్తిప్రలయముల అభావముచేబద్ధుఁడు మొదలగువారు లేరు అయితే నీకనబడుద్వైతము మిథ్యయగును. ఆత్మయొక్కటియే పరమార్థముగా సత్తగును. ఇదిపరమార్థతయగును. (విద్యతో గూడినదృష్టికి విషయమగుట వాస్తవతయగును) కావుననాపరమార్థరూపము నేనగుచున్నాను. దీనిని నేను తమకృపవలన నిశ్చయము చేసితిని.

90. ఇప్పుడు పదార్థముల పరిస్పర విలక్షణత్వముతోఁగూడిన జాగ్రితయందు గానఁబడు పదార్థములు ఆదియందును అంతమునందును లేనందున వానికిమిథ్యాత్వముగలదు అనిశిష్యుఁడు

శ్లో॥ ఆదావంతే చ యన్నాస్తి వర్తమానేఽపి తత్తథా॥

వితథైః సదృశాః సంతోఽవితథా ఇవలక్షితాః॥

అను గౌడపాదాచార్యుల వాక్యానుసారము చెప్పుచున్నాఁడు.

ఎండమావులు మొదలగు వస్తువు ఆదియందును (ఉదయమందును) అంతమందును (సాయంతనమందును) లేదు. ఆదిమధ్య (మధ్యాహ్నరూప వర్తమానకాలమందు) కనఁబడినను ఒకప్పుడును లేదు. ఇదిలోకమందు నిశ్చయింపఁబడినది. అట్లే, యీజగము తనయుత్పత్తికి పూర్వమునిమిత్తనాశముచే తానునాశమయిన వెనుకయును లేక జ్ఞానముచే తనఉపాదానమునశించుటచే బాధపొందినపిమ్మటను లేదు.

కావున నీజగము ఎండమావులవలె మూఁడుకాలములందును లేదు.

91. ఇప్పుడు శిష్యుఁడు.

శ్లో॥ ఆత్మానంచేత్ విజానీయా దయమస్మీతి పూరుషః।
కిమిచ్ఛన్ కస్యకామాయ శరీరమను సంజ్వరేత్॥

పురుషుఁడు (సాభాస అంతఃకరణ విశిష్టచేతన రూప జీవుఁడు ఎప్పుడు (విచారదశయందు) ఇదిస్వప్రకాశముగా నుండుటచే నిత్యఅపరోక్షమగు బ్రహ్మరూపఆత్మ నేనుగానున్నానని ఆత్మను తెలిసికొనుచున్నాఁడో అప్పుడు దేనిని (ఏభోగ్యపదార్థములను) ఇచ్ఛించువాఁడై ఎవనియొక్క (ఏభోక్తయొక్క) కామ (భోగ) ము కొఱకు స్వభావముగా క్రమముగా రోగము మొదలగునవియును కామక్రోధ మొదలగునవియును శాంతి మొదలగునవియు ఆరెంటి సంస్కారమును నగు తాపములతోఁ గూడిన మూఁడువిధ శరీరములు పొంది తపింపఁబడు వాఁడగును. అను పంచదశి తృప్తి దీపమునందు

వ్యాఖ్యానము చేయఁబడి యుండు బృహదారణ్య శ్రుతివచన అర్థమును చిత్తమునకాని చెప్పుచున్నాఁడు.

౧. దేవా! ఆకాశము మొదలగు సకలజగమును అసత్తుగా నుండి కనఁబడు చుండుటచే స్వప్నగజము మొదలగువానివలె మిథ్యగానుండుటచే దానియందణఁగి యుండునవి యగు ఇహపర లోకముల సంబంధముగల మాల, గంధము, స్త్రీ అమృతపానము అప్సరస, మొదలగు విషయరూప భోగ్య (భోగపు) సాధనములున్ను

౨. జాగ్రత మొదలగు అవస్థల అభిమానముచేత విశ్వుఁడు తైజసుఁడు (ప్రాజ్ఞుఁడు అనుపేర్లను బొందిన అంతఃకరణమందు చేతన ప్రతిబింబమయమగు చిదాభాసరూప భోక్తయు నీకెండును దేనిచేత మిథ్యయో దానిచే నాభోగ్యము నిమిత్తమైన భోక్తయందు చేయఁబడిన పుణ్య పాపములు మిథ్యయగును. దీనిచే నాపుణ్యపాపముల ఫలరూప సుఖదుఃఖములును మిథ్య యగును.

కావుననేను చేతనస్వరూప ఆత్మను నెఱిఁగి ఏభోగ్యేచ్ఛచే నేభోక్తయొక్క భోగము కొఱకు జ్వర (తాప) ముగల శరీరమును గొని వ్యర్థముగా తాపము బొందుదును,

అనగా అపరోక్షజ్ఞానముచే బాధింపఁబడిన (మిథ్యగా కనఁబడిన) భోగ్య భోక్తా, భోగములకు నిమిత్తమగు ప్రబల యిచ్ఛలేనందు వల్లను వేఁచిన విత్తులువలె ప్రారబ్ధముచే కలిగి బాధింపఁబడిన ఇచ్ఛయుండుట చేతను నాయిచ్ఛారూప నిమిత్తముచే నేను తపింపఁబడను.

92. ఇక్ష్వాకు శిష్యుఁడు

శ్లో॥ అధిష్ఠానం తథాకర్తా। కరణం చపృథగ్విధం।

వివిధాశ్చపృథక్ చేష్టా దైవం చైవాఽత్రపంచమమ్॥ 1
శరీరవాఙ్మనోభిర్యత్కర్మ ప్రారభతే నరః।
న్యాయ్యంవావిపరీతం వాపంచైతే తస్యహేతవః। 2
తత్రైవంసతికర్తార మాత్మానం కేవలం తుయః।
పశ్యత్యకృతబుద్ధిత్వాన్న సపశ్యతి దుర్మతిః। 3
ప్రకృతేఃక్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః।
అహంకారవిమూఢాత్మాకర్తాహమితిమన్యతే॥ 4
తత్త్వవిత్తుమహాబాహోగుణ కర్మవిభాగయోః।
గుణాగుణేషువర్తంతే ఇతిమత్వానసజ్జతే।
యస్యనాహంకృతోభావో బుద్ధిర్యస్యనలిప్యతే।
హత్వాఽపిసఇమాల్లోకాన్నహంతిననిబధ్యతే॥

అర్థము:- అధిష్ఠానము (శరీరము) ఆత్మకర్త (అంతఃకరణము) వేర్వేరు కరణములు (దశేంద్రియములు) అనేక విధములగు భిన్నచేష్టలు (పంచప్రాణములు) ఐదవది దేవుఁడు (ప్రేరకుఁడగు ఈశ్వరుఁడు లేక ప్రారబ్ధము) లేక (ఇంద్రియముల దేవతలు) అనునవియున్నవి. (౧) శరీరము మనస్సు వాక్కు అనువానిచేత ఏన్యాయమైన (శుభ) లేక విపరీత (అశుభ) మగు ఏకర్మమును మనుష్యుఁడు ప్రారంభించుచున్నాఁడో దానికి శరీరము మొదలగునైదును హేతువులగును. (౨) అటుఈవిధముగా క్రియకు వేఱుహేతువు లున్నవని కేవలము (అక్రియ) ఆత్మను ఏపురుషుఁడు కృతార్థతలేని బుద్ధిగలవాఁడై యుండుటచే కర్తయని కాంచుచున్నాఁడో ఆదుర్బుద్ధిగలవాఁడు కనఁజాలఁడు (ఆత్మనుయథార్థముగా నెఱుఁగఁడు) (3) శరీరము ఇంద్రియములు మొదలగు రూపపరిణామమును బొందిన ప్రకృతి (మాయ) సత్వము మొదలగు గుణములచేఁ జేయఁబడుచున్నవి.

సకల కర్మములును వానికి అహంకారముచే (అహంకార తాదాత్మ్యముచే) ఎవని ఆత్మవిగూఢమై (వెలుగుటను పొంది యున్నదో ఆవిధపురుషుఁడు నేనుకర్తయనుకొను చున్నాఁడు. (౨) మహాబాహూ! గుణకర్మముల విభాగ తత్త్వమును దెలిసిన వాఁడో గుణములు (ఇంద్రియములు) గుణ (విషయ)ముల యందున్నవని తలంచి తాను సంగముగల వాఁడగుట లేదు. (౫) ఏపురుషునికి శరీరము మొదలగు వానిచే జేయఁబడుకర్మమందు ఈకర్మమునకు కర్తనేనను అహంకారము లేదో అదియు గాక ఈశుభాశుభకర్మల స్వర్గనరకాది దుఃఖఫలమునందే పురుషుని బుద్ధినేను దీనిఫలమును ననుభవించు వాఁడను అనునట్లు బంధమును పొందుట లేదో ఆ పురుషుఁడు ఈలోకముల చంపు వాఁడైనను లోకదృష్టిచే చంపుటను జేయుచున్నాడు శాస్త్రదృష్టిగా చంపుటలేదు. దానిఫలము పొందెడు బంధనమున్ను పొందుట లేదు (౬) ఇవి మొదలగు ఆత్మ యొక్క అకర్తృత్వము అభోక్తృత్వము అట్టి ఆత్మ జ్ఞానము అను వాని మాహాత్మ్యమును బ్రతిపాదించు గీతయొక్క వాక్యములు గలవు. వాని అర్థమును అనుభవగోచరము చేసికొని శిష్యుఁడు చెప్పుచున్నాఁడు. —

నేనుశరీరము వాక్కు, మనస్సు అనువానిచే చేయఁబడిన క్రియల అనాశ్రయ (సంబంధము లేని) వాఁడనై యుండుటచే అక్రియుఁడ (అకర్త) గానున్నాను.

ఏది క్రియయొక్క ఆశ్రయరూపమై క్రియను గలదై యున్నదో యదికర్తయనఁబడును. అది ముందు చెప్పిన శరీర మొదలగు సామగ్రులతో గూడిన అంతఃకరణ రూపకర్తను బోలినది. దేనిచే నేను క్రియ యొక్క ఆశ్రయ రూపమయిన

క్రియనుగల వాఁడను గానో అందుచేత కర్తను గాను.

ఏది కర్తయో యదియే భోక్తయనుట లోకప్రసిద్ధి. ఎట్లు అంతఃకరణము కర్మమునకు కర్తయయి యున్నది. కావున అది కర్మయొక్క ఫలరూపమగు తనపరిణామరూప సుఖదుఃఖముల భోక్తయై యున్నది. దేనిచే నేను ముందుచెప్పిన కర్మమునకు కర్తనుగానో దానిచే దానిఫలముయొక్క భోక్తయుఁగాను ఎందుచేనేను కర్మఫలభోక్తను గానో అందుచే నేను (సంగము) బంధకము లేనివాఁడనై యున్నాను.

ప్రారబ్ధకర్మరూప నిమిత్తముచేత అజ్ఞానవిక్షేపశక్తిచేత జేయఁబడిన లింగదేహముతోఁగూడిన స్థూలదేహమేదికో యది దీని ప్రారబ్ధము ప్రకారము ఊర్ధ్వగతిగాను లేక అధోగతిగాను గాలిచే గొట్టఁబడిన రాగియాకు లేక తృణమువలె చలించని శబ్ద ప్రారబ్ధపర్యంతముండిన నుండని. అందుచే ఆత్మయయిన నాకులాభము లేదు. నష్టము లేదు. ఈ యర్థము శ్రీపంచదశి తృప్తిదీపమునందును:—

వ్యవహారో లౌకికో వా శాస్త్రీయో వాఽన్యథాపివా।
మమాకర్తురలేపస్య యథాఽఽరబ్ధం ప్రవర్తతాం॥

అకర్తయు అభోక్తయునయిన నా ప్రారబ్ధమెట్లున్నదో యట్లు లౌకికలేక శాస్త్రీయులేక ఈ రెంటికి వేఱయిన వ్యవహారము ప్రవర్తించని అని చెప్పఁబడియున్నది.

ఇట యిది సంశయము:- జ్ఞానకి సర్వజ్ఞుఁడై యుండుటచే విధినిషేధరూప శాస్త్రపుగట్టు (అడ్డము) లేనందున నెప్పుడు స్వతంత్రతయున్నదో యప్పుడాతనికి యథేష్టాచరణము (ఇష్టప్రకారము నడచుట) కలుగును. అది లోకనిందనను, శిష్టనిందనను అంతఃకరణమునందుండు కామాదిదోషములు అధికరిం

చుట మూలమున చిత్తము బహిర్ముఖమగుటయును గలిగించు నదియై యుండుటచే విక్షేపమునకు హేతువగును. జీవన్ముక్తి ఆనందమునకును హేతువు కానేరదు.

కావునని జ్ఞానికి "వడ్డికాశించి మొదలు పోగొట్టు కొన్నవాఁడు" అను న్యాయముచే పరమానందము పొందుటకు గోరి జ్ఞానమునందు ప్రవర్తించిన పురుషునికి మాఱుగా విక్షేప రూపానర్థము వృద్ధియయ్యెనే యనుసంశయమునకు నిది సమా ధానము:-

చక్రవర్తియగు రాజు తనపుత్రుని చంపు వది లేకతన నగరమునైనను, దేశమునైనను తగులబెట్టునది, లేక మలము తినునది, లేక తన కీర్తిని నుడువువారును ఆశీర్వదించువారును రాజ్యకార్యము చేయువారునగు సూత (పౌరాణికులు) మాగ ధులు (వంశమునుచెప్పువాడు) శ్రోత్రియులు వేదములు తెలిసిన విద్వాంసులు తనభృత్యులు మొదలగువారికి ధనము మొదలగు పదార్థములనీయక దానికి మాఱుగా కొల్లగొట్టుట ఈయన్ని కార్యములందును వానికి స్వతంత్రత్వముగలదు. అయినను ధర్మమును దెలిసినవాఁడును లౌకికవ్యవహారమునందు నీతియందు నిపుణుఁడు నైయుండుటచే ఆ రాజట్లు చేయుటలేదు.

అట్లే జ్ఞానియగువాఁడు విధినిషేధములు లేనందున స్వ తంత్రుఁడై యుండినను,

౧. ఎందుచే నన్నిటను *155a తానుగా నేలుగుచున్నాఁడో

---

*155a దీనిచే జ్ఞానికి సర్వాత్మత్వజ్ఞానముచే తన బద్ధను పరులబద్ధను భేదజ్ఞాన అపేక్షగలదగు అనుకూలప్రతికూలములు జ్ఞానపూర్వక రాగద్వేష ములవు దృఢతలేనందున రాగద్వేషములచే కనఁబడు (నిషిద్ధభోగము వహింసా రూపమునగు) యథేష్టాచరణ అభావము చెప్పబడినది.

౨. శాస్త్రమునందుఁ జెప్పబడిన *156 వివేకముతోఁ గూడిన వాఁడై యున్నాఁడో,

3. బిడ్డలయందు తండ్రివలె సకల *157 జనులకు హితమును జేయువాఁడై యున్నాఁడో,

౪. సకల విక్షేపములఁ బోఁగొట్టి పరమానంద *158 అనుభవమునందు బంధకముగలవాఁడై యున్నాఁడో,

దానిచేవాఁడు యథేష్టాచరణము చేయుటలేదు. అయితే "మంత్రమెఱిఁగినవానికి ముండ్లపడక యును వానికి కష్టమును గలిగించదనగా పూలపాన్పు వానికెట్లు కష్టమునుకలిగించును" అనున్యాయముచేలోకసంరక్షణార్థము వ్యతిరేకశాస్త్రములందు చెప్పినమార్గములందు మనోవాక్కాయముల చెల్లించుచున్నాఁడు. లోకులివాని అభిమానమును జేయుటలేదు

లేక వైరాగ్యము మొదలగు శుభసాధనముల సంస్కారరూపమును పూర్వపుణ్యముయొక్క సంస్కారరూపమును

---

*156 ఇట్లు చెప్పుటచే జ్ఞానికి బాధితాను వృత్తిచే ఆకలి, దప్పి, విషము చక్కెర, అన్నము, మలము మొదలగువాని వివేకమువలె చేయదగినదియును, చేయదగనివియునగు కార్యముల వివేకముగలదు, కావున వాని అవివేకముచే గనిపించు యథేష్టాచరణము సంభవింపదనునది సూచింపబడినది.

*157 ఇట్లు చెప్పుటచే జ్ఞానికరుణ సూచింపఁబడినదగుటచే తన నిషిద్ధ ఆచరణమునుగని యట్లుచేయు జనులకును లేక తన్ను నిందించుజనులకును నరకమోఁలగు దుఃఖములు కలుగునను కరుణచేతను జ్ఞానికి యథేష్టాచరణమున ప్రవృత్తికలుగదని సూచింపఁబడినది.

*158 ఇట్లు చెప్పుటచే బహిర్ముఖమగుటకు హేతువైయుండుటచే జీవన్ముక్తికి విలక్షణానంద అనుభవమునకు విరోధియయిన యథేష్టాచరణమునందు దానికి ప్రవృత్తి సంభవింపదు,

నయిన స్వభావముచేతను వాఁడు వెఱ్ఱిబట్టిన వైష్ణవునివలెనైనను బాహ్మణులు మొదలగువారి బిడ్డలవలెనైనను నిషిద్ధాచరణమునసుండడు. శిష్టాచరణమందే యుండును.

అట యిదిపండితుల యథేష్టాచరణమును నిషేధించు యుక్తితోఁగూడిన శాస్త్రవచనము:—

అధర్మాజ్జాయతేఽజ్ఞానం యథేష్టాచరణం తతః ।
ధర్మకార్యే కథం తత్స్యా ద్యత్ర ధర్మోవినశ్యతి ॥

దీనియర్థము:- దుష్టాచరణముచే (చెడునడతచే) గలుగు సంస్కారమయి పాపరూప అధర్మముచే తెలియమి కలుగుచున్నది. అనగా కార్యాకార్యముల భేదజ్ఞానమగు వివేక అభావరూప అంకురము మూలముగా ఉత్పత్తియయిన అవశ్యము చేయఁదగిన కార్యమును మఱచుటయునడు లేక విమయపరవశత అను ప్రమాదము కలుగుచున్నది. అందుచే యథేష్టాచరణము కలుగుచున్నది. జ్ఞానరూపమగు ధర్మకార్యముండగా నాయధర్మకార్యమగు యథేష్టాచరణమెట్లుండునది యగును. అటజ్ఞానమునకు హేతురూప ధర్మముజ్ఞానరూప ఫలముయొక్క తిరోధానముచే నాశమగుచున్నది. కావున జ్ఞానవంతులకు యథేష్టాచరణమందు ప్రవృత్తిగలుగుట లేదు.

లేక అర్జునునికి హింసాదిక యుద్ధమునందు ప్రవృత్తికలిగినదేదిమోయది యథేష్టాచరణముకాదు. అది క్షత్రియులస్వధర్మమగును.

93. “నిత్యబోధపరిపీడితం జగ
ద్వ్యాకృజా తుదతి విభ్రమం మతిః ।
వాసుదేవనిహతం ధనంజయో
హంతికౌరవకులం యథాప్పునః ॥

అనుసంక్షేపశారీరక వాక్య అర్థమును శిష్యుఁడు అనుభవగోచరముఁ జెప్పుచున్నాఁడు:- నిత్య బోధరూపచేతనమందు కారణముతోఁగూడిన జగత్తు బాధితమేయగును. అవగా నిత్యనివృత్తమేయగును. అట్లయినను మహావాక్యముచేఁగనఁబడు "నేను బ్రహ్మను" అను జ్ఞానముచే కనఁబడుచుండెడు భ్రమ (సత్యత్వముచే వ్యక్తరూపవేఱుబాటు) ఏదిరొగా యది నాశమగుచున్నది.

కృష్ణునిచే పూర్వమే చంపఁబడిన కౌరవకులము పిమ్మట అర్జునినిచేతను నాశమయ్యెను. అట్లే గురువు దృష్టిచే నిత్య నివృత్తమయిన జగత్తు మరల శిష్యుని జ్ఞానదృష్టిచే నివృత్తి యగుచున్నది.

94 శ్లో॥ ఆత్మానాత్మవిభాగోఽయం ముధైవ క్రియతేఽబుధైః॥
యద్వన్మృణ్మయః కుంభస్తద్వద్దేహోఽపిచిన్మయః

అను అపరోక్షానుభూతి వాక్యపు అర్థమును అనుభవ విషయముగాఁజేసి శిష్యుఁడు చెప్పుచున్నాఁడు:- నాచే తత్పదార్థ త్వంపదార్థముల వివేచనకాలములయందు జీవబ్రహ్మముల ఐక్యమునకు విరోధముగల ధర్మములతోఁగూడిన ఉపాధియయిన వాచ్యభాగమును విడిచి అవిరోధియగు చేతనరూపవాచ్యభాగమును చేకొనుటయగు భాగత్యాగలక్షణచే జడచేతనముల భేదము (వివేకము) చేయఁబడినది. దానినిప్పుడు వ్యర్థముగాచేయబడినదని యెఱుఁగుచున్నాను. ఘటము మట్టిరూపమేయగును. అట్లు దేనిచే నీదేహాది ప్రపంచము నాకు చిద్రూపముగా గాన్పించినదో దానిచేనాకు దేని గ్రహణమును దేనిత్యాగ్యమును లేదు. దీనిచే ముందుజిజ్ఞాస (జ్ఞానమునందలి ఆశ) కాలమందు ఇదవయుపదేశమందుఁ జెప్పిన దేహాత్మల

భమరూపముఖ్య అభేదమును బోగొట్టుటకొఱకు చేయఁబడిన
ఁడచేతనముల వివేకమేదిగలదో యది ఇప్పుడు జడప్రపంచబాధ
ముచే అభేదము (నిత్యనివృత్తి) కాన్పించుటచే వ్యర్థముచేయఁ
ఁడినదని కనఁబడుచున్నదనునది తాత్పర్యము.

95. ౧ ఇప్పుడు శిష్యుఁడు ముందుజెప్పిన యర్థమును సంగ్ర
హముగాననువదించి తనస్థితిని జెప్పుచున్నాఁడు:- ఆత్మ, నిరవ
యవమును నిరాకారమునునై యుండుటవలన తొలిసివేయు
ఁదిగాగాని తీసికొనునదిగాగాని లేకయున్నది.

౨. మరియు ఆత్మ, జనన మరణ మొదలగు బంధములులేని
దిగానున్నందునను తాను (ఆత్మ) నిత్యముక్తముగానున్నందు
నను బంధమోక్షములు లేనిదిగానున్నది.

౩. మరియు ఆత్మ, ఉత్తు అగును. ఏలయన,

(౧) జాగ్రము స్వప్నము సుషుప్తియును మూడవస్థ
లును ఆయవస్థలుగల అన్నిదినములును, ఆదినములుగల చైత్ర
ము మొదలగు నెలలును ఆనెలలు ప్రభవాది సంవత్సరములును
ఆసంవత్సరములుగల సత్యాది (కృతాది) యుగములును,
ఆయుగములుగల స్వాయంభువాది మన్వంతరములును, ఆమ
న్వంతరములుగల బ్రహ్మదినములును, ఆబ్రహ్మదినములుగల
మాసము మొదలగువానితోఁగూడిన పరార్ధ (బ్రహ్మయొక్క
౫౦ యేండ్లు) ను ఆట్లేయారెండుపరార్థములుగల వరాహము
మొదలగు కల్పములును ఆ కల్పములుగల భూతభావివర్తమాన
ములను కాలములును, ఆకాలములందు ఆకాశము మొదలగు
ఆశ్రయముతోఁగూడిన ఒకదానికొకటి విలక్షణమగు శబ్ద
మొదలగు అన్నివిషయములును ఆయావిలక్షణకాలములను
దేనిచే అత్మప్రకాశింపించునదియై యున్నదో దానిచే ఆత్మ

స్వయంప్రకాశమగును. దేనిచే ఆత్మ స్వయంప్రకాశమో దానిచే ఆత్మచిత్తగును.

(౨) లేక ఘటమఠమొదలగు నొకదానికొకటి భిన్నముయిన ఉపాధులందుండునవియు, ఆకాశము ఆకాశము అని యొకరూపముగా గనఁబడుచుండునదియునయిన యొక ఆకాశమేదియో దానివలె శబ్దజ్ఞానము స్పర్శజ్ఞానమనునది మొదలగు వ్యవహారములందు జ్ఞానము జ్ఞానమని యొకరూపముగా గాన్పించుచున్న ఒకే జ్ఞానరూపస్ఫురణమున్నది. సంవిద్రూపజ్ఞానము జాగ్రము మొదలగు మూడవస్థలు మొదలగు నన్నికాలములందును నొకదానికొకటి విలక్షణమగు నన్నివిషయములను నొక్కటియై ప్రకాశింపించునదియై యున్నది. ఆరూపమైయుండుటచే ఆత్మ చిత్తగును.

(౩) లేక ఆత్మదేనిచే తనతాదాత్మ్యసంబంధమువలన నన్నిటిని వ్యక్తపఱచునదిగానుండుటవలన నన్నిటికిని సాధకముగానున్నదో దానిచేతను ఆత్మచిత్తగును.

౪ మరియు ఆత్మ ఈ (చెప్పిన) యన్నికాలములయందును పరమప్రేమకు విషయముగాను దుఃఖసంబంధము లేనిదిగాను నుండుటచే ఆనందరూపమగును.

౫. మరియు ఆత్మసత్తగును. దేనికిచావుపుట్టుకలు లేవో అది మూడుకాలములందును బాధింపఁబడనిదిగానుండుటచే సత్తనఁబడును. ఆత్మకుదేనిచే జన్మనాశములు లేవో దానిచేమూఁడు కాలములందును బాధింపఁబడనిదై యుంటచే ఆత్మసత్తగును. దానింజూపుదుము:—

సంవిత్తు (చేతన) రూప ఆత్మ.

(౧) ఒక్కటిగా నుండుటచే జడవస్తువులచే దానికి

జన్మనాశముల జ్ఞానము పొందదు.

(౨) తానైన చేతనమును దీపమువలె తనసమకాలమందు ప్రకాశింపించునదై యుండుటచేతను, తనయుత్పత్తినాశకాలములందు తనలేమికలుగుటచేతను ఆత్మయొక్క ఉత్పత్తినాశముల జ్ఞానము ఆత్మవలనను పొందునదికాదు.

(3) "దానిం బ్రకాశింపంజేయునది వేఱా, దానిం బ్రకాశింపంజేయునది వేఱు" అనునట్లు అనవస్థారూపదోషము కలుగుటచే ఆత్మను దానిజన్మనాశములను వ్యక్తపఱచునదియైన వేఱు సంవిత్తు (జ్ఞానము) రూప ఆత్మ సిద్ధించుట లేదు.

(౪) జడవస్తువు విషయింపనేరనిదగుటచే ఆత్మయొక్క జన్మనాశముల తెలుపునది జడవస్తువనునది సిద్ధించుటలేదు. కావున ఆత్మయొక్క జన్మనాశముల యనుభవము లేదు.

(౫) శ్రుతి మొదలగు ప్రమాణములచేతను ఆత్మయొక్క జన్మనాశముల అభావము చెప్పఁబడియున్నది. కావున ఆత్మ ఒకేస్వప్రకాశరూపముగా నుండుటచే దానికి జన్మనాశములు లేవు.

(౧) దేనిచే ఆత్మకు జన్మనాశములు లేవో దానివలన ప్రాగభావము ప్రధ్వంసాభావములు లేనందున ముందు చెప్పిన చిదానందరూప ఆత్మయొక్కరూపము నుండునదైయున్నది.

(౨) దేనిచే ఆత్మయొక్కరూపము [illegible]దిగానున్నదో అందుచే ఆత్మ నిత్యము అగును.

(౩) దేనిచే నిత్యమో దానిచే ఆత్మ సత్తగును.

(౪) మరియు ఆత్మ [illegible] దానిచే తెలిపింపఁబడిన మనస్సు మొదలగు సకలప్రపంచమునకును [illegible] కానిదగును.

ఈవిధబ్రహ్మముకంటెను వేఱుకాని ఆత్మయేదిగలదో యది నాస్వరూపమగును ఈస్థితినే నేనుసంపాదించియున్నాను.

96. అతిదూరతరం నిజస్వరూపం।
గురుశాస్త్రైర్న విలోకయేద్యది॥
నికటం గురుశాస్త్రబోధతః।
ప్రకటం స్యాత్స్వతనౌ స్వయం హితత్॥

అను శాస్త్రవచనార్థమునుస్మరించి ఇప్పుడు శిష్యుఁడు చెప్పుచున్నాఁడు:— గురుశాస్త్రముల ఉపదేశమునకు ముందు నిజరూప బ్రహ్మము మిక్కిలిదూరముగాఁ గనబడు చుండెడిది ఆయుపమింప సాధ్యపడని నిజరూపము ఇప్పుడు గురుశాస్త్రముల ఉపదేశముయునపిమ్మట సమీపముందుండునదియాయెను.

అప్పుడది అపరోక్షమగునోయని శంకగలుగగామరియు ప్రకట (అపరోక్ష) మయినది యని చెప్పుచున్నాఁడు.

అట్లయిన నది శరీరమునకు నెదుట అపరోక్షముగా నుండునేయను శంకగలుగగా నట చెప్పుచున్నాఁడు.

తన శరీరమునందే అపరోక్షముయినది. ఏలయన

౧. ప్రమాతృచేతనమునకును (సాక్షికిని) విషయచేతన (బ్రహ్మ) మునకును శరీరమందు అంతఃకరణదేశమందే అభేదముకలుగుటచేతను,

౨. ప్రమాతృచేతనమునకు విషయచేతనముతో వృత్తిమూలమున నయినను లేక నేరుగానైనను గలుగు అభేదమే అపరోక్ష జ్ఞానలక్షణమగును. అది కలుగుటచేతను

శరీరమునందు ...కలనే బ్రహ్మముయొక్క అపరోక్ష జ్ఞానము చెప్పఁబడినది. అదియుంచిదగును.

శరీరములో అపరోక్షము గలిగియు అది ఇదియను

వృత్తికి విషయమయిన సుఖదుఃఖము మొదలగువానివలె తన కంటెను వేఱయినదై అపరోక్షముగా నుండునో యను శంక కలుగగా అందులకు నేనను వృత్తికి విషయమగుట వలన తానే తానై అపరోక్షమయినది. అని చెప్పెను.

97. ఇప్పుడు

"శ్లో॥ ఉద్యత్యప్రచుర ప్రబోధతరసా మాయానిశాఽస్తంగతా।
జాతాదృక్తమసోభిదా మలభుజోఽప్యచ్ఛాదిన త్రించరాః॥
సుప్తాయామితదాసవ ప్రచ్ఛ్యుతిరియంకామాద యోఽదస్యవో।
లీనాఇంద్రియ తారకాగతరుచః క్షీణోమనశ్చంద్రమాః॥

అను కువలయానంద ఆలంకార గ్రంథమునం జెప్పిన యర్థమును మనస్సున గొని దృఢఅపరోక్షజ్ఞానమును సూర్యునిగా రూపించి శిష్యుడు వర్ణించుచున్నాడు.

౧. నిదిధ్యాసరూప అరుణోదయమునకు పిమ్మట

౨. దృఢ అపరోక్షజ్ఞాన సూర్యోదయముచే

౩. మాయయందు (తనఅంతఃకరణదేశమందు) గల అజ్ఞానాంశరూపరాత్రి (చీకటి) నాశమయినది.

ఇందుచే కార్యముతో సమష్టి యజ్ఞాన రూపమాయ యొక్క మిథ్యాత్వము కనంబడుటచే వస్తువుచే దానికేనాశము కలిగినది. అనునది సిద్ధించుచున్నది.

౪. చిత్తను ద్రష్టయగు చేతనమునకు జడమను దృశ్యప్రపంచమునకు "సత్తుసత్తేయగును. అసత్తు అసత్తేయగును" అను చీకటివెలుతురు వలె భేద (మిక్కిలి వివేకము) కలిగెను.

౫. కనంబడుచుండెడు అసత్తు మొదలగు నిశాచరులు (పిశాచాదులు) మలమును భుజించుచున్నది. (ముముక్షువులకు) క్షూరము సేయుటలేనందున క్షూరము వేయునదియై మలమును

౧. బ్రహ్మయగు తండ్రికిని ౨. మాయయగు తల్లికిని ౩. చిదాభాసమయ జీవుఁడును ఈశ్వరుఁడునునగు రెండు పుత్రులు గలరు. వారిలో,

౪. ఈశ్వరుఁడగు జ్యేష్ఠ పుత్రుఁడు పరబ్రహ్మమగుతండ్రి యొక్క సుఖరూప రాజ్యాదిధననిధిని అనుభవించు చున్నాఁడు. సర్వజ్ఞత్వము మొదలగునవియగు మాయయొక్క ధనమును స్వాధీన పఱచుకొనుటచే ప్రభువు [ఈశ్వర (సమర్థుఁడు) గా] యున్నాఁడు నాకొఱకు కర్మను సారముగా నిర్వాహమునకు ఉపయోగించు మాయ యొక్క ధనమునుండి విభాగముచేసి

శ్లో "పత్రంపుష్పం ఫలంతోయం యోమేభక్త్యాప్రయచ్ఛతి।
తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః॥

నాకొఱకెవఁడు పత్రము, పుష్పము, ఫలము, జలము, అనువానిని భక్తితో నిచ్చుచున్నాఁడో ఆ నియమింపఁ బడిన మనస్సుగల భక్తుఁడు భక్తితో నిచ్చిన వస్తువులను నేనంగీకరించు చున్నాను" అను మొదలగు గీతమొదలగు వానివాక్యములనే నాదగ్గఱనుండియు బిడుగొనువాఁడై

౫. పనివానివలె విధినిషేధమగు శిక్షను జేయువాఁడై యున్నాఁడు.

౬. ఇప్పుడు నేను గురువను వక్కీలగు తముచే

౭. భాగత్యాగలక్షణచే నానిజరూప కూటస్థు (సాక్షి) నిత్యు ఆతని నిజరూపమయిన బ్రహ్మము యొక్క ఏకరూపు న్యాయముచే

౮. జయించితిని (అభేదభావముగా కనబడుటచే పరసుఖ నిధియొక్క భోక్తయయి స్వాధీనముచేసితిని) కొన్నిచోట్లవ్యవహారకాలమందు భేదమును జెప్పుట కలిగి యుండియు లోక

దృష్టిచే లజ్జగలవారై యొకరికొకరు స్నేహముగల స్త్రీపురుషులవలె లోపలభేదము నెప్పుడును గాన్పించుటలేదు. దాని అభేదమే ఆకలిబాధ మొదలగు దోషములేక భుజించినఅన్నము వలె పరమానందమునకు హేతువుగా నుండుటచే

అభేదదృశ్యము సుఖమును గలిగించునదియగును. భేద దృశ్యము దుఃఖమును గలిగించునదగుననుటలో,

శ్లో॥ జాతేసమరసానందే ద్వైత మప్యమృతోపమం।
స్నిగ్ధయోరివదంపత్యోర్జీవాత్మ పరమాత్మనోః॥
దుఃఖాయద్వైతభావోహి సుఖాయా ద్వైతభావనా।
భాగాయాన్నం పృథగ్భూతంభుక్తమన్నం సుఖావహం॥

జీవాత్మ పరమాత్మల సమరసానందము కలుగగనే (వ్యవహారకాలమున మాట మాత్రమయిన) ద్వైతమున్ను అమృతమునకు సమానమగును. స్నేహముగల స్త్రీపురుషులవలె ద్వైతము దుఃఖముకొరకగును. అద్వైతభావన సుఖముకొఱకగును. ఎట్లు:- శరీరమునకు వేఱుగా నెత్తఁబడిన అన్నమేది యోయది భారముకొఱకగును. భుజించిన (భోజనమూలమున శరీరముతోఅభిన్నమయిన) అన్నమేదియోయది సుఖముకొఱకగును అను యుక్తితోగూడిన వేఱుశాస్త్రముయొక్క వచనమును ప్రమాణమగును.

99. శ్లో॥ దాసోఽహమితియాబుద్ధిః పూర్వమాసీజ్జనార్దనే
దాకారోఽపమృతస్త్వే న గోపీవస్త్రాపహారిణా।

అనుమధుసూదన సరస్వతిచే చెప్పఁబడిన వాక్యార్థమును అనుభవమునంగొని శిష్యుఁడుచెప్పుచున్నాఁడు.

ఒకనియింట నిధి రాతిచేఁ గప్పఁబడియుండిన, ఆనిధిని సిద్ధుల అంజనము (కాటుక)చేఁదెలిసికొని, ఆరాతినిదీయ బయ

లగుచున్నది. అయిన దాని విశేష సుఖము ఉపయోగించుటచే గలుగుచున్నది.

అట్టి హరియగు పరమేశ్వరుని యొద్ద నాకు ముందు అజ్ఞానదశయందున్న ఉపాసనాకాలమందు అనాది (బహుకాలపు) "దాసోహం (దాసుఁడనేను)" అను బుద్ధిగలిగియుండెను. అది గోపికల వస్త్రమును దొంగలించిన విష్ణువుచే కరుణవలన గురుశాస్త్ర సమాగమమును గలిగించి దేహాభిమానమును సూచించు *159. "దా" ననురాతిని త్రోయుటమూలముగా గ్రహింపఁబడినది (చేకొనబడినది) దేనిచేసిప్పుడు నాకు అనాది కాలమునందలి జీవత్వరూప దరిద్రము పోయి తనశరీరమగు యింటియందు ముందే నెలకొనియుండిన ఆత్మయొక్క బ్రహ్మత్వరూపధనము దొరకినదో; దానిచే నీగొప్పలాభము కలిగినది. అయితే దీనివిశేషసుఖము నాకు జ్ఞానముగలిగినపిమ్మట బ్రహ్మ విచారముచే అంతర్ముఖముగా (లోచూపుగా) నిలుచుటచే కలుగును.

100 శ్లో॥ దేహాభిమానేఽగలితే విజ్ఞాతే పరమాత్మని।
యత్రయత్రమనోయాతి, తత్రతత్రసమాధయః॥

దేహాభిమానముపోయి పరమాత్మవిశేషముగా తెలియఁబడగా ఎక్కడెక్కడ మనస్సుపోవుచున్నదో అక్కడక్కడ (చిన్మాత్రవాసనయొక్క స్థితిచే ఆకాశరూపలక్ష్యమందు వేయఁబడిన బాణమునువలె తనస్వరూపము ప్రకాశించుటచే) సమాధియగును. ఈశ్లోకమునకిది రెండవ అర్థము:— దేహాభిమానముతరుగక పరమాత్మయును విశేషముగా తెలియఁబడక ఎక్క

*159. దాసోహం అను దానిలోనున్నది 'దా' అదిపోగా మిగిలినది. సోఽహం అనునది.

డెక్కడ మనస్సుపోవుచున్నదో అక్కడక్కడ సంచితాధులు (మనోదుఃఖములు) గలవు.

ఈ యర్థమునే మనస్సునగాని శిష్యుడు చెప్పుచున్నాడు

స్థూలదేహమున అహంకార అధ్యాసను ముందుంచి ఇంద్రియములు ప్రాణము, మనస్సు, మొదలగు వానియందు అహంకార అధ్యాస కలుగుచున్నది, అహంకార అధ్యాసను ముందుంచి ఇదంతా రూపఅధ్యాస కలుగుచున్నది, దానియందును పేరుయొక్క అధ్యాసను ముందుంచుకొని రూపాధ్యాస కలుగుచున్నది. అదిఅనుభవ సిద్ధమగును. దేనిచే విద్వాంసుడైన నాకు దేహమందు నేననుఅభిమానరూప అహంకారము యొక్క అధ్యాసపోయినదో దానిచే నింద్రియాదుల సంఘాతమందు అహంకారమున్ను బయటి జగత్తు (నామరూప) నందు ఇదంతయు (హితము) నయినవీనిఅధ్యాస పోయినది దీనిచేతనే దానియందణగి యుండు గృహము మొదలగు వానియందు నాదనుట మొదలగువాని అధ్యాస తీరినది. [ఎఱుగ బడిన అద్దమునందుండు ప్రతిబింబము బింబము యొక్క సన్నిధి యయిన ఉపాధిబలముచే తెలియునట్లు ప్రారబ్ధమయిన ఉపాధి బలముచే బాధింపబడిన ప్రపంచభాస (తెలియుట) మనసు కలుగుచున్నది. కావున దానియందు సత్యతాబుద్ధి కలుగుట లేదు] సత్తయొక్క ప్రకాశించుచే బ్రహ్మము నిజరూపముగా ప్రకాశించు చున్నది. కావున అప్రమాదియయి (సోలిపోవుట లేక)న విద్వాంసునకు వ్యవహారమందును ఎల్లప్పుడును సమాధియున్నది. వానికంటే మాఅయిన అవిద్వాంసునకు అధ్యాసతో నిజరూప బ్రహ్మము వ్యక్తము కానందున ఎప్పుడును విక్షేపరూప ఆధి (మనోదుఃఖము) ఉన్నది.

101 శ్లో॥ అహంకారోధియంబ్రూతే। మాసుప్తం ప్రతిబోధయ।
ఉత్థితే పరమానందే నత్వంనాహంనవై జగత్ ॥

అను శ్లోకపు అర్థమును మనస్సు నందుంచుకొని శిష్యుఁడు చెప్పుచున్నాఁడు. ఆత్మయను పతికి బుద్ధియను పత్నియట. ఆయాత్మఅజ్ఞానమగు నిద్రయందు అనాది కాలముగా నిద్రించుచున్నది బుద్ధియగునది అహంకార (దేహాభిమాన) రూప జార (వ్యభిచార) ముచే చెడినది అందుచే జగద్రూప పుత్రునిగనెను. పిమ్మట ఎప్పుడు బుద్ధియగు నామెసత్సంగమను చెలికత్తెల ఉపదేశముచే ఆత్మనుపొంది (దానిజ్ఞానమును సంపాదించు)చున్నదో అప్పుడుబుద్ధినిజూచి అహంకారము "నిద్రపోవు వానిని లేపవలదు. ఏలయన ఈపరమానంద రూపముమేల్కొనగానే నీవుఉండవు, నేనునుండను,జగమునుండదు,అన్నిటికిఅజ్ఞాన రూప మూలముతో తొలగుట రూప బాధ కలుగుచున్నది" అని చెప్పినది. అయినను ఉత్తమజాతి కన్యవలె ఉత్తమ సంస్కారము గలదైన బుద్ధి, బాధరూప ప్రాయశ్చిత్తము కొఱకు వానిని లేపుచున్నది. అనునది అర్థము.

102. ఇప్పుడు ఆత్మయగురాజు సంసారమగు దేశాంతరమున పోవుట వచ్చుటయగు యాత్ర సమయమున బుద్ధిరూప దాసితో తాదాత్మ్య అధ్యాసరూప ప్రీతింజేసి దానిని మహారాణియని కల్పించి శరీరరూప తన నగరమున హృదయరూప అంతఃపురమున నిలిపెను. అయితే అటుఅది శోకముగలది యాయెను. దానిశోకము పోగొట్టుటకొఱకు అనేక విధములగు మతవాది గురువులగు వైద్యులనడిగెను. అయినను వారుదానిబయిటి వృత్తియగు నాడియందు రోగమును గానక పోవుటచే శోకమును పోగొట్టు ఉపదేశరూప ఔష

ధమునీయలేదు. ఇట్లుచేయుచుండ ఎప్పుడు బ్రహ్మనిష్ఠగురువగు
నొకసమర్థ వైద్యుఁడు దొరకునో అప్పుడు దానిని ప్రశ్నించు
మూలముగా జగత్తురూప స్వర్ణకారుడగు తన ప్రియతమునకు
(అధికప్రియుఁడు) కోరినట్లు దొరకనిదగు వియోగముచే గలి
గిన శోకమగు నిమిత్తమును దెలిసి దానిని అధ్యారోపమూల
ముగా సమీపమునకుఁదెచ్చి భేదజ్ఞానమగు వివేకకాలమందు
రెండవ రూపముగా ఆత్మయగు రాజువద్దను స్థాపించెను.
పిమ్మట ఆమెకు శోభనాధ్యాస (రమణీయత్వము) రూపరక్త
మును చెఱను దోషదృష్టి యను రసమును ప్రతి దినమును
త్రాగించి దానియందు విరసత్వపు విరూపత్వమును సంపా
దించు మూలమున బుద్ధియగుదాసికి వైరాగ్యమును సంపా
దించి ఆత్మయగు రాజునందు ప్రీతిని వృద్ధిపఱచెను. అప్పుడు
మిథ్యాత్వము నెఱుఁగు దృఢవైరాగ్యమును గలిగించుదాని
(జగద్రూప స్వర్ణకారుని) నాశము (బాధము) కలిగెను. ఇట్లు
బుద్ధిరూప దాసియగు నది నానావిధ కుమాయలగు జగమును
స్వర్ణకారునివద్ద (కలియుటను జేయునితనయొక్క వ్యభిచారము
గల మిత్రునియొద్ద దోషదృష్టిచే గాన్పింపగా మిథ్యాత్వము
నెఱుఁగుటచే కనఁబడినది యయిన వైరాగ్యమును సంపాదించి
నిత్యప్రాప్తియగు ఆత్మయను రాజునొద్ద పరమఅడ్డులేని) ప్రీతిని
చేసి సర్వ శోకముల నివృత్తిపూర్వకముగా పరమానందమును
బొందెను. అందుచే దాని అధ్యాసచే శోకము గల వానివలె
నుండిన ఆత్మయగు రాజున్ను శోకములేని వాఁడును ఆనంద
రూపుఁడునై ఎట్లోయట్లేకనబడెను' అను రూపకమును శిష్యుఁడు
స్మరించి చెప్పెను.
103 శ్లో॥ నిర్దోషోనిశ్చలోనాథః సదోషా చంచలావధూః।

దంపత్యోరనయోర్యాన్నంతరసభంగో భవిష్యతి॥ ౧
పృథక్త్వేనపరిజ్ఞాతా దుష్టరూపతయాఽఽత్మనః
నముఖందర్శయత్యేషా సలజ్జాప్రియతేఽపిచ॥ ౨

అను రెండుశ్లోకముల అర్థమును బుద్ధియందుంచుకొని శిష్యుడు చెప్పుచున్నాడు:— ఆత్మయగునాథుండు (పతి) నిర్దోషమును (అవ్యభిచారియు) నిశ్చలమును (అవికారియును) నై యున్నాండు. బుద్ధియను స్త్రీ యనునది వ్యభిచారదోషము గలదియు వికారియునై యున్నది. ఈదంపతు (స్త్రీ పురుషులు) లందు నిశ్చయముగా రసభంగమగును బయటిచూపునుగల బుద్ధియగు స్త్రీకి ఆత్మయొద్ద ప్రియము లేనందున. అయితే యెట్లో యొకట్లు (విశేషముతో) వ్యభిచారము నడచుచుండెడిది. ఎప్పుడు గురువగు పరమమిత్రునిమూలముగా ఆ స్త్రీని ఆత్మ (తన) కంటె వేఱగుటచేతనుదృశ్యమగు జడమను అనిత్యత్వరూప దోషముతోం గూడుటచేతను దెలిసికొన్నాండో, అప్పుడు అది కర్తృత్వము భోక్తృత్వము మొదలగు తన ధర్మమగువాటితో తాదాత్మ్య అధ్యాసమైన, తన ముఖమును చూపుటలేదు. యేబుద్ధిగలదో యామె యిక్కలి యుత్తమసంస్కారమగు లజ్జతోగూడినదగు కాలము నిర్వికల్పసమాధియైన ఆనందసాగరమున మునిగి మరణమును బొందుచున్నది.

104 శ్లో॥ యేన చేతయతే విశ్వం విశ్వంచేతయతే న యం।
యో జాగర్తిశయానేఽస్మి న్నాయంతంవేదవేదసః॥

అను శ్రీమద్భాగవతపు యెనిమిదవ స్కంధమందుండు మనుస్తుతి వాక్యార్థమును శిష్యుండు అనుభవగోచరముచేసి చెప్పుచున్నాడు:— దేనిచేత (ఏచేతనమగు పరమాత్మచే) విశ్వము (జగత్తు) చేతనమును బొందుచున్నదో? (చేష్టచేయు

చున్నదో) దేనిని (ఏ ఆత్మను) విశ్వము, చేతనముతో (చేష్టతో) గూడినదిగాఁ జేయుటలేదో, ఇది (విశ్వము) నిద్రింప ఏదిమేల్కొనియున్నదో, వానిని, వీడు (సంఘాతరూపపురుషుఁడు) ఎఱుఁగుటలేదు. అది (వానిని) నెఱుఁగుచున్నది.

105 శ్లో॥ లోకాశ్చభ్రాంతిపరమే మయి మోహజన్యాః ।
స్వప్నేంద్రజాల మరునీరసమావభాసాః॥
వ్యుత్థానకాల ఇహానస్యురలంవిచిత్ర
ప్రత్యక్సుఖాబ్ధి పరమామృత చిత్తవృత్తౌ॥

అను శ్లోకార్థమును, మనస్సునగొని శిష్యుఁడు చెప్పుచున్నాఁడుః — స్వామీ! సమాధినుండియు, మేల్కొనినకాలమున పరబ్రహ్మమయిన నాయందు, స్వప్నము, ఇంద్రజాలము ఎండమావులనీరు, అనువానికి సమముగా అవభాసముఁగల మోహము (అవివేకము) చేఁగనఁబడులోకములు (చరాచరములగు జీవులును, వానికాశ్రయమయిన పదునాలుగు భువనములును, వానిభోగ్యమగు అన్నాదులును, అన్నిటికిని కారణమైన, స్థూల, సూక్ష్మ భూతములును) కాన్పించుచున్నవి. అయితే యీపరిపూర్ణవిచిత్ర (అలౌకిక) ప్రత్యక్ (లోపలి) సుఖముయొక్క సముద్రమయిన పరమామృత సంబంధముగల చిత్తవృత్తియందు (లోపల) ఆ లోకములుండుటలేదు.

106 శ్లో॥ నిరతిశయసుఖాబ్ధౌ స్వప్రకాశేపరేఽస్మిన్ ।
కథమిదమవివేకాదుత్థితం ప్రశ్నఏవ॥
క్వచతమధునాతద్దేశికో వాశ్రుతిర్వా ।
పరమవిమలబోధే భ్యుత్థితేఽహంనజానే॥

నిరతిశయ (అన్నిటికంటె అధికమయిన) సుఖసముద్ర

మున నీయున్నిజగములును, రజ్జువందు మాలయును, సర్పము వలె, నవివేకముచే నెట్లుకలుగుచున్నది? ఇప్పుడు మేలైన విమలబోధము కలుగగానే యదెక్కడదాగియున్నది? లేక దేశికుడైనను, శ్రుతియైనను, నెక్కడపోయెను? అనుదాని నే నెఱుఁగను.

107 శ్లో॥ ప్రకాశంచ ప్రవృత్తించ మోహమేవ చ పాణ్డవ।
న ద్వేష్టిసంప్రవృత్తాని న నివృత్తాని కాంక్షతి॥

సాత్వికవృత్తుల సమూహమయిన ప్రకాశ (సత్వగుణ) మునురాజసవృత్తుల సమూహమయినవృత్తిని (రజోగుణమును) తామసవృత్తుల సమూహమయిన మోహ (తమోగుణ)మును (వీనియందు) చక్కగా ప్రవర్తించిన వాని (రజోతమో పరిణామముల)యందు ద్వేషము చేయుటలేదు; నివృత్తియైన వాని (సత్వగుణ పరిణామముల యందు ఇచ్ఛచేయుట లేదు. [ఈ మొదలగు లక్షణములతోఁ గూడిన వాఁడెవఁడో వాఁడు గుణాతీతుఁడనఁబడు చున్నాఁడు] అనునీ మొదలగు గీతయొక్క పదునాలుగవ అధ్యాయమందుజెప్పిన గుణాతీతుని లక్షణముల తనయందుంచుకొని యిప్పుడు శిష్యుఁడు చెప్పుచున్నాఁడు.— ప్రకాశము, ప్రవృత్తి, మోహము, అను గుణములు మూఁడు వానిలో ప్రవర్తించిన కామక్రోధాది రూపములున్న నిద్ర, సోమరితనము, ప్రమాదము (సోలుట) డంభము మొదలగు నవియైన రజోతమోగుణముల పరిణామముల నేను ద్వేషించుటలేదు, వానికి సాక్షియగు నాకుచెఱుపు లేనందున నివృత్తియగు శమ, దమ మొదలగు సత్వగుణ పరిణామములఇచ్ఛయు నాకులేదు. వానికి సాక్షియగు నాకు లాభమును లేనందున,

108. బ్రాహ్మణుఁడు, క్షత్రియుఁడు, వైశ్యుఁడు,శూద్రుడు

అతిశూద్రుఁడు మొదలగు సకల జనులయందును దేహమొ దలగు సంఘాతముల అభిమానము లేక ముందేసామాన్యముగా "అహం (నేను) అనుప్రత్యయము (శబ్దము జ్ఞానమును) కలుగు చున్నది. దానికివిషయమగుటచేపొందఁబడిన చిత్తు(చైతన్యము) ఏదియో యది ఎవనికి పరోక్షమగును? ఒకనికిని కానేరదు. అందఱికిని అన్నివేళలందును అపరోక్షమే యగును. కావున నెఱుఁగబడని (విజ్ఞానమునకును విషయముకాని)దిగా నున్నను అపరోక్షముగా నుండుటచే స్వప్రకాశముగా నున్నది. ఇందు చేతనే నేను "తెలియఁబడనిదై నిత్యఅపరోక్షమగును" అను లక్షణము గల స్వయంప్రకాశుఁడనై యున్నాను అని నేను తమకృపచే నిశ్చయము చేసితిని.

109. ఒకరాజునగ్గఱ నిత్యము కథనుజెప్పు అజ్ఞానియగు పండితుని మంత్రిప్రేరణచే రాజసభయందు వచ్చినయొక పండి తుఁడు ౧ పరమేశ్వరుఁడెక్కడ యున్నాఁడు? ౨ పరమేశ్వ రుఁడేమి చేయుచున్నాఁడు ౩ పరమేశ్వరుఁడేమి భుజించు చున్నాఁడు ౪ పరమేశ్వరుని ముఖమేదిక్కుచూచి యున్నది. అని నాలుగు ప్రశ్నలు చేసెను.

అప్పుడా పండితుఁడుత్తరమీయలేదు. అయితే "ఇట కథచేరిక కావలసియున్నది. కావున నిప్పుడు బదులుచెప్పు నవ శ్యము లేదు. రేపుఒక ఘంటకు ముందేవచ్చి వీనికిబదులుచెప్పె దము" అనిచెప్పి కథపూర్తిచేసి యింటికిఁబోయి తనపుత్రునిఁ జూచి ఆపండితునిచేఁ జేయఁబడిన ప్రశ్నలకుత్తరమీయ నావ లన గానేరదు. ఉత్తరమీయక పోయిన నాప్రతిష్ఠకు భంగము గలుగును. కావున నొకయూపాయము అభినిమందు కానిరమ్ము నేఁడుదానిందిని చెప్పెదను"అనిచెప్పెను. దీనినివిన్న జ్ఞాననిష్ఠుఁ

డైన వానిపుత్రుఁడు "వీనికి బదులు తమ బిడ్డను నేనుచెప్పఁ గలను. అన అప్పుడు వాఁడుచావలేదు. పిమ్మట మరుదినము ఆపండితుఁడును నీపండితుఁడును కథకు ఒకఘంటసేపు ముందు శిబికయందు గూర్చుండి రాజసమ్ముఖమునకు వచ్చిరి. అప్పుడు రాజుయొక్క పండితుఁడు "ఈప్రశ్నలకు బదులు నాకుమారుఁడు ఇచ్చును" అనిచెప్ప దానిని వినిరాజు పల్లకిపంపి వాని పుత్త్రుని రప్పించి యుత్తమాసనమునఁ గూర్చుండ నుంచి ప్రశ్నించెను. అప్పుడాతఁడు చెప్పినది:—

ఒక నీరునిండిన కుండను దెప్పింపుడు. అనఅట్లే తెప్పించెను. దానియందొక శేరుకలకండ వేయుఁడన, వేసెను. అది కరగిపోగా ఈనీళ్లలో వేసిన కలకండ యెక్కడ యనియడిగెను. అప్పుడు రాజన్నిచోట్ల యున్నదనెను. ఇదిమొదటి ప్రశ్నమునకుత్తరమైనది. పండితుని పుత్రుడు ఇట్లు పరమేశ్వరుడన్ని జగమునగలడు ఎక్కడ నున్నాడు అనెను.

౨ (౧) పిమ్మటపండితుని పుత్త్రుఁడు "రాజా! తానొక ఘడియసేపు రాజ్యాధికారమును విడిచి నాయొద్ద నీయుఁడు" అనెను. దానివిని రాజట్లేచేసెను అప్పుడుపండితుని పుత్త్రుఁడు తాను సింహాసనమెక్కి రాజును చెరయందుంచెను. అట్లుంచి 'ఎట్లు పనివాఁడనగు నేనొకక్షణమున రాజైతినో రాజగుతామే తక్షణమునయట్లు సేవకుడైతిరో యట్లుసగుణరూపమున పరమేశ్వరుఁడు క్షణములో బీదవానిని రాజుగా నైనను శ్రీమంతునిగానైనను జేయుచున్నాఁడు. రాజునైనను శ్రీమంతునైనను బీదనుగాఁజేయుచున్నాడు అనిచెప్పి మరలరాజును తనపదమందుంచెను.

(౨) లేకఎట్లు రాజుతాను అకర్తగానుండనాతని మంత్రి

మొదలగువారు యుద్ధము ప్రజలను గాపాడుట మొదలగునవి యైన కార్యములను జేసినను అన్నిపనుల ఆరోపణయు రాజునందు గలుగుచున్నదో అట్లేనిర్గుణరూపముగా పరమేశ్వరుడు తాను ఉత్పత్తిమొదలగు కార్యములను జేయని వాఁడైనను మాయమొదలగు వానిచేఁ జేయఁబడు ఉత్పత్తి మొదలగు కార్యముల ఆరోపము ఆతనియందే చేయఁబడు చున్నది.

(3) రాజో తాను జేయుట లేదు. అయితే సేవకులగోని క్రియలను చేయించుచున్నాఁడు. దీనిచే వికారియగునను అరుచిచే వేరు దృష్టాంతము చెప్పబడు చున్నది.

లేక, యెట్లు భరతునిచే రాజ్యపరిపాలనాది కార్యములు జేయఁబడినను "శ్రీరాముని పాదుకలు రాజ్యాదులను జేయుచున్నవి" అని రాముపాదుకలందు ఆరోపింప బడుచున్నదో యట్లు మాయప్రకృతిచే సృష్టిమొదలగు కార్యములు గలుగు చుండియు బ్రహ్మమునందు దాని ఆరోపము గలుగుచున్నది. లేక ఇట్లు నిర్గుణరూపముచే పరమేశ్వరుఁడు చేయుచున్నాఁడనుట ఉపచారమాత్రమగును. ఇది౨-వ ప్రశ్నమునకుత్తరము.

3. ఎట్లు సోపాధిక (శాన్తము మొదలగు ఉపాధులందైక్కి యుండు) అగ్ని హోమము చేయఁబడిన ద్రవ్యము మొదలగు వానిని భుజించునదైనను నిరుపాధిక రూపముచే అగ్ని అభోక్త యగుచున్నదో యట్లుసన్న్యాసి సాధుబ్రాహ్మణుఁడు ఆకలిచే -పడువాఁడు అనువానియందు ఈశ్వరార్పణ బుద్ధిగా నివ్వ భోజనమును విరాట్టుమొదలగు సోపాధిక (సగుణ)రూప పరమేశ్వరుఁడు భుజించుచున్నాఁడు నిరుపాధిక (నిర్గుణ) ముచే నతఁడు అభోక్తగా నున్నాఁడుఇదిమూఁడవ ప్రశ్న కుత్తరము,

శి. దీపవత్తి చేయించి దానిని ముట్టించి, పండితునిపుత్రుడు "దీని(దీపవత్తి) ముఖము ఏదిక్కును జూచుచున్నది" అని యడిగెను. అప్పుడందరు అన్ని దెసలను జూచుచున్నది యన పండితునిపుత్రుఁడు "అట్లే పరమేశ్వరుఁడును అన్ని దిక్కులను జూచుచున్నాఁడు వాస్తవముగ ముఖములేని వాఁడగును" అనెను ఇదినాల్గవ ప్రశ్నమున కుత్తరము.

ఈప్రసంగమును మనస్సునగొని శిష్యుఁడు పైఁజెప్పిన లక్షణములు గల పరమేశ్వరుఁడు నేనే యనెను.

110 ఆదౌమనస్తదనుబంధ విమోక్షదృష్టిః
పశ్చాత్ప్రపంచరచనాభువనాభిధానా।
ఇత్యాదికాస్థితిరియంహిగతా ప్రతిష్ఠా।
ఆఖ్యాయికాసుభగ బాలజనోదితేవ॥

అను వాసిష్ఠశ్లోకముయొక్క అభిప్రాయమును శిష్యుఁడు మనస్సునగొని చెప్పుచున్నాఁడు:— ఆదియందు మనస్సు (లేచుట) కలిగెను. దానివెనుక బంధమోక్షములదృష్టికలిగెను. పిమ్మట బంధదృష్టియందణగిన పదునాలుగు భువనములను ప్రపంచసృష్టికలిగెను. ఈ మొదలగుసృష్టియొక్క స్థితి మంచి బిడ్డలకొఱకు, దాదిచెప్పినకథవలె ప్రతిష్ఠను (వినువానిచిత్తమున కెక్కుటను) కలిగియున్నది. ఎట్లు ఒకదాదియగునది, ఏడ్చుచున్న బిడ్డకు వినోదముగా, బాబూ! నేను నీకొక కథ చెప్పుచున్నాను వినుము:- ఒకశూన్యనగరముండెడిది. అందు ముగ్గురు సుందరరాజకుమారులుండిరి. వారిలో నిద్దఱుపుట్టుకలేనివారు, ఒకఁడు గర్భమందును రాలేదు. ఆరాజకుమారులు వేటాడిరి. ఆకసమున పండినవృక్షములంజూచి వానిక్రిందఁగూర్చుండిరి. ఆవృక్షములుఎట్టివియన అందు రెండో! మొలియలేదు. ఒక్కటికి

విత్తు లేకయుండెను. స్వర్గలోకము వరకు ఎత్తుగా పెరిగియుండెను. అని యుల్లు చెప్పెను. (వాసిష్ఠమున) చెప్పిన ఈ మొదలగు కథలనువిని బాలుఁడు, విచారములేక బుద్ధితో నిశ్చయమును పొందెను. అట్లే శ్రుతి యీ యజ్ఞానులకు విషయదృశ్యమగు సృష్టిని బోధించుటకొఱకు ముందుచెప్పిన (మనస్సు మొదలగు) ఆకాశాదిసృష్టి అజ్ఞానులకు చిత్రముగను ముందుచెప్పిన రాజకుమారులకథనుబోలి భ్రాంతిచేఁగనఁబడుచున్నది. దానిక్రమమును చెప్పి (అనువదించు) చున్నది దానివిని ఈయజ్ఞానులు సత్యమని నిశ్చయమునొందుచున్నారు. అయితే యీశ్రుతికి సృష్టిని చెప్పుటలో తాత్పర్యములేదు. వీనిచిత్తమందుండు జగముయొక్క సత్యత్వమును నివర్తించుటకొఱకు ఏయేవిధములైనను సృష్టి నారోపించి దాని అర్థమును విచారించుటచే సహజముగా అపవాదము చేయించుటవలన అద్వైతతత్త్వమును బోధించుటయందు తాత్పర్యమున్నది.

11. ఇప్పుడు దేహమందు కూటస్థ చిదాభాసుల భేదమునెఱిఁగి కూటస్థ (సాక్షి) స్వరూపముయొక్క భేదము తనకు సిద్ధించెనని సూచించుటకొఱకు శిష్యుఁడు వీనిఁజెప్పుచున్నాడు:-

ఆకసమందుండు సూర్యునిచేఁ బ్రకాశింపఁబడిన గోడయందు ఎట్లు అద్దపు సూర్యప్రకాశము (ఎండయందుంపఁబడిన అద్దములందుండు సూర్యుని ప్రతిబింబప్రకాశము) కలుగుచున్నదో, యట్లే సాక్షిచే (కూటస్థచేతనముచే) ప్రకాశింపఁబడిన దేహబుద్ధియందుండు చిదాభాసునిచే విశేషప్రకాశము కలుగుచున్నది. అనేక అద్దములందుండు సూర్యుని గోడయందుపడు అనేక ప్రకాశములు సంధియందును సకల అద్దములు అభాసకాలములందును ఆకాశమందుండు సూర్యుని సామాన్యప్రకా

శము కలుగుచున్నది. దానివలె జాగ్రత్స్వప్నముల వృత్తుల సంధులయందును, సుషుప్తియందు సకలవృత్తులు లేమియందును, నెడతెగక కూటస్థుడగు నాయొక్క సామాన్యప్రకాశమున్నది.

ఇప్పుడు కూటస్థదీపమందు చెప్పినదగు దేహముయొక్క బయట చిదాభాసబ్రహ్మచేతనముల వివేకమును నాకుసిద్ధించినది. అనుదానిని సూచించుకొనుటకు శిష్యుఁడు చెప్పుచున్నాడు:- ఘటాకారమగు బుద్ధియందుండు చిదాభాసుఁడు ఘటమునే అవభాసము (ఇదిఘటమనిప్రకాశము) చేయుచున్నాడు. ఘటముయొక్క జ్ఞాతత్వమును అజ్ఞాతత్త్వమునునే బ్రహ్మము (బయటి చేతనము) ప్రకాశింపజేయుచున్నదో,

అనగా ఘటరూపబుద్ధి పుట్టునప్పుడు బుద్ధియందుండు చిదాభాసుఁడు (కల్పితవిశేష చైతన్యము) ఇదిఘటమని ఘటమాత్రమును తెలియుచున్నది.

ఘటాకారబుద్ధి ఉదయించుటకుముందు ఘటమందున్న "ఘటమును నేనెఱుఁగను" అను అనుభవమునకు విషయమగు అజ్ఞాతత్వమును అజ్ఞానరూపవిశేషముతో "ఘటమును, నేనెఱుఁగ" అనునట్లుగా బ్రహ్మచైతన్యము ప్రకాశింపజేయుచున్నది.

ఘటాకారబుద్ధి ఉదయమయిన పిమ్మట ఘటమందు "ఘటమును నే నెఱుఁగుచున్నాను" అను అనుభవమునకు విషయమయిన, ఏజ్ఞాతత కలిగియున్నదో దానితో ఘటరూపజ్ఞేయమును, నేను అనుపదమునకు అర్థమగుబుద్ధియందుండు చిదాభాసరూపజ్ఞాతను దాని జ్ఞానరూపవిశేషణమునున్ను ఘటమును నే నెఱుఁగుచున్నాను" అనునట్లుగానే బ్రహ్మచేతనము ప్రకాశింపజేయుచున్నది. ఘటాకారవృత్తియందుండు

చేతనము సాక్షియగును. దానిచే త్రిపుటియొక్క (జ్ఞాత జ్ఞాన జ్ఞేయముల) ప్రకాశము సంభవించుచున్నది. అయినను ఆకార మను అక్షరము తెల్లనికాగితమున శబ్దమాత్రభేదముగానుండు టవలె సాక్షికిన్ని బ్రహ్మమునకును శబ్దమాత్రభేదమగును. కావున నిటసాక్షియే బ్రహ్మశబ్దముచే చెప్పఁబడియున్నది. దీనిచేతనే యీ సామాన్యచేతనరూప బ్రహ్మము ఘటాకాశము కంటె మహాకాశము భిన్నముకానియట్లు? సామాన్యచేతనరూపమగునది కూటస్థుడనగు నాకంటె వేఱుకాదు. కావున "నేను బ్రహ్మము" అనునది అట్లుచెప్పుటలో రహస్యాభిప్రాయమగును.

112. మఱియు స్వప్రకాశరూపముగా ఆత్మయొక్క స్వరూపమును శిష్యుఁడు చెప్పుచున్నాఁడు:- శరీరమను నృత్యశాల యందు చిదాభాసరూపజీవుఁడు రాజు, వానిదగ్గఱమనస్సనునది మంత్రి, పంచప్రాణములు పనివారు, శబ్దము మొదలగు విషయములైదును, సభలోనివారు (సభికులు), శ్రోత్రము మొదలగు దశేంద్రియములు వాద్యగాండ్రు, బుద్ధి ఆటకత్తె సాక్షి (ప్రత్యగాత్మ) దీపము, అవన్నియు దీనిసన్నిధియందున్నవి. మఱియు అది జాగ్రత్ స్వప్నములివన్నియునుండినను అప్పుడున్ను ప్రకాశించుచున్నది. సుషుప్తియందు ఇవియన్నియు లేకపోయినను అప్పుడు దానిని (లేనిదానిని) ప్రకాశింప జేయుచున్నది. అదియే నేను.

అనేక రంధ్రములతోఁగూడిన ఘటముయొక్క లోపలి భాగమునగల దీపమునువలె, విశేషముగా ప్రకాశించు దేని జ్ఞానము ఇంద్రియరూప బహుతూంట్లచే బయటప్రకాశించుచున్నదో, [ఎఱుఁగుచున్నానని, దానిప్రకాశము కలిగినపిమ్మట ఈసకలజగత్తును ప్రకాశించుచున్నదో] ఆప్రకాశము (ప్రకాశ

రూపచేతనము) నేను.

స్నేహము (తైలము) దశ (వత్తి) పాత్రము (ఆధారము) ఇవిలేని యొక (మనోవాక్కులకు విషయముకాని) బ్రహ్మమయిన దీపము ప్రకాశించుచున్నది. ఈదీపము మూడు లోకములను నొక (అనిర్వచనీయ) అంజనమును (నలుపును) వివేకించిచూపుచున్నది. అదియే నేను. ఈయర్థము.

శ్లో॥ దీపః కోఽపిసమింధే స్నేహదశాధారహీనమస్పందః ।
తదుపరికిమపితమ(స్త్రం) త్రైలోక్యమధో వివిచ్యదర్శయతి॥

అను సిద్ధాంత చంద్రికోద్ధారగ్రంథవాక్యమున చెప్పబడియున్నది.

113. ఇప్పుడు ఆత్మయొక్క పరమానందమును శిష్యుడు అనుభవగోచరముచేసి చెప్పుచున్నాఁడు. "చదువుచుండెడు అనేకబాలురమధ్యనుండు ఒకనిపుత్రునియొలుగు (కంఠధ్వని) సామాన్యముగా వానితండ్రికి వినఁబడినను అనేకులతోఁజదువుటయను ప్రతిబంధముచే ఇది నాపుత్రుని స్వరమని విశేషముగా తెలియుట లేదు. అట్లు పరమానందుఁడగు నేను సామాన్యముగా పరమప్రీతికి విషయమయియుండుటచే ప్రకాశించియు (వ్యక్తమయ్యి) లేదు, కనఁబడలేదను ఆవరణము అను ప్రతిబంధముచే "నేనేపరమానందరూపుడను" అని విశేషముగా గనిపించుటలేదు, అని విచారించి "సామాన్యముగా ప్రకాశించు (తెలియుచుండు) పరమానందము ఏదియో యది నేను" అని శాస్త్రము, గురువు, తనయనుభవము అనువాని కృపచే, నాసుఖరూపమును, విశేషించి యెఱిఁగితిని."

114. ఇప్పుడు శిష్యుఁడు అనేకమతముల అపవాదముతో శ్రుతియందు పొందబడిన నిజస్వరూపమును జెప్పుచున్నాడు.

స్త్రీ, శిశువు, గ్రుడ్డివాఁడు, జడుడు అనువారికిసమమగు చార్వా కుడు (౧) ప్రాణోపాసకుఁడు (౨) ఇంద్రియాత్మవాది (౩) క్షణిక విజ్ఞానవాది (౪) శూన్యవాది, మొదలగువారు (నైయ్యాయికులు మొదలగువారు) (౫) అను, వాదులు ఎక్కడ భ్రాంతులయి క్రమముగా దేహము (౧) ప్రాణము (౨) ఇంద్రియములు (౩) బుద్ధి (౪) శూన్యము అజ్ఞానము మొదలగునవి (౫) అను వానిని తానని చక్కగా నెఱుఁగుచున్నారో, ఆకొలత లేనిది (అణుపొట్టి పొడుగు మొదలగు పరిణామములు లేనివి) తానగు (ఆత్మయగు) నేనైయున్నాను.

115. ఇప్పుడు శిష్యుఁడు మాయ యొక్క ఆశ్చర్యరూపమును జెప్పుచున్నాఁడు:—

ఒక (అనిర్వచనీయ) నల్లని (మేఘమాతరూపమగు మాయ) యెప్పుడు చిదాకాశమందు భువన (పదునాల్గు లోకముల) రూపజలమును (సృష్టించినదగు వర్షమును) కురియుచున్నదో అప్పుడు బ్రహ్మ మొదలగు జీవులగు తుచ్ఛమగు కప్పలు (మండూకములు) నాల్గు ప్రక్కల దుముకుచున్నవి.

ఒక (యనిర్వచనీయమగు) ముసలి (అనాది కాలపు) అసత్తైనది (సత్తుకంటె విలక్షణ మయిన మాయయగు వేశ్య) సంగము లేకయే అసంగపరమగు పురుషుని కలిమియంతయు (ఆత్మస్వరూపమగు ధనమును) దొంగిలించుచున్నది. అయ్యో ఈలోకమందుండు చెడుగునేమని చెప్పుదు యేమియు చెప్పఁగానేరదు.

116. ఇప్పుడు ఇంద్రజాల రూపముగా జగముయొక్క మిథ్యాత్వమును జెప్పుచున్నాడు:—

గర్భమందున్న బిందువగునదిసాంగోపాంగముగా(చేయి,

కాలు, తల, మొదలగు అంగములును (వేలు మొదలగు ఉపాంగములు కలిగి) గర్భముతోఁగూడినదై క్రమముగా శిశుత్వము మొదలగు అనేక వేషములతోఁ గూడినదయ్యి శ్రవణాదులును గమనాదులును నగు పనులు చేయుచున్నవి. దీనికంటె వేఱు ఇంద్రజాలమేమి? ఒక్కటియు లేదు. అయితే యిట్లుకలుగువటవృక్షము మొదలగు రూపము గలదగు నీజగత్తంతయు నింద్రజాల మగును. కావున మిథ్యయగును.

117. ఇప్పుడు ఈశ్వరుఁడు, గురు, ఆత్మ, అనువానికి వాస్తవముగా నేకరూపత్వము చెప్పువాఁడై శిష్యుఁడు తన ఆత్మకు దేహాభిమానమునువిడుచుటకో అదినేననుచింతనరూపు నమస్కారము చేయుచున్నాడు:—

ఈశ్వరుఁడు, గురువు. ఆత్మ, అనురూపముచే భేదమయి ఒక్కటిగాఁ బ్రకాశించు పరమగునాకు అనేకనమస్కారములు ఇది.

"శ్లో॥ ఈశ్వరోగురురాత్మేతిమూర్తి భేదాద్విభాగినే।
వ్యోమవద్వ్యాప్తదేహాయ దక్షిణామూర్తయేనమః"

ఈశ్వరుఁడు, గురువు, ఆత్మయును మూర్తి భేదములచే వ్యాపకమును బొంది ఆకాశమువలె ఏవానిదేహము వ్యాపింపఁబడియున్నదో యట్టిదక్షిణామూర్తికి నమస్కారము" అను వార్తిక కారుని వాక్యార్థము చెప్పఁబడినది.

118. ఈవిధముగా (శ్రీ)గురువుగారి ప్రార్థన పూర్వకముగా తన ఆత్మను నమస్కరించి ఇప్పుడు తనకిష్టమగు శివుడు మొదలగు పేరులు గల ఈశ్వరుని యందు శిష్యుఁడు అభేదముగా ప్రార్థించు చున్నాఁడు:—

శివా! తాము నాయాత్మయయి యున్నారు. మతి(బుద్ధి)

శివ (పార్వతి) యగును పంచ ప్రాణములును నందికేశ్వరుఁడు మొదలగు పరివారములగును. శరీరము గృహమగును. శాస్త్ర విరోధములేని ప్రారబ్ధఫలమగు శబ్దాదివిషయముల భోగము అర్చనయగును. నిద్రయు, నడచుటయు క్రమముగా ధ్యానమును (సమాధియు) ప్రదక్షిణమునగును.

ఇట యిఁక రహస్యము.—ఎట్లు సమాధియందు అజ్ఞానము మొదలగు ప్రపంచ అభావము గలిగి నిష్ప్రపంచస్వస్వరూపమే మిగులుచున్నదో అట్లు జ్ఞానికి తత్వజ్ఞానముచే మిగతలేని అజ్ఞానము (ఆవరణము) చెడుటవలన వానికి సుషుప్తి యందును అజ్ఞానమును స్థూలసూక్ష్మ ప్రపంచములును లేని విషైస్సిద్ధించుచున్నవి. ఆ లేమిసిద్ధింపగానే నిష్ప్రపంచస్వరూపమే మిగులుచున్నది. కావున జ్ఞానియొక్క నిద్రయు సమాధికి సమానమైయుండుటచే దానిని సమాధియనుచున్నారు. జ్ఞాని తనఆత్మయయిన శివుని యొక్కడను నుండునదిగా (వ్యాపకముగా) ఎఱుఁగుచున్నాఁడు. కావున వాని అటుయిటు నడచుట యయినది యాశివుని ప్రదక్షిణమునకు సమానమగును. వాఁడుచ్చరించు సకల వాక్యములును స్తుతులగును.

దీనిరహస్యమిది:— ఘటము మొదలగు సకలశబ్దముల వాచ్యార్థము ఆయాయాకారముతో గూడిన అస్తిభాతి ప్రియ రూపబ్రహ్మమగును. ఆయాఆకారత్వమును విడిచిమిగిలి యున్న అస్తిభాతి ప్రియరూప బ్రహ్మము ఆశబ్దములలక్ష్యార్థమగును కావున లక్షణావృత్తిచే సకల వచనములును బ్రహ్మమునే (ఆత్మనే) విషయము చేయుచున్నవి.

లేక జ్ఞానియొక్క సకలవచనములును, లక్షణచేయుట లేకయే శక్తివృత్తిచేతనే శుద్ధబ్రహ్మమును (ఆత్మను విషయము

చేయుచున్నవి. వానికి సర్వజగమును బ్రహ్మరూపముగాఁగన బడుటచే —

వీనిచే నేను ఏయేకర్మముల చేయుచున్నానో యవి శివా! తమ యారాధనమే యగును. అనునది.

శ్లో॥ ఆత్మాత్వం గిరిజామతిస్సహచరాః ప్రాణాః శరీరంగృహం
పూజా తేవివిధోపభోగరచనా నిద్రాసమాధిస్థితిః।
సంచారాస్తుపదోః ప్రదక్షిణవిధిః స్తోత్రాణిసర్వాగిరో।
యద్యత్కర్మకరోమి తత్తదఖిలం శంభోతవారాధనం
అను శ్లోకముయొక్క అర్థమగును.

శ్లో॥ హిమగిరితనయా హిమాంశులేఖా।
సరిదతిశీతలవాహినీ సురాణాం॥
త్రిభిరేతైరతి వేపితోఽసిశంభో।
మమహృదివి విశత్రితాపతప్తే॥

అను అప్పయ్య దీక్షితపండితుల వాక్యార్థమును అనువాదముచేయువాఁడై శిష్యుఁడు తన యిష్టదైవమగు శివుని ప్రార్థన జేయుచున్నాఁడు:-

శంభో! మంచుకొండకూతురు (పార్వతి) చంద్రుఁడు శీతలమగు దేవనది (జడయందుండు గంగ) అనుమూఁడును శీతలములే. ఈమూటిచేతను తామిక్కిలి చలిచే వణకుచుండుటచే ప్రియముకలుగునట్లు నాహృదయమున ప్రవేశింపుము. ప్రవేశించినట్లయిన, తమమూడు శీతలములున్నపోవును. నా మూఁడుతాపములునుతీరును.

ఇట యిది రహస్యము:- శివునిమూర్తి తనదృష్టిని విడుదలలేక దానిమూఁడు శీతలముల మిథ్యాత్వనిశ్చయరూప అపరోక్షబాధము సంభవింపదు. తన దేహభావదృష్టిని విడుదల

లేక మూఁడువిధ తాపమిథ్యాత్వ నిశ్చయరూప అపరోక్ష బాధము సంభవింపదు. శివునికిని తనకునుగల ఉపాధిదృష్టిని విడుటచే నిరుపాధికమగు పరమశివునికిని ఆత్మకునుగల ఏకత్వ జ్ఞానము లేని వేఱువిధమగు ప్రవేశము మనస్సున సంభవింపదు కావున ఓశివా! తాము నిరంతరము నాతో అభేదనిశ్చయమగు తత్త్వజ్ఞానమునకు విషయమగుదువుగాక! అనునది రహస్యమయిన అభిప్రాయము.

శ్లో॥ త్వయిమయిచగణ్యమానే మహాన్

మహతోఽహమేవ దేహదృశా।

విశ్వాధిపేశ! తే మే సద్బోధానంద పూర్ణతాతుల్యా॥

అను వాక్యార్థమును అనువదించి శిష్యుఁడు చెప్పుచున్నాఁడు:- లోకనాథా! దేహదృష్టిచే తమ్మును నన్నును గణించుకాలమున, నేనొకదోమకంటె చిన్నదోమకు సమమగుటచే, సమానములేని వాఁడనై యున్నాను. తమకును నాకును సత్తు చిత్తు ఆనందమను రూపమున పూర్ణత్వము సమానమే యగును.

ఇప్పుడు అజ్ఞానదశయందు భేదదృష్టిచే చేసిన తీర్థయాత్ర మొదలగు కర్మములను అపరాధరూపమని తలంచి

శ్లో॥ త్వద్యాత్రయావ్యాపకతా హతా తే

ధ్యానేనచేతః పరతా హతా తే।

స్తుత్యాఽనయా వాక్పరతాహతా తే

క్షమస్వదేవ! త్ర్యపరాధమేతత్॥

అను నీశ్లోకార్థమును అనువదించి శిష్యుఁడు మన్నింపు అడుగుచున్నాడు:- దేవా! యాత్రచే తమపూర్ణతనమును చెఱచితి. ధ్యానముచే, తమరు మనస్సునకు విషయముకారనుటను

జెఱచితిని. స్తుతిచే, తమవాక్కునకు విషయముకాని తనమును చెఱచితిని. ఈమూడు అపరాధములునాచే చేయబడినవి, భగవంతుఁడా! దానిని తామున్షమింపవలెను. పుత్రుడు ముందు తెలియని బాల్యప్రాయమున చేసినఅపరాధముల తండ్రిక్షమించునటువలె అజ్ఞానదశయందుచేసిన, భక్తుడయిన నా యపరాధముల తామున్షమింపవలెను.

119. నదియందుమునిగిన పురుషుని గట్టెక్కించుటలో

౧. గట్టుననిలుచుండు, లేవనెత్తువాఁడు లేవనెత్తఁబడువాఁడు, అనఇద్దఱికిబోధించు పురుషుఁడును. ౨. ఎత్తువాఁడును 3. ఎత్తబడుపురుషుఁడునునగు ముగ్గురిఉపకారమును కావలెను.

కాసున బంగారునుతూచు నిమిత్తము బంగారును గురుగింజమొదలగు తూనికలును పైభాగమున ముల్లు (సలాక) నగుమూటినమత్వమును కావలెను. అవియుండినవే స్వర్ణము మొదలగువస్తువుల పరిమాణముల నిశ్చయముకలుగుచున్నది.

అట్లే దృఢ అపరోక్షజ్ఞానమునందును శాస్త్రము, గురువు, తన అనుభవము అనుమూటినమత్వమును కావలెను. అది నాకుసిద్ధించినది. కావున నానిశ్చయము దృఢమయినది. ఇందుచే నాకుముక్తియందు సంశయములేదు. అను అభిప్రాయముచే శిష్యుఁడు చెప్పుచున్నాఁడు:—

శాస్త్రదృష్టిచేతను, గురువాక్యముచేతను, చక్కగాగలిగియుండు అపరోక్షజ్ఞానముచేతను, తనకుతానుగనే నెఱిగితిని, ఇదివేఱుశాస్త్రమునందును:—

శ్లో॥ శాస్త్రదృష్టిర్గురోర్వాక్యం తృతీయశ్చాత్మనిశ్చయః
త్రిధైవమోవిజానాతి,సముక్తోనాత్రసంశయః॥

శాస్త్రదృష్టియును,గురువాక్యమును తనయనుభవమును

నగుచున్నాఁడు విధములచేతను నెవఁడు ఎఱుఁగుచున్నాఁడో వాఁడుముక్తుఁడు, దీనియందు సంశయము లేదు.'' అని చెప్పఁబడి యున్నది

120. ఇప్పుడు యీశ్వర, గురు, సత్పురుషులు అనువారియొద్ద పూర్వము చేసిన భక్తిచేతఁగలిగిన వారికృపచే అపరోక్షజ్ఞానము కలిగినదో, వారిభక్తినివిడుచుటచే "చేసినమేలు చంపుట" యను దోషముకలుగుచున్నది. దాని నివృత్తికొఱకు శిష్యుఁడు చెప్పుచున్నాడు:- ఈశ్వరుఁడు, గురువు, సాధువులు అనువారికి దేహదృష్టిచే నేనుదాసుఁడనైయున్నాను. జీవదృష్టిచే నాయీశ్వరరూపముగా మతింపఁబడిన గురుమొదలగువారి అంశమైయున్నాను. ఆత్మదృష్టిచే వారే నేనైయున్నాను. అది వేదశాస్త్రమునందును ఒకభక్తునిచే :—

శ్లో॥ "దేహబుద్ధ్యాతుదాసోఽహం జీవబుద్ధ్యాత్వదంశకః।
ఆత్మబుద్ధ్యాత్వమేవాహ మితిమేనిశ్చలామతిః॥

దేవా! దేహబుద్ధిచేతనో నేనుతనదాసుఁడను, జీవబుద్ధిచేతనో తమఅంశుఁడను, ఆత్మబుద్ధిచేత తామే నేను అను నది నానిశ్చలమగు మతి అని చెప్పఁబడియున్నది.

శ్రీశంకరాచార్య స్వాములును తక్కినజీవుల ఉపదేశముకొఱకు శివస్తుతియొక్క ప్రసంగమందు ఇట్లుచెప్పియున్నారు.

శ్లో॥ దాసస్తేఽహందేహదృష్ట్యాస్మిశంభో
జాతస్తేఽంశో జీవదృష్ట్యాత్రిదృష్టే।
సర్వస్యాత్మన్నాత్మదృష్ట్యాత్వమేవే
త్యేవంమేధీర్నిశ్చితాసర్వశాస్త్రైః॥

శంభువా! దేహదృష్టిచే నేనునీదాసుఁడను. త్ర్యంబకా! జీవ (ఉపాధితోఁగూడిన చేతన)దృష్టిచే నేను తమ అంశమైయు

న్నాను అన్నిటి ఆత్మస్వరూపుఁడా! ఆత్మదృష్టిచే తామే నేను అను నీవిధనాబుద్ధి సర్వశాస్త్రములచేతను నిశ్చయము పొంది యున్నది

## గ్రంథకర్త వాక్యము.

121. శిష్యుఁడు ముందుచెప్పినట్లు దానేతన్నెఱిఁగి కృతార్థుడయ్యెను. పిమ్మట గురువుపాదకమలములసేవించి గుర్వాజ్ఞ వాక్యములచే ఇంటికిపోయెను.

ఒకకాలమున *160. కాకతాలీయన్యాయము న

*161 నిష్కామపుణ్య (అశుక్లకృష్ణరూప యోగియొక్కకర్మ) మయినయుత్తమప్రారబ్ధకర్మ ఉత్పత్తిచే ముందుచెప్పిన శిష్యుఁడయిన జ్ఞానిచిత్తమందు కనఁబడుభోగములందు దృష్టమిథ్యాత్వముల జ్ఞానులచే తీవ్రతర వైరాగ్యముగలిగెను. అందుచే జీవన్ముక్తియొక్క విలక్షణసుఖమును చక్కగా భుజించుట కొఱకు ఇల్లు మొదలగువానిని విడుమటయగు సన్న్యాసాశ్రమమును తీసికొనెను.

ఇట నిదిరహస్యము:- ౧. ఉత్తమము, ౨. మధ్యమము ౩. కనిష్ఠము, ౪. అధమతరము, ౫. అధమతమము, అను భేదములచే ప్రారబ్ధకర్మమగు భాగ్యమేదియోయది యయిదు విధములు

౧. ఎవ్వఁడును నివృత్తికిహేతువగు ప్రారబ్ధకర్మమేదియోయది ఉత్తమమగును. అదిశుకదేవులు, వామదేవుఁడు సనకాదులు

*160. కాకిమూఁగ్గుండ తాటిపండుపడెను అనున్యాయము (దృష్టాంతము)

చొప్పన * 161. సకామపుణ్యము ఏదియోయది శుక్లకర్మమగు పాపమేదియో యది కృష్ణకర్మమగు ఆరెంటికంటె విలక్షణమయిన నిష్కామపుణ్యమేదియో యది అశుక్లకృష్ణకర్మమగును.

మొదలగువారి యందుండిన ప్రారబ్ధమగును. అదిపుట్టుక మొదలు శరీరముండినవఱకు నివృత్తికి హేతువయి యుండినందున ఉత్తమమగును.

౨. మొదట ప్రవృత్తికి హేతువుగాను పిమ్మట నివృత్తికి హేతువుగాను నుండు ప్రారబ్ధము మధ్యమమగును. అది యాజ్ఞవల్క్యుఁడు మొదలగువారియందుండిన ప్రారబ్ధము. అదిగృహస్థాశ్రమమును అంగీకరించుటయగు ప్రవృత్తికి హేతువుగానుండి పిమ్మట తీవ్రవైరాగ్యముతోడ విద్వత్సన్న్యాసమును అంగీకరించుటయగు నివృత్తికి హేతువై యుండినందున మధ్యమము అగును.

3. ఎప్పుడును ప్రవృత్తికి హేతువుగానుండు ప్రారబ్ధము కనిష్ఠ (అధమ) మగును. అదిజనకుఁడు మొదలగువారికినుండిన ప్రారబ్ధమగును. అదియెప్పుడును రాజ్యభోగమును అంగీకరించుటయగు ప్రవృత్తికి హేతువుగానుండినందున కనిష్ఠమగును.

౪. మొదట నివృత్తికి హేతువుగాను పిమ్మట ప్రవృత్తికి హేతువుగాను నుండు *162 ప్రారబ్ధము అధమతరమగును. అదిశిఖిధ్వజుఁడు, అలర్కుఁడు, ప్రియవ్రతుఁడు మొదలగువారికి నుండిన ప్రారబ్ధము. అదిమొదటి వైరాగ్యపూర్వకముగా నివృత్తికి హేతువుగానుండి పిమ్మట భోగేచ్ఛాపూర్వక రాజ్యాదుల నంగీకరించుటయగు ప్రవృత్తికి హేతువైయుండినందున అధమతరమగును.

౫. (౧) ఇష్టప్రకారము నడుచుకొనుట. (౨) ఇష్టప్రకారము మాట్లాడుట, (3) ఇష్టప్రకారము భుజించుట, అను

* 162. అధమముగానుండు రెంటికదానికంటె అధమముగా నుండునది అధమతరమనఁబడును.

ప్రమాదమునకు హేతువైన ప్రారబ్ధము. *163 అధమతమ మగును. అదికలియొక్క ప్రమాదముచే కొందఱు ఆధునికులు (ఇప్పటివారు) అనధికారులపై వేదాంత శ్రవణమొదలగు సుఖ సాధనములుప్రవర్తించు అజ్ఞానులు మొదలగువారికి. అది (౧) ఇష్టప్రకారము నడచుట, (౨) ఇష్టప్రకారము మాట్లా డుట, (౩) ఇష్టప్రకారము భుజించుటయను ప్రమాదములను అంగీకరించుటకు హేతువుగా నుండుటచే అధమతమ మగును, వానిలో,

ముందు చెప్పిన జ్ఞానిపురుషుని ప్రారబ్ధమగు భాగ్యము పూర్వము గృహస్థాశ్రమమును అంగీకరించుటయగు ప్రవృ త్తికి హేతువును, పిమ్మట తీవ్రవైరాగ్య పూర్వకముగా నిల్లు మొదలగువానిని విడుచుటయగు నివృత్తికి హేతువుగానుండ టచే యాజ్ఞవల్క్యుఁడు మొదలగువారికివలె మధ్యమముగా నుండినప్పటికిని అది తీవ్రవైరాగ్యమునకు హేతువయిన నిష్కామ పుణ్యరూపముగా నుండుటచే ఉత్తమమని చెప్పఁ బడినది.

ఇట యిల్లు మొదలగువానిని విడుచుటయని చెప్పఁబడి నది. అందు ఇల్లు అనుపదముచే దానిచే ఉపలక్షింపఁబడిన క్షేత్రము (నేల) పశు, దాస, దాసీ, ధన, ధాన్యాది సంపద యగు ధనమునున్ను దాని ఉపయోగియగు కృషి, వ్యాపా రము మొదలగువానియందు ప్రవృత్తించుటయగుదాని ఇచ్ఛ యును గైకొనవలెను.

'మొదలగునవి'యను శబ్దముచే పుత్రేషణయు దాని

* 163. అధమములు అన్నిటికంటె అధమమయినది అధమతమమన బడును.

యుపయోగులగు స్త్రీ వివాహాము మొదలగువాని ఈషణయు ఈలోకము స్తుతింపందగు తనమును నిందింపందగు తనమును సంపాదించు ఇచ్ఛగాక లోకాంతర ఇచ్ఛయును లోక ఈషణయు, దాని యుపయోగియగు యాగాదికర్మములయొక్క ప్రవృత్తికిని ఈషణయు నయిన వీనిని చేకొనవలయును. కావున నీమూడు ఈషణలనుండియు లేచునట్టి సన్న్యాసమే ఇల్లు మొదలగువానిని విడుచుటయను వాక్యమునకు అర్థమగును.

ఆ సన్న్యాసము ౧. కుటీచకము, ౨. బహూదకము. 3. హంసము ౪. పరమహంసము అనుభేదములచే నాలుగు విధములు.

౧. యాత్రంజేయ శక్తిలేనందున ఎచ్చటనైనను గుడిసె నేర్పఱచుకొని యుండుట కుటీచకము అగును.

౨. సన్న్యాసఆశ్రమమున కర్మమునుజేయుచు యాత్ర జేయుట బహూదకమగును.

3. అగ్నిచే సాధింపఁబడు కర్మమును విడిచి ప్రణవజప మొదలగువానిని ననుష్ఠించు వాఁడగుట హంసమనఁబడును.

౪. పరమహంస సన్న్యాసమును, వివిదిష, విద్వత్తు అనుభేదములచే రెండు విధములగును,

(౧) జ్ఞానమునకు పూర్వము దోషదృష్టిచే గలుగు తీవ్రతర వైరాగ్యముచే జిజ్ఞాసచేఁ జేసికొనఁబడునది వివిదిషా సన్న్యాసమగును.

౨. జ్ఞానమునకు పిమ్మట దోషదృష్టి మిథ్యాత్వదృష్టులచే గనఁబడు తీవ్రతరవైరాగ్యముచే విద్వాంసుని (జ్ఞాని) చే చేసికొనఁబడునది విద్వత్సన్న్యాసము.

వానిలో నిట విద్వత్ సన్న్యాసము తీసికొనఁబడును.

122. ఈ శిష్యుఁడు సన్న్యాస ఆశ్రమమును అంగీకరించి విక్షేపనివృత్తికొఱకు నేవస్తువులవిడిచి దేహయాత్ర మొదలగు వానికొఱకు నేవస్తువులను విడువక జగమున సంచరించెను? అనుశంక కలుగగా నట ఐదునువిడిచి, ఐదును విడువక, వాఁడుజగమున సంచరించెను. అని చెప్పఁబడుచున్నది:-

౧. స్త్రీ, ౨. బంగారు మఠము మొదలగునవియగు ధనమును జేకొనుట ౩. విషయములు, (శబ్దము, స్పర్శము, రూపము రసము, గంధము) ౪. సభ (జనసమూహము) ౫. సన్మానము అను నీయైదును విడిచి [అట ఐదువిషయములలో స్పర్శమును, రసమును, సగము విడువవలెను. ఏలయన వానిని పూర్తిగ విడుచుటచేత దేహయాత్ర సంభవింపదు. కావున వస్త్రమయిన స్పర్శమును భిక్షయగు రసమును విడుచుటకూడదు. వాని యందు అధికమును విడువవలెను. అనునది వ్యవస్థయగును.] ౧. వస్త్రము, ౨. త్రాటితోఁగూడిన కమండలము, ౩ ఏకాంతము, ౪. భిక్ష, ౫. దేహాదులు కనఁబడుచుండునపుడు శ్రుతియగు శాస్త్రము అను నీయైదును విడువకసంచరించెను.

123. పిమ్మట ఆ జ్ఞానియనో (చిత్త) నిరోధమగు రాజయోగముకొఱకు మొదట ప్రాణనిరోధమగు *164 హఠయోగమునుజేసెను. ఆ హఠయోగముచేత పిమ్మట రాజయోగమును సాధించి అష్టాంగములతోఁగూడిన నిర్వికల్పరూప శ్రేష్ఠసమాధినిపొందెను.

*164. హఠయోగముచే రాజయోగమును, సాధించుమార్గములన్నియు, విస్తారముగా హఠయోగప్రదీపిక అనుగ్రంథమందు వ్రాయబడియున్నది. ఇట దాని స్వభావము మాత్రము సంగ్రహముగా వ్రాసబడుచున్నది.

ఆ సాధనరూప హఠయోగము, దానిఫలరూప *165. రాజయోగము అనువాని సంగ్రహమును శాస్త్రగురు కృప వలన వ్రాయుచున్నాము.

వానిలో హఠయోగము ఇదియగును:-

*166. నేతి, *167. ధౌతి, *168. గజక్రియ, *169.

---

*165. ఇటుహఠయోగముయొక్క ఫలమయినందున జ్ఞానక్రియలు రెంటిచేతను సాధింపఁబడు రాజయోగము చేకొనఁబడును.

*166. ఎలుకతోకవంటి అనేకనూలుపోగులచే చేయఁబడిన త్రాటిని క్రమముగా నాసిక రెండుద్వారములందును ప్రవేశింపించి పై నోటిద్వారపు మార్గమున నోటినుండి యెత్తుట నేతియగును.

*167. ధౌతి:- ౧ జలధౌతి, ౨ సూత్రధౌతి, ౩ వస్త్రధౌతి, ౪ పవన ధౌతి, అనుభేదములచే ధౌతిక్రియ నాల్గువిధములగును.

౧. మిరియాలంతని కొంచెము వేడిగానుండు రెండు ఆళాకువేడినీళ్లుత్రాగి పిమ్మట యుక్తిచే నాజలమును బయటికిరప్పించుట జలధౌతియగును.

౨. నూలుచేఁజేయఁబడిన ఒకటింపాతికమూరపొడవుగల త్రాటిని నోటిమూలముగా కడుపువరకు కవి ఆడించిబయటికితీయుట సూత్రధౌతియనబడును

౩. నాల్గులేక ఆఱంగుళముల వెడల్పును ఎనిమిది లేక పదునాలుమూరల పొడవునుగల మల్ మల్ లేక జగన్నాథి అనువస్త్రపట్టను నీటియందు తడిపి నోటితో మ్రింగి కడుపునచేసి పిమ్మట నోటికి బైటయుంచబడిన కొనచే ధైర్యముగానీడ్చి బయటికివచ్చునట్లు చేయుట యేదియో యది వస్త్రధౌతి యగును.

౪. రెండుపాదములమీదఁగూర్చుండి కంఠమునుశేవస్తి కొంచెము తెఱచిన నోటితో గాలినింబాడ్చి లోపలనిండించి మరల ధైర్యముగా విడుచుట పవనధౌతియగును. (పవనము=వాయువు)

*168. ముందుచెప్పిన జలధౌతియగును.

*169. నీటి అలవలె (చుట్టెడు అల) కుడి యెడమభాగముల కడుపును చుట్టుట నౌలియగును.

నౌలి, 170· భస్త్రి, *171· త్రాటకము,

*172 కపాలభాతి, (భస్త్ర) *173 వజ్రోలి, *174 సంగ్రక్షాళనము, *175 విపరీతకరణి అను క్రియలు రోగములను మేదస్సు కఫము, పిత్తము మొదలగు మలములను నివర్తించు మూలమున శరీరకోష్ఠమును శోధించు (శుద్ధిచేయు) కావున మొదట సిద్ధిచేయవలయును. వానిలో

నేతి మొదలగు ఆఱుక్రియలును మొదట యుపయోగము అయితే ఎవనిశరీరమునందు మేదస్సుకఫము అధికముగా నుండదో వానికాక్రియలు లేక కేవలప్రాణాయామ అభ్యాసముచేతనే శరీరశోధనయును నాడిశోధనయుఁగలదు.

కొందఱు నీటియందూరిన కరక్కాయలనుతిని గడుపుటచే శరీరశుద్ధిని జేయువారై 176 బిందుదర్శనము మొదలగు

---

*170. గుదమార్గమున నీటినియెక్కించి మరలవిడుచుట భస్త్రియగును.

*171. నేత్రములచే కనుబొమల మధ్యమైనను లేక కేవలసమీపమందున్న పదార్థమైనను కన్నీరుపడువఱకు చూచుట త్రాటకమగును.

*172. కమ్మరితిత్తివలె వేగముగా రేచక పూరకములఁజేయుట కపాలభాతియగును.

*173. గుహ్యేంద్రియమూలమున జలము మొదలగువానిని యాకర్షించి, విడుచుట వజ్రోలి అగును. దీనినే వజ్రోలిముద్రయనియుఁ జెప్పుదురు.

*174. నోటితో జలమునుద్రాగి మూలద్వారముచే విడుచుట సంగ్రక్షాలనమగును.

*175. భూమియందు తలనునుంచి రెండుచేతులతో నడుముపట్టుకొని పాదములను నిరాధారముగనుంచి (తలక్రిందుగానుండుట) విపరీతకరణి. దీనినే విపరీతకరణిముద్రయనియుఁ జెప్పుదురు.

*176. పద్మాసనముచేసి షణ్ముఖిముద్రచే రెండు అంగుష్ఠములచే మూయఁబడిన రెండుచెవులచేతను పదివిధముల నాదములు వినఁబడుచున్నవి.

అభ్యాసపూర్వకముగా ప్రాణాయామముయొక్క అభ్యాసమును నారంభించుచున్నారు. వారునుసిద్ధిఁబొందెదరు.

మఱికొందఱు *177 జాలంధరబంధ అభ్యాసమాత్రముచే ప్రాణముమీఁదఁబోవునదియైన సిద్ధినిబొందెదరు.

వీర్యస్థానమును శోధించుకొఱకు వజ్రోలిక్రియయుగావలసినదగును. సమాధికాలమున శరీరమున మిగిలియుండు మలమును బోకార్చుటచేఁ జాలకాలమువఱకు సమాధినెలకొనియుండుటకొఱకు సంగ్రహక్షాళనక్రియయుఁగావలసినది. కుంభకవృద్ధికొఱకు కపాలభాతియుఁగావలెను. బహు అన్నమును పాకముచేయు విపరీతకరణి తలనుండి స్రవించు అమృతమువంటి రసమును పానముచేయుకొఱకు గావలయును.

ప్రాణాయామమున నుపయోగమగు *178 మూలబంధము, 179ఉడ్యానబంధము, *180జాలంధరబంధము, *181జిహ్వా

---

రెండుచూపుడువ్రేళ్లచే మూయఁబడిన నేత్రముల ప్రకాశరూప బిందుదర్శనము గలుగుచున్నవి. రెండునడిమివ్రేళ్లచే నాసికను రెండుఉంగరవ్రేళ్లచేతను, రెండుచిటికెనవ్రేళ్లచేతను నోరుమూయఁబడగా కుంభకముగలుగుచున్నది. పిమ్మట రెండుచేతులను విడుచుటచేత నేత్రమునకెదుట కంటినీరుకారువఱకు బిందుదర్శనముచే త్రాటకముకలుగుచున్నది ఇదిబిందుదర్శనాది అభ్యాసము.

*177. పద్మాసనముచేర్చి దవడను గడ్డములను రొమ్మునచేర్చి నాలుకను త్రిప్పి పైనోటిద్వారమును పొందించి నోటినిబంధించుటచే శ్వాసనిరోధము గలుగుచున్నది. ఇదిజాలంధరబంధము.

*178. పాదపుగుదికాలును ఆసనముక్రింద అణచి మూలద్వారమును నిరోధించుట మూలబంధమగును. *179. నాభివద్దకు కడుపును లోపలికి ఈడ్చుట ఉడ్యానబంధమగును. *180. ఇదిముందేచెప్పఁబడినది. *181. నాలుకనుత్రిప్పి పైనోటిద్వారమునచేర్చుట జిహ్వాబంధమగును.

బంధము అనువానిని *182 చిత్తము. *183 పద్మము, *184 మత్స్యేంద్రము. *185 పశ్చిమతానము,
*186. మయూరము మొదలగు ఆసనములు, *187. ముద్రలు మొదలగు వానిని అభ్యాసముచే,సిద్ధిచేసికొనవలయును.
చెడిన అన్నము అగ్నిసంగము స్త్రీ సంగము త్రోవనడ

---

*182. ఎడమకాలి మడమను ఆసనమునకు క్రింద ఆనచి కుడికాలిమడమను లింగమునకు పైనుంచి కూర్చుండి శరీరమును దండమువలెనిలిపి చూపును భ్రూమధ్యనిలుపుట సిద్ధాసనము.

*183 కుడికాలిమడమను ఎడమతొడక్రిందయుంచి అట్లే ఎడమమడమను కుడితొడక్రిందనుంచి ఎడమకుడిచేతులచే ఎడమకుడిపాదముల పెద్ద (బొటన) వ్రేళ్లనుబట్టి చూపును నాసికకొనభాగమున నిలుపుట పద్మాసనమగును. ఈయాసనమును మార్చియుచేయవచ్చును. *184 ఎడమతొడక్రిందనుంపఁబడిన కుడిపాదమడమను ఎడమచేతిచేపట్టి కుడికాలి మోకాలియందుంచఁబడిన ఎడమపాదపు అంగుష్ఠమును కుడిచేతబట్టుకొనికూర్చుండుట మత్స్యేంద్రాసనమగును ఈయాసనము చేతులు కాళ్లుమార్చియుండియు క్రమము చేతను గలుగును. *185. రెండుపాదములను దండమువలెజాచి రెండుచేతులచే రెండుకాళ్ల బొటనవ్రేళ్లనుబట్టుకొని నెత్తిని మోకాలుమీదనుంచుట పశ్చిమతాన ఆసనమగును.

* 186. రెండుచేతులను భూమియందుంచి రెండు మోచేతులను నాభికిరుప్రక్కల పొందుపఱచి శరీరమును కొమలికి సమానముగా నిరాధారముగా పైకెత్తి నిలుపుట మయూరాసనమగును.

* 187. ముద్రలు. ౧ మహాముద్ర, ౨ మహాబంధము, 3 మహావేదము. ౪ కేసరి, ౫ ఉడ్యాణము, ౬ మూలబంధము, ౭ జాలంధరబంధము, ౮ విపరీతకరణి, ౯. వజ్రోలి, ౧౦ శక్తిచాలనము అనుపదియును హఠయోగముద్రలగును. వీనిలక్షణములు యోగగ్రంథములందును (హఠయోగప్రదీక మొదలగు వానియందు) ప్రసిద్ధముగానున్నది. కావున విస్తరభీతిచే ఇటవ్రాయఁబడలేదు.

చుట, అను నాల్గింటిని హఠయోగి విడువవలెను. ప్రాకారపు గోడచే చుట్టఁబడినదియు భావియుండునదియునైన యింటి నడుమనుండు గుహయందు యోగి వాసముచేయవలయును.

యమ, నియమములు ముందుచెప్పిన ఆసనము అను మూఁటిసిద్ధి పూర్వకముగా ప్రాణాయామము చేయవలెను.

అగర్భము సగర్భమును భేదములచే ప్రాణాయామము రెండువిధములు.

౧. ప్రణవపు ఉచ్చారణలేని ప్రాణాయామము అగర్భమగును.

౨. ప్రణవపు ఉచ్చారణతోఁగూడిన ప్రాణాయామము సగర్భమగును.

వానిలో సగర్భ ప్రాణాయామము శ్రేష్ఠము కావున, దానినే చేయవలయును.

మఱియును ప్రాణాయామము ౧ పూరకము ౨. కుంభకము. 3 రేచకము అనుభేదములచే మూఁడువిధములు.

౧. మొదట చంద్రనాడిచేతను పిమ్మట సూర్యనాడిచేతను శ్వాసమును నిండించుట పూరకమనఁబడును.

౨. పూరించిన శ్వాసమును నిలుపుట కుంభకమనఁబడును.

3. నిల్పిన శ్వాసమును ధైర్యముగా విడుచుట రేచకమనఁబడును.

వానిలో మాత్రవిశేష నియమముగావలెను. *188. ప్రణ

---

* 188. ఒక ప్రణవమును ఉచ్చరించుటలో నెంతకాలమగునో అది యొక మాత్రయగును. అట్లే మొదలగు అనుపదముచే చిటికవేయుట లేక చేతితో మోకాలును చుట్టుట మొదలగు కాలములు చేకొనఁబడును.

వోచ్చారణ మొదలగు కాలములలో నొకదానికాలమునకు మాత్రయనిపేరు. ఎన్నిమాత్రలచే పూరకము చేయఁబడు చున్నదో దానికి నాలుగింతలు మాత్రలచే కుంభకము చేయ వలయును. పూరకమాత్రలకు రెండింతలు మాత్రలచే రేచ కము చేయవలయును.

ఉదయము, మధ్యాహ్నము, సాయంత్రము, అర్ధరాత్రి అనునాల్గు కాలముల క్రమముగా అధికమధికముగా ప్రాణా యామము చేయవలయును.

ఈ విధమున ధైర్యముగా అభ్యాసము చేయుచుండిన ఎప్పుడు ఉత్తమ ప్రాణాయామమును పొందుచున్నాఁడో అప్పుడు ఉదయమున అఱువది ప్రాణాయామములును, మధ్యా హ్నమున నలువది ప్రాణాయామములు సాయంకాలము, అర్ధ రాత్రి కాలముల ఇరువదిరువది ప్రాణాయామములను జేయ వలయును

లేక యేకాలములందునుసమానముగానే యెనుబది ప్రాణా యామములను చేయవలయును. అయితే మొదటి పక్షక్రమము ఉత్తమమయినది. ఇట్లు పూర్ణ అభ్యాసముకలుగ ఎప్పుడు కుండలిని మేల్కొనుచున్నదో, దానిముఖము దెఱవఁబడ ప్రాణము మీఁదఁబోవుటనుపొంది పిమ్మట క్రిందబోయి పిమ్మట మెడవెనుకగా ప్రాణము, మీదబోవుటను జేయుచున్నదో అప్పుడు, మూలబంధము జాలంధరబంధము జిహ్వాబంధముల దృఢముచేయవలెను, నాలుకయగు కవాటమును (మూయు) పొందించవలెను.

ఇట్లు ఎప్పుడు సంపూర్ణ అభ్యాసము కలుగుచున్నదో అప్పుడు సమాధి సిద్ధించుచున్నది. పిమ్మట అభ్యాసదృఢత్వ

ముచేత మనస్సు నిరోధమగురాజయోగము సహజముగా సిద్ధించుచున్నది. అయితే దీనియందు సమాధిసిద్ధిపొందిన గురువు సన్నిధి కావలెను.

గురువులేక స్వతంత్రముగా నీయోగమును జేసినవానికి రోగముచేఁ బొందు లేక మరణము గలిగించు దుఃఖము గలుగును.

అట్లే శ్రద్ధతోఁగూడిన సామర్థ్యముగల సాధకునియొక్క అపేక్షయుగలదు. ఏలయన అట్టివాఁడుగాక తక్కినవారిచే సిద్ధిపొందఁజాలదు.

ఎవనిచిత్తము శాంతమగు నెద్దువలె సంచలనములేనిదై స్వాధీనమైయున్నదో వానికి శ్రీ అపరోక్షానుభూతియను గ్రంథమున చెప్పఁబడినట్లు ప్రతిదినము ఘటికలు ముహూర్తము జాముపర్యంతము బ్రహ్మాభ్యాస మాత్రముచే నిర్వికల్ప సమాధియగు రాజయోగము యొక్క సిద్ధికలుగుచున్నది.

ఎవనిచిత్తము మదించిన యెద్దువలె మిక్కిలి సంచలనము గలదై స్వాధీనము లేకయున్నదో వానికి దండముచే బలముగా మర్దించిన యెద్దును ఇంట ప్రవేశింపఁజేయుటవలె రాజయోగమగు నింట బలాత్కారముగా ప్రవేశింపఁజేయు కొఱకు ప్రాణనిరోధమగు హఠయోగముకావలెను. కావున శ్రీ ఆదినాథుఁడు (శ్రీమహాదేవుఁడు) మత్స్యేంద్రనాథుఁడు, గోరక్షనాథుఁడు మొదలగువారు స్వతంత్రముగా హఠయోగమును ప్రకటనఁ జేసియున్నారు.

ఈ కాలమున అధికారులు లేనందునను సంప్రదాయము నుండి జారుటవల్లను నీహఠయోగము సాంగోపాంగముగాఁ బొందుట యరుదైనను, ఒక విరక్త పురుషునికే యొక్కొక

*189. అంగపుసిద్ధి గలుగుచున్నది. ఇది సంక్షేపముగా హఠయోగము చెప్పఁబడినది.

ఇప్పుడు రాజయోగమును జెప్పుచున్నాఁడు:— ౧. జ్ఞానసాధ్యము, ౨. క్రియా సాధ్యము, 3. జ్ఞానక్రియా ఉభయసాధ్యము, అను భేదములచే రాజయోగము మూఁడు విధములు. (సాధ్యము=సాధింపఁబడునది.) (ఉభయము=రెండు)

౧. శుద్ధచిత్తముగల పురుషుఁడు శాస్త్రముచేతను, గురుకృపచేతను, బ్రహ్మాత్మైక్య నిశ్చయమగు తత్త్వజ్ఞానమును బొంది, జీవన్ముక్తి విలక్షణానందముయొక్క అనుభవము కొఱకు సకలప్రవృత్తులనువిడిచి, ఏకాంతమగు చోటనుండి బ్రహ్మాకారవృత్తిని అభ్యాసముచేయవలెను. దానివలన సిద్ధించు నిర్వికల్ప సమాధిని జ్ఞానసాధ్య రాజయోగమందురు. దీనినే సహజ సమాధియనియుఁ జెప్పుదురు. ఇది గీతయొక్క ఆఱవ అధ్యాయమున శ్రీకృష్ణభగవానులచేతను, అపరోక్షానుభూతియందు శ్రీశంకరాచార్యులవారిచేతను నిరూపణము చేయఁబడియున్నది. దీని అంగములును ఆటఁ వ్రాయఁబడియున్నవి.

దీనివిశేష అభ్యాసముచేత రజోగుణతమోగుణముల తిరస్కారముగలిగి, సత్వగుణ ఆవిర్భావముచేత ఐదవ, ఆఱవ, ఏడవ, జ్ఞానభూముల పూర్వకముగా వాసనాక్షయమును మనోనాశమును (రజో తమోగుణములచే సత్వగుణము

* 189. ఆఱుక్రియలు, అనేక అసనములు, ముద్రలు అనునివి మొదలగు అంగములందు ఒక్కొక్క అంగముయొక్క సిద్ధి కలుగుచున్నది. దానినే పూర్ణముగా నభ్యసించుటచే యోగమంతయు తానే సిద్ధించుచున్నది. ఇది "యోగమునకు గురుయోగమే" అను పతంజలి భగవంతునిచే జేయఁబడిన యోగసూత్రవ్యాస భాష్యమున జెప్పఁబడియుండుటచే,

మూఢముగాఁడియుండుట యగు మనస్సుయొక్క స్థూలత్వము యొక్క నాశమును) సిద్ధించుచున్నవి.

౨. ఇప్పుడు క్రియాసాధ్య రాజయోగమును జెప్పు చున్నాడు:— పదునాఱేండ్లు మొదలు ఇరువదేండ్లవయస్సు గలవాఁడును దోషములేని మృదువులగు కేశములతో గూడినవాఁడును, మంచిచిత్తముతోఁ గూడినవాఁడును, శుద్ధ బుద్ధి గలవాఁడును, ఆచార్యునికంటె బలమందును, బుద్ధి యందును, అధికారమందును తక్కువవైనవాఁడును, రోగము లేనివాఁడునునయి ఇట్టి తక్కినగుణములు గలవాఁడు ఉత్తమ అధికారియగును.

లేక ఇరువదొక్కయేండ్లు మొదలు ముప్పదియేండ్ల పర్యంతము నైన వయస్సుగలవాఁడును, అధిక దోషములేని మధ్యమ కేశములుగలవాఁడును మధ్యమచిత్తముతో గూడిన వాఁడును, మధ్యమబుద్ధిగలవాఁడును, ఆచార్యునికంటె బల మందును, బుద్ధియందును అధికారమందును సమతగలవాఁడు ను రోగములేనివాఁడునునయి ఇట్టివేఱుగుణములును గలవాఁడు మధ్యమ అధికారియగును.

లేక ముప్పదొక్కయేండ్లు మొదలు నలువదియేండ్ల పర్యంతమునగు వయస్సుగలవాఁడును దోషముతోఁగూడిన కఠినకేశములుగలవాఁడును, కఠినచిత్తముగలవాఁడును, శుద్ధిచే, తక్కువయైయున బుద్ధిగలవాఁడును, ఆచార్యునికంటె బలమం దును బుద్ధియందును అధికారమందును అధికమయినవాఁడును, రోగములేనివాఁడునునయి ఇట్టి ఇతరగుణములును గలవాఁడు కనిష్ఠ అధికారియగును.

సంకల్పమును గలిగించు సకలప్రవృత్తులను విడిచిస్వల్ప

సాత్త్విక ఆహారముగలవాఁడై, జితేంద్రియుఁడై, శబ్దము మొదలగు అడ్డములు లేనిదియు, దోమలు మొదలగుజంతువులు లేనిదియు, గాలి ధారాళముగా వచ్చునదియునయిన ఏకాంత ప్రదేశమున బూరుగపత్తి మొదలగువానిచేనయిన ఆసనము పఱచి దక్షిణదిక్కునుజూచి కూర్చుండి గురువుచేఁజెప్పఁబడిన నియమమందుండువాఁడై మొదట సమాధిసిద్ధించిన గురువు గారి చేతిక్రియచే ప్రేరేపింపఁబడిన శక్తిచేతను, పిమ్మట అయ స్కాంత మొదలగు నిమిత్తములచేతను ఏసమాధిని సిద్ధిచేయు చున్నాఁడో అది క్రియాసాధ్య రాజయోగమగును పద్మ పురాణమందుండు ఐదవాధ్యాయరూప కపిలగీతయందు చెప్పి యుండు లక్ష్యయోగమున్ను దీనియందణగును.

దీనికి ౧. స్వప్నము, ౨, సుషుప్తి, ౩ కోరఁబడు వస్తువు జ్ఞానసామర్థ్యముగు ఆంతరజాగ్రము, ౪ తురీయము, మొదలగునవి భూమికలు అగును. నాల్గవభూమిక పొందుటచే నీ సమాధి (యోగనిద్ర) సిద్ధించుచున్నది. దీనియందు హఠ యోగమందువలె శరీరము శవమువంటిదగుచున్నది. అయితే హఠసమాధియందు నాడియొక్క విస్తృతము పోవుచున్నది. పదియవద్వారమున ప్రాణము స్థిరముగానుండుటచే ఈ సమాధియందు నాడియొక్క విస్తృతముఉన్నది. ప్రాణము సూక్ష్మ రూపమున ప్రసిద్ధమయియుండుటవలన. ఇది వానిభేదమగును. ఈ సమాధి, అజ్ఞులు (అజ్ఞానులు) తజ్ఞులు (జ్ఞానులు) రెండు తెగలవారికిని సిద్ధించును. దీనిని అధికముగా నభ్యసించుట వలన చిత్తము అతిశుద్ధము (సాత్త్వికము) అగుచున్నది.

దీనియందు ఒకరికొకరు మరగిన సిద్ధసాధకుల సహవా సము కావలెను. అది లేకయుండిన గొప్పదుఃఖము ఘనను లేక

ఒకవేళ శరీరమునుండి ప్రాణము బయటవచ్చుటయైనను గలుగును.

సిద్ధిపొందిన గురుసాన్నిధ్యములేక ఈ రాజయోగమా దేనిచే స్థితిపొందదో, చేయఁదగినదియుగాదో, అందుచే శాస్త్రములయందు దీనిని, స్పష్టముగా వ్రాయలేదు. ఇందు చేతనే మేమున్ను దీనిని విస్తారముగాఁజెప్పలేదు. సంగ్రహముగా చెప్పితిమి.

3. యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సవికల్పసమాధి, అను అష్టాంగములును సిద్ధించినపిమ్మట, లయము, విక్షేపము, కషాయము, రసాస్వాదము, అనువాల్గు విఘ్నములవిడిచి, లేచుసంస్కారమును జెఱచి, నిరోధసంస్కారమును బైలుపఱచు పూర్వోక్తత్రిపుటి భావమా లేని బ్రహ్మాకారవృత్తియొక్క స్థితియగు నిర్వికల్పసమాధి జ్ఞానక్రియ ఉభయసాధ్య రాజయోగమగును. ఈ కాలపు మనుష్యులకు, ఈ రాజయోగము మిక్కిలి దుర్లభమైనను పుణ్యముచే పరిపక్వము పొందినయోగభ్రష్టుఁడు ఎవనికైనను గొంచెముకలుగును, దీనిని మిక్కిలి అభ్యసించుటచే క్రమముగా నైదవ, యాఱవ యేడవభూమికల ప్రాప్తికలుగును.

జీవన్ముక్తి విదేహముక్తులన్ననో బ్రహ్మాత్మలయైక్య నిశ్చయమైన తత్త్వజ్ఞానముచేతనే కలుగుచున్నవి. కావున తత్త్వజ్ఞానము గొఱకైనను జీవన్ముక్తి విదేహముక్తిగొఱకైనను, విద్వాంసునకు చేయవలసినవి యొక్కటియులేదు. అట్లయినను, వైరాగ్యము, బోధము, ఉపశమము అనుమూడును ఒకేచోటనుండుటకు, హేతువుగాఁజెప్పంబడు ఈ యభ్యాస

మేదియోయది జీవన్ముక్తి *190 విలక్షణానందమునుగోరుభక్తొ తోపాసకుఁడగు (జ్ఞానమునకుముందు పూర్ణమగు సగుణనిర్గుణ ఉపాసనలులేని) విద్వాంసునకు కర్తవ్య (చేయవలసినదను) బుద్ధిలేకయే తనయిచ్ఛచొప్పున చేయఁదగినది.

124. ముందుజెప్పిన శిష్యునికి హఠయోగపూర్వకముగా రాజయోగమును జేయుటవలన నేమిఫలముకలిగెనని చెప్పఁబడుచున్నది.

ముందుజెప్పిన శిష్యుఁడు జీవించియుండు అవస్థయందు క్రియముతోఁగూడిన జీవన్ముక్తియొక్క విలక్షణానందమును అనుభవించెను.

మరల యెప్పుడు ప్రారబ్ధకర్మమునకును అంతము కలిగెనో అప్పుడు శాస్త్రమునఁజెప్పఁబడినట్లు గంగ మొదలగు తీర్థముల తీరమగు పవిత్రదేశమందును ఉత్తరాయణము మొదలగు పవిత్రకాలములయందును బ్రహ్మధ్యాన పూర్వకముగా దేహమును విడిచెను.

---

* 190. నిరావరణమయి పరిపూర్ణమయి వృత్తితోఁ గూడినదయి యుండునదేదియోయది విలక్షణానంద మనఁబడుచున్నది. సుషుప్తియందుండు ఆనందము ఆవరణముతోఁ గూడినదయియున్నది. విషయములందున్న ఆనందము నిరావరణమయియున్నదయినను విషయప్రాప్తిక్షణమునయెప్పుడు అంతర్ముఖవృత్తి కలుగుచున్నదో, అప్పుడు దానియందు స్వరూపానందప్రతిబింబము, పడుచున్నది, కావున పరిపూర్ణముకాదు. అయితే ఏకదేశమందుండునదిగా నున్నందున పరిచ్ఛిన్నమగును. ఆత్మపూర్ణానందమో అజ్ఞానియొక్క స్వరూపమగును. అట్లయినను అదినిరావరణమును నెదురుముఖవృత్తితోఁ గూడినదియుఁగాదు. విదేహముక్తియందున్న నిరావరణ పూర్ణానందము వృత్తితోఁగూడినదికాదు. వృత్తిలేనిదగును. కావున నిరావరణమున్న పరిపూరణమున్న వృత్తితోఁగూడినదియునయిన ఆనంద రూపము విలక్షణానంద లక్షణమగును. దీనియందొకచోటను అతివ్యాప్తి మొదలగు దోషములేదు.

విద్వాంసునికి దేహమును విడుచుటలో నొకదేశకాల మొదలగువాని అపేక్షఆవశ్యము లేదు. అయినను యోగాభ్యాసముయొక్క ప్రబలత్వముచేవాఁడు శాస్త్రమందు జెప్పినట్లు దేహమునువిడిచెను. కర్తవ్యబుద్ధిచేగాదు.

125. ఇప్పుడు గ్రంథకర్త గ్రంథమును సమాప్తిచేయువాఁడై గ్రంథముయొక్క ఫలరూప మోక్షమును జెప్పుచున్నాఁడు:— ఈముందు చెప్పినవిధమగు అద్వైతరసమును గ్రోలువానికి శుద్ధబ్రహ్మముయొక్క ప్రాప్తియగు సుందర ముక్తిగలుగును. పిమ్మట దేహధారణయగు జన్మము కలుగదు. ఏలయనగా,

దేనిచేత జన్మమగు గర్భముగల అజ్ఞానము మొదలగు జగత్తు దృష్టియందు లేశమాత్రమయినను లేదో, అనగా జ్ఞాన బలముచేత అత్యంతము నివృత్తియగుచున్నదో, దానిచేత ఆ విదేహముక్తిపొందిన పండితునకు మరలజన్మము కలుగుటలేదు. ఇది యుక్తమగును.

విదేహమోక్షమందు జన్మాదివికార శూన్యమయిన విద్వాంసునకు స్వరూపమెక్కడిది? యనిచెప్పుచున్నాఁడు:— విదేహముక్తినిబొందిన విద్వాంసుఁడు శుద్ధసచ్చిదానందమయ స్వప్రకాశ బ్రహ్మరూపమగుచున్నాఁడు,

౧. శంక:—విదేహమోక్షమును బొందిన విద్వాంసునికి జన్మాది వికారముతోఁగూడిన స్వసంఘాతరూప జగత్తునివృత్త మయినను ఈశ్వరభావముయొక్క ఉపాధియగు మాయయును దానిచే ఉపలక్షింపఁబడిన ఈశ్వరత్వమును ఆయీశ్వరునిచేఁ జేయఁబడిన జగత్తున్ను అను నీమూడును మోక్షకాలమునందును మిగులుచున్నవి. కావున విద్వాంసునకు జన్మాదులకు

కారణమయిన మాయయును ఈశ్వరత్వమును జగత్తును ఉండు టచే మరలజన్మమొదలగువాని ప్రాప్తికలుగును. గావున రాగలజన్మము మొదలగువాని అభావరూప విదేహమోక్షము సిద్ధింపదు.

౨. వేఱుశంక:—విదేహమోక్షకాలమందు సకలానర్థముల నివృత్తియొక్క ముఖ్యస్వరూపముగానయిననులేక అధిష్ఠాన మయియుండంబట్టి బాధచే స్వరూపముగానయిన నుండు విద్వాంసుని ఆత్మరూపబ్రహ్మమేదియో యది తెలియంబడ నిదా ? లేక తెలియఁబడినదా ?

(౧) తెలియఁబడనిదని చెప్పుదమన్నను విదేహముక్తి కాలమందును బ్రహ్మమునందు అజ్ఞానముండగా విద్వాంసు నకు జన్మమొదలగువాని అభావము సంభవింపదు.

(౨) ఆ బ్రహ్మము తెలియంబడినదను రెండవపక్షమును జెప్పంబోయిన, ఏవస్తువు తెలియఁబడినదో దానియందు ఘట మందు ఘటత్వమువలె జ్ఞాతత్వరూపధర్మము అవశ్యముం డును. ఆ, జ్ఞాతతరూపధర్మము ఆబ్రహ్మమునకు, విశేషణమా? లేక ఉపాధియా ? యనిరెండు వికల్పములుగలవు, వానిలో జ్ఞాతత్వమున బ్రహ్మముయొక్క విశేషణముగానయినను ఉపాధిగానయినను జెప్పిన * 191. విశేషణమయినది. * 192. ఉపాధియయినను, వర్తమానకాలముననే యుండి

*191. విశేష్యముయొక్క కార్యసంబంధియై వర్తమానవ్యావర్తకమేది యోయది విశేషణమనఁబడుచున్నది ఇది విశేషణముయొక్క లక్షణమగును.

* 192. ఉపహితముయొక్క కార్యసంబంధములేనిదై వర్తమానవ్యా వర్తకమగునదేదియోయది ఉపాధియనఁబడుచున్నది. ఇది ఉపాధియొక్క లక్షణమగును.

(౧) అట్లే ఎవనికి అధిష్ఠానబ్రహ్మముయొక్క జ్ఞానము కలుగుచున్నదో వానిదృష్టిచే, తనకును నితరులకును భ్రాంతికి విషయమగు మాయయును నీశ్వరత్వమును జగత్తున్ను విదు చుచున్నది.

(౨) ఏవార్లకు అధిష్ఠానబ్రహ్మముయొక్క జ్ఞానము కలుగ లేదో వారియొక్క దృష్టిచే, మాయ, ఈశ్వరత్వము, జగము, అనునవి స్వభావముగానే అనాదిసిద్ధమయి నెలకొనియున్నవి.

ఇది మొదటి శంకయొక్క సమాధాన రహస్యము చెప్పఁబడినది.

౨. రెండవ శంకకుముందుచెప్పిన సమాధాన రహస్య మిది:—

కాకము వ్రాలియుండు దేవదత్తుని యింటికి కాకము ఉపలక్షణమగును.

వర్తమానకాలమందును భావికాలమందును ఏదిదేని వ్యావర్తకమై (యితరములనుండి వేఱుపఱచి యెఱింగించు నది) అగునో అది దాని యుపలక్షణమగును.

కాకము వర్తమానకాలమున తనయునికిగలదై భవి ష్యత్కాలమున తనలేమిగలదియైనను ఈకాకముగల యిల్లు అనునదిగా నాదేవదత్తుని యింటిని తక్కిన కాకసంబంధము లేనియిండ్లనుండి వేఱుపఱచి యెఱిఁగించుచున్నది, కావున యీకాకి దేవదత్తుని యింటియొక్క ఉపలక్షణమనఁబడు చున్నది. అట్లే విద్వాంసుని స్వస్వరూపబ్రహ్మము జ్ఞానము నకు విషయమయియుండుటవలన జ్ఞాతయగుచున్నది. ఆ జ్ఞాత యగు బ్రహ్మముయొక్క జ్ఞాతత్వరూపు ధర్మపు కల్పన కలుగు

చున్నది. ఆ జ్ఞాతతారూపధర్మము బ్రహ్మముయొక్క ఉపల క్షణమగును. అని మేము అంగీకరించియున్నాము.

దేనిచే జ్ఞాతత్వరూపధర్మము వర్తమాన (జీవన్ముక్తి) కాలమందు తనయునికి గలదియై [illegible] తనలేమి గలదియైనను ఈ విద్వాంసుని స్వస్వరూప బ్రహ్మము జ్ఞాతము (జ్ఞాతత్వరూపధర్మ [illegible])

ఈ విధముచే విద్వాంసుని స్వరూప రూప బ్రహ్మమును, అవిద్వాంసుల స్వరూపరూప అజ్ఞాత (అజ్ఞానముచే మూయఁబడిన) బ్రహ్మమునుండి వేఱుపఱచి యెఱిగించునదిగా నున్నందున ఆజ్ఞాతత్వరూపధర్మము విద్వాంసుల స్వరూపరూప బ్రహ్మపు ఉపలక్షణమగును. ఆ జ్ఞాతతారూప ఉపలక్షణ ముతోఁగూడిన కల్పితముయొక్క నివృత్తిరూప విద్వాంసుల స్వరూపమగు బ్రహ్మమేదియో యదిజ్ఞాతతయొక్క యుపల క్షిత మనఁబడును.

ఈ విధముచే విదేహమోక్షకాలమందు జ్ఞాతత్వరూప ధర్మముయొక్క అభావముగలదైనను ఈవిద్వాంసుని స్వరూప రూపబ్రహ్మము *194. జ్ఞాతమగును, అని యన్యులచే వ్యవ హరింపఁబడుచున్నది. విద్వాంసుల విదేహమోక్షకాలమందు ద్వైతము పొందుటలేదు, కావున మేము చెప్పినదియంతయు శ్రేష్ఠమగును.

తొమ్మిదవ యుపదేశము ముగిసెను.

శ్రీ వేదాంత బాలబోధము సమాప్తము.

---

*194. శుకులు మొదలగు మహాత్ములు బ్రహ్మజ్ఞానులయిరి. ఇట్లు అన్యులందు ప్రసిద్ధిచే జ్ఞానుల స్వరూపరూప బ్రహ్మముయొక్క జ్ఞాతత్వ ముయొక్క వ్యవహారము కలుగుచున్నది.

గరిమ, నీబాలబోధ, మన్గ్రంథమమును
మహిత నేర్చెదు వ్యాసాశ్రమమున, వెలయు
తీర్థపాదులు, మలయాళ దేశికులకు,
భక్తిపూర్వక వందనం - బాచరించి
వారియాజ్ఞానుసారంబు - వరుసనుగొని,
[illegible] నానొప్ప - భవ్యగ్రంథ
వరుస పై - కుప్పుస్వాములు - ధరనుహింది
భావయుందుండి, తమిళంబు - కరగఁజేసి
నట్టి నీగ్రంథరాజంబు - నయగుణనిధి
సద్గుణాళువు సంపూర్ణ సదయహృదయు
డైన కార్యకారిపుల్లెల - శంకరయ్య
నాయునింగారు (మరియు) నింటూరిరామ
స్వామి నాయునింగారుల సాయమున
రమణఁగార్యకారి రామాశ్రమమున వెలయు
సరస శ్రీ.శివరాజానంద స్వామివారి
సవరణంబున నామూర్తి - సార సుకవి
పావయార్యుని పుత్రుండు - భక్తరతుడు
నైనకృష్ణయ్య యాంధ్రాను వాదనంబు
జేసెనీయోగ శాస్త్రంబు శివునికరుణ
యోగిజనులకుఁజాలఁ బ్రయోజనముగ
నుండితారార్కమై వెలయుచుండుగాత !

సర్వేజనాస్సుఖినోభవంతు
ఓం తత్ సత్

---